అపరాధ పరిశోధన అనుబంధం—123

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ముగ్గురు పోటీ
రచన: బొమ్మిడి అచ్చారావు

## మహా ప్రస్థానం
రచన: పి. చంద్రశేఖర అజాద్

## చంపకమాల
రచన: టెంపోరావ్

## ఇండియా స్కెలిటన్స్
రచన: ప్రతాప రవిశంకర్

కళ్యాణదుర్గం - నాల్గవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—123
మార్చి, 1984
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ముగ్గురు పోటీ

బొమ్మిడి అచ్చారావు

ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ శవాన్ని పరిశీలనగా చూశాడు.

హతుడికి యిరవై రెండేళ్ళుండవచ్చు. ఒంటిమీద ఎక్కడా చిన్న గాయం కూడా కనిపించటంలేదు. ఇంకా నిద్రపోతున్నట్టే వున్నది ముఖం!

కాని అతని ఊపిరి నిలిచిపోయి చాలా సేపయిందనటానికి నిదర్శనంగా రిగర్ మర్టిస్ ప్రారంభమయింది.

శ్రీనివాస్ అయిస్‌గడ్డలా తగిలిన చేతిని అలాగే వదిలి, లేచి నించుని చుట్టుపక్కల యేవైనా ఆధారాలు దొరుకుతాయేమోనని పరీక్షగా చూస్తున్నాడు.

వేలిముద్రల నిపుణుడు, ఫోటోగ్రాఫరు తమ పనుల్లో నిమగ్నమయి వున్నారు.

సమయం ఉదయం పదిగంటలు కావస్తోంది. యెండా కాలపు యెండ చుర్రుమనిపిస్తోంది.

అప్పటికే గవర్నమెంటు పాథాలజిస్టు తన ప్రాథమిక పరీక్ష పూర్తిచేశాడు. శ్రీనివాస్ ప్రశ్నార్థకంగా

చూశాడు.

"నా ఊహ నిజమైతే హతుడ్ని, నరంలోనికి సైనేడ్ యింజెక్టు చేసి చంపేశారు. శరీరం నీలిరంగుకి తిరగటం గమనించారా?" అన్నాడు డాక్టరు శ్రీనివాస్ వంక తిరిగి.

శ్రీనివాస్ తలూపాడు. "టైం చెప్పగలరా?" అన్నాడు.

డాక్టరు రెండు క్షణాలు యేదో గుణించుకుని, "తెల్లవారుఝామున రెండు, మూడు గంటల మధ్య కావచ్చు!" అన్నాడు.

శ్రీనివాస్ తలూపి, "చంపేశారు అని ఖచ్చితంగా ఎలా చెప్పగలరు? హతుడు సైనేడ్ తనే యింజెక్టు చేసుకుని వుండొచ్చుకదా!?" అన్నాడు.

"ఎంతో అనుభవముంటేనేగాని స్వంతంగా ఇంట్రావీనస్ యింజక్షన్ చేసుకోవటం సాధ్యంకాదు. హతుడు ఇంకా యవ్వన ప్రాంగణంలో వున్న కుర్రవాడు. వైద్య శిక్షణవున్నవాడైతే సెల్ఫ యింజక్షన్ సాధ్యమే!"

శ్రీనివాస్ ఆయన చెప్పిన విషయాలు జాగ్రత్తగా మననం చేసుకున్నాడు. పరిసరాలు పరిశీలనగా చూశాడు.

సిటీకి పదికిలోమీటర్ల దూరంలో వున్న ద్రాక్షతోట అది! దాని యజమాని యూసుఫ్. అతనికి ఉదయం తొమ్మిది గంటలకి తన తోటలో శవం కనిపించగానే హడావిడిగా శ్రీనివాస్‌కి ఫోన్ చేసి తెలియపరిచాడు. శ్రీనివాస్ వెంటనే తన బలగంతో రంగంలోకి దిగాడు.

యూసుఫ్‌ని ప్రశ్నించినా పెద్దగా ఉపయోగపడే సమాచారం దొరకలేదు. రాత్రి సమయంలో అక్కడ కాపలావుండే వాచ్‌మన్ కూడా, ఆ శవం అక్కడికి

యెప్పుడు యెలా వచ్చిందీ చెప్పలేకపోయాడు. అక స్మాత్తుగా తమ తోటలో శవం కనిపించటం వింతగా, ఆశ్చర్యంగా వున్నదని చెప్పాడు.

శ్రీనివాస్, శవానికి నాలుగడుగుల దూరంలో పడి వున్న వస్తువును పైకి తీశాడు.

అది ఇంకు పెన్ను. చైనా యూత్ కంపెనీది!

శ్రీనివాస్ వేలిముద్రల నిపుణుడ్ని పిలిచి దానిమీది వేలిముద్రలకోసం ప్రయత్నించమన్నాడు. తర్వాత దాన్ని తన జేబులో భద్రపరిచాడు.

శవం షర్టు జేబులో దొరికిన ఫీజు రశీదునిబట్టి అతను సైన్సు కాలేజిలో బి.యస్సి. ఫైనలియర్ చదువుతున్నట్టు, పేరు రమేష్ అనీ గ్రహించాడు శ్రీనివాస్. ఆ వర్రా దెవరైనదీ ఆ మాంకీ తెల్సుకోవటం కష్టంకాదు!

శ్రీనివాస్‌కి అది హత్యేనని తెలిసిపోతూనే వుంది! ఆత్మహత్య చేసుకునేవాడు యింత దూరం రానవసరం లేదు. హాయిగా, తన యింట్లోనే విషం తాగి చచ్చివుండే వాడు. విషం యింజక్టు చేసుకోడు! శావాలనే ఎవరో చేసిన పని యిది! ప్రాణంతీసి ఆ తర్వాత జాగ్రత్తగా తీసుకొచ్చి యీ తోటలో పారేసిపోయాడు!

శ్రీనివాస్ ఆలోచిస్తూ నిల్చుండిపోయాడు.

సార్జంట్ శివం "మార్చ్యురీకి తరలించమంటారా సార్?" అని అడిగేవరకు యీ లోకం లోనికి రాలేదు. మౌనంగా తలాడించాడు.

* * *

"రమేష్ నిన్న రాత్రి రెండో ఆట సినిమాకు వెళ్తానని చెప్పి పోయాడట సార్ యింట్లో! రాత్రంతా రాకపోయేసరికి అతని తల్లి టూటౌన్ స్టేషన్‌లో పోలీసు

రిపోర్టిచ్చిందట! మార్చ్యురీ దగ్గర పాపం, రమేష్ తల్లి నేలమీద పొర్లి యేడుస్తూంటే చూడలేకపోయాను సార్....!" సార్జంట్ రాజు చెప్పాడు.

ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ రాజువంక చూసి, "రమేష్ ఒక్కడే వెళ్ళాడో, వెంట ఎవరైనా వున్నారో అడిగావా?" అన్నాడు.

"ఒక్కడే వెళ్ళాడట సార్! అతని స్నేహితుల వివరాలు కూడా సేకరించాను. ఇదిగో సార్ లిస్టు!" శివం ఓ లిస్టు అందించాడు.

"మీరిద్దరు వెళ్ళి రమేష్ చదువుతున్న కాలేజిలో అతని గురించి, అతని నడవడిక గురించి, అతని శత్రువుల గురించి, ఈ మధ్య అతనెవరితోనైనా గొడవలుపడితే ఆ వివరాలు అన్నీ సేకరించుకుని రండి! చాలా జాగ్రత్తగా ప్రతి చిన్న విషయమూ రికార్డు చేసుకోండి!" అన్నాడు శ్రీనివాస్ రాజు, శివంలవంక హెచ్చరిస్తూనట్టు చూసి.

ఇద్దరు శాల్యూట్ చేసి వెళ్ళిపోయాక, యేదో నంబరు రింగ్ చేయబోయాడు శ్రీనివాస్, కాని యెంగేజ్డ్ రావటంతో రెస్టుమీద రిసీవర్ పెట్టేశాడు.

ఆ మరుక్షణం ఫోన్ గణగణ మోగింది.

శ్రీనివాస్ అందుకుని, "హల్లో, క్రైం బ్రాంచ్!" అన్నాడు.

అవతల్నుంచి యెవరో చాలా ఆత్రుతగా ఫోన్ చేస్తున్నారు. "మీరు వెంటనే శారదానగర్ ప్లాట్ నంబర్ నలభై మూడుకి రావాలి. ఇక్కడ ఓ హత్య జరిగింది. అర్జంటు!"

శ్రీనివాస్ ఎలర్టుగా అయాడు కుర్చీలో. వెంటనే లేచి నించుని, "ఎస్ కమింగ్!" అని ఫోన్ పెట్టేశాడు.

సమయానికి సార్జంటులిద్దరు లేరు! హెడ్ క్వార్టర్సుకి ఫోన్ చేసి ఫింగర్ ప్రింట్సు ఎక్స్‌పర్టుని, ఫోటోగ్రాఫర్ని, డాక్టర్ని యెక్కడికి పంపవలసింది వివరంగా చెప్పి సిబ్బందిని తీసుకుని జీప్‌లో బయల్దేరాడు.

జీప్ శారదానగర్ వైపు పరుగెత్తింది.

## 2

శారదానగర్ ప్లాట్ నెంబర్ నలభైమూడులోని బెడ్‌మీద అచేతనంగా పడివున్న ఆ అమ్మాయి శవం వంక కాసేపు అలాగే చూస్తూవుండిపోయాడు శ్రీనివాస్.

ఆ అమ్మాయి చాలా అందగత్తె. నిండా యిరవై లేవు. నిండు యౌవ్వనంలో వున్నది! ఎర్రటి శరీరచ్ఛాయ నీలం రంగుకు తిరగటానికి సిద్ధంగా వున్నది!

"సేమ్ కంప్లెయింట్స్! సైనేడ్ ఇంట్రావీనస్ యింజక్షన్!" అన్నాడు డాక్టరు కుడిచేతి వెయిన్‌వంక పరీక్షగా చూస్తూ.

శ్రీనివాస్ ఉలిక్కిపడి చూశాడు.

"బహుశా రెండు హత్యలకూ సంబంధముండివుండాలి! ఇది ఆత్మహత్య కాకటాని కవకాశముందంటారా డాక్టర్?" అన్నాడు.

"ఇందాకటి కేసులాంటిదే కదా! యెడమచేత్తో కుడిచెయ్యి నరంలోకి యింజెక్టు చేసుకోవటం అంత తేలికైన విషయం కాదు! దానికి చాలా ప్రాక్టీస్ కావాలి" అన్నాడు డాక్టరు.

"అయితే ప్రాణంపోయి ఎంతసేపయి వుంటుంది?"

"సైనేడ్ ఇంజక్టుచేసిన క్షణాల మీద ప్రాణం పోతుంది. ఇది ఓ గంట క్రితమే జరిగుండాలి! శరీరం వేడిమిని పూర్తిగా కోలుపోలేదు" అన్నాడు డాక్టరు.

గంట క్రితమే జరిగిందంటే, పట్టపగలు యింట్లోకి వచ్చి జాగ్రత్తగా ఇంట్రావీనస్ యింజక్షన్ చేయగలిగే టంత సావకాశం వున్న హంతకు డెవరుంటారు? అంటే, ఆ హంతకుడు హతురాలితో చాలా సన్నిహిత సంబంధ మున్నవాడో, చాలా దగ్గరవాడో అయివుండాలి!

శ్రీనివాస్ కన్నీరు మున్నీరుగా విలపిస్తూన్న హతురాలి తల్లిని దగ్గరగా పిలిచాడు.

"ఆ అమ్మాయి పేరేమిటండీ?" అనడిగాడు.

"సరళ!"

"మీ కేమవుతుంది?"

"నా బిడ్డేనండి. పెద్ద కూతురు. దాని తర్వాత ఓ అబ్బాయి పదిహేనేళ్ళవాడు. టెన్త్ చదువుతున్నాడు."

"మీవా రేం చేస్తూంటారు?"

"మెడికల్ రిప్రజెంటెటివ్. రెండు రోజులుగా కేంప్‌లో వున్నారు. టెలిగ్రాం యిచ్చాం."

"మీ అమ్మాయి చనిపోయి వుండగా ముందుగా ఎవరు చూశారు?"

"నేనే బాబూ! కాలేజినుంచి ఓ గంటన్నర క్రితమే వచ్చి, తల నొప్పిగా వున్నదని పడుకుంది. నేను టీ పెట్టి యిచ్చి, యేదైనా క్రోసిన్‌వంటి టాబ్లెట్లు తెచ్చిద్దామని రోడ్ మీదికి వచ్చాను. ఇంట్లో ఎవరూ లేరు. మా అబ్బాయి అప్పటికి స్కూలునించి తిరిగిరాలేదు. నేను తిరిగొచ్చేసరికి అమ్మాయి బెడ్ మీద కదలక మెదలక పడివున్నది. నాకు ఆ పడుకున్నతీరు అసహజంగా వున్నట్టనిపించి, కదిపి చూశాను. చనిపోయి వుంది."

"మీ అమ్మాయిని మీరు బయటకు వెళ్ళిన కొద్ది సేపట్లోనే ఎవరో చంపి వుంటారనుకున్నాను, అవునా?"

"అవునండి!"

"చంపారని ఎలా అనుకున్నారు?"

"అమ్మాయి చేతినుంచి రక్తం కారుతోంది. చూశాను. నరం దగ్గర్నుంచి రక్తం వస్తోంది. కింద పగిలిపోయిన సిరంజ్ ముక్కలు కనిపించాయి. పక్క యింటివాళ్ళు ఎవరో పాతికేళ్ళ కుర్రాడు నేను బయటికి వెళ్ళాక హడావిడిగా లోపలికొచ్చి, అంత హడావిడిగాను వెళ్ళి పోయాడని, బహుశా అతను మా అమ్మాయి ఫ్రెండు కావచ్చునని, అనుమానించలేదనీ చెప్పారు. దాన్నిబట్టి అమ్మాయిని యేదో యింజక్షనిచ్చి చంపేశాడని నిర్ణ యించుకున్నాను."

శ్రీనివాస్ ఆమె చాలా తెలివైనదని గ్రహించాడు.

"మీరు కరెక్టుగా ఊహించారు. మీ పక్కింటి వాళ్ళను, అదే ఆ యువకుడ్ని చూసిన వాళ్ళను, యిలా పిలుస్తారా?" అడిగాడు.

అయిదు నిమిషాల తర్వాత ఓ నడివయసావిడ లోపలి కొచ్చి నిల్చుంది.

"అమ్మా, మీరు ఎవరో అబ్బాయి ఇంట్లోకి రావటం, మళ్ళీ వెళ్ళిపోవటం చూశారట కదా! ఆ అబ్బాయిని వర్ణించగలరా?"

"నేను ప్రత్యేకంగా గుర్తుపెట్టుకోలేదు బాబూ! నల్లగా తుమ్మ మొద్దులాగా వున్నాడు. మోటరుసైకిలు మీద వచ్చాడు. చేతిలో చిన్న పెట్టెలాంటిది వున్నది! అయిదు నిమిషాలు కూడా కాకుండా నే బయటికొచ్చి మళ్ళీ మోటారుసైకిలుమీద హడావిడిగా వెళ్ళిపోయాడు. చూస్తే గుర్తుపట్టగలనేమో....!" అన్నదావిడ.

"ఇదివరలో ఆ కుర్రాడు యింటికి రావటం మీరు

చూశారా?"

"లేదండి. చూస్తే గుర్తుపట్టి వుందేదాన్ని!"

"సరే, మీరు వెళ్ళండి!" అన్నాడు శ్రీనివాస్.

తర్వాత, సరళ తల్లివైపు తిరిగి, "మీ అమ్మాయికి మగ స్నేహితులెవరున్నారో చెప్పగలరా?" అన్నాడు.

"నాకు తెలిసి దానికి అబ్బాయిలెవరూ స్నేహితులు లేరండి. విద్య, విశాల, మనోరమ—అనే ముగ్గురు స్నేహితురాళ్ళు మాత్రం వున్నారండి!"

"వాళ్ళ అడ్రసులు చెప్పండి!"

ఆమె చెప్పింది. శ్రీనివాస్ నోట్ చేసుకున్నాడు.

"మీవారు రాగానే స్టేషన్‌కోసారి రమ్మని చెప్పండి! పోస్టుమార్టంకాగానే మీ అమ్మాయిని అప్పగిస్తాం. మీకు యేవైనా విషయాలు మాకు చెప్పవలసినవి గుర్తొస్తే నాకు ఫోన్ చెయ్యండి" అన్నాడు.

# 3

సార్జంటు శివం రమేష్ స్నేహితుల వివరాలు సేకరించుకువస్తే, సార్జంటు రాజు అతని విరోధుల వివరాలు తెల్సుకుని వచ్చాడు.

"ఈమధ్య నరేష్ అనే కుర్రాడితో రమేష్ కొట్లాడటం జరిగిందట సార్! నరేష్ రమేష్ అంతుచూస్తానని శపథం చేసినట్టు, ఆ విషయాన్ని అంతటితో రాజీ చేయటానికి కొందరు విద్యార్థులు ప్రయత్నించినట్టు తెలిసింది. నరేష్‌కాక అంతకుముందు పార్థు అనే మరో కుర్రాడు కాలేజి ఎలక్షన్ల విషయంలో రమేష్‌తో బాగా ఘర్షణ పడ్డాడట. ఇరు వర్గాలవారు కొట్టుకోవటం, రాజకీయంగా దానికి అనవసరమైన ప్రాధాన్యత నివ్వటం జరిగింది.

"ఇంకో యింట్రెస్టింగ్ సంగతేమిటంటే, సరళ—అదే రెండో కేసులో హంతకురాలు రమేష్ ప్రియురాలు. ఆమె రమేష్‌ని యిష్టపడటం ఓర్వలేని ఆమెని ప్రేమించిన యిద్దరు కుర్రాళ్ళు రమేష్‌కోసం వలవేసుకుని వున్నారు. వాళ్ళ పేర్లు గిరి, గోపాల్రావు. ఇవిగో వాళ్ళ అడ్రసులు. వీళ్ళందరు క్లాస్‌మెట్సు కావటం విశేషం!" అన్నాడు రాజు.

శ్రీనివాస్ వాళ్ళ పేర్లు, విలాసాలు చూసి తల పంకించాడు. "గుడ్! సరళ కేసుతో రమేష్ కేసు కేదైనా కనెక్షనుందా అనుకున్నాను. లింక్ అందింది. బహుశా హంతకుడు కూడా ఒకడే కావచ్చు. యెందుకంటే రెండు కేసుల్లోను పైనేడ్ నుపయోగించటం జరిగింది. విద్య, విశాల, మనోరమ అనబడే ముగ్గురు స్నేహితురాళ్ళున్నారు సరళకు. వాళ్ళకు సరళ అంతరంగిక విషయాలు తెలిసే వుంటాయి. సరళ కేసు ముందుకు నడవటానికి వాళ్ళు చెప్పే విషయాలు ఉపకరిస్తాయి.

నరేష్, పార్థు, గిరి, గోపాల్రావు వీళ్ళ నలుగురి ఎలిబీలు బాగా పరిశీలించి, రమేష్ హత్య జరిగిన రాత్రినుంచి మర్నాటి ఉదయంవరకు వాళ్ళు యెక్కడెక్కడ తిరిగిందీ వివరాలు సేకరించండి."

వాళ్ళిద్దరు వెళ్ళిపోయారు. శ్రీనివాస్ సరళ హత్య గురించి డాక్టరు యిచ్చిన పోస్టుమార్టం రిపోర్టు వివరాలు పరిశీలిస్తుండగా ఫోన్ మోగింది.

"హల్లో, క్రైంబ్రాంచ్!" అన్నాడు రిసీవర్ ఎత్తి.

"రమేష్‌ను హత్యచేసిందెవరో తెలుసుకోవాలని వుందా?" అన్నది అవతలి కంఠం.

శ్రీనివాస్ ఉలిక్కిపడి కుర్చీలో సర్దుకుని కూచు

న్నాడు.

"ఆఁ, ఎవరు?" అన్నాడు తొందర తొందరగా.

"నరేష్!" అన్నది అవతలి కంఠం.

"హలో, మీరెవరు? యెక్కడ్నుంచి మాట్లాడు న్నారు?" శ్రీనివాస్ అడుగుతుండగానే అవతల ఫోన్ క్లిక్‌మని వినిపించింది.

"హల్లో, హల్లో" అంటూనే వున్నాడు శ్రీనివాస్. ఫోన్ క్రెడిల్ చేస్తూ ఆలోచనలో పడ్డాడు.

ఇంతలో మళ్ళీ ఫోన్ మోగింది. వెంటనే ఎత్తాడు.

"హల్లో, క్రైం బ్రాంచా?" అన్నారెవరో అవతలున్నుంచి.

"ఎస్ ప్లీజ్, మీరెవరు?" అడిగాడు శ్రీనివాస్.

"ఇనస్పెక్టర్ శ్రీనివాస్ కావాలి!"

"మాట్లాడుతున్నాను."

"రమేష్‌నెవరు చంపారో తెలుసుకున్నారా?"

"లేదు. మీకు తెలుసా?"

"తెలుసు."

"ఎవరు?"

"సురేష్ మాత్రం కాదు!"

"మరెవరు?"

"పారు!"

"ఈజిట్? మీరెవరు? అతనే హంతకుడని ఆధారాలున్నాయా?"

"అది మీ పని!"

"హల్లో మీరు...." శ్రీనివాస్ మాటలు పూర్తి కాకుండానే అవతల ఫోన్ పెట్టేశాడతను.

శ్రీనివాస్ తల విదిలించాడు. ఏమిటీ ఫోన్ కాల్స్

ఎవరు చేస్తున్నారు? రెండు ఫోన్స్ ఒకరు కాదు చేసినది? వేరు వేరు కంఠాలు!

మూడోసారి ఫోన్ మోగుతుండగానే ఎత్తి "హల్లో క్రైంబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ మాట్లాడుతున్నాను" అన్నాడు వెంట వెంటనే.

ఫోన్‌లో నవ్వు వినిపించింది. "ఏమిటి సార్, అంత హడావిడి?" అన్నది అవతలి కంఠం.

"మీరెవరు? మీరు చెప్పాలనుకున్నదేమిటి?"

"రమేష్ హంతకుడి గురించి!"

"ఎవరు, చెప్పండి?"

"గిరి!"

"గిరా? ఎవరు మీరు?"

"మీ శ్రేయోభిలాషిని!" ఫోన్ పెట్టేసిన చప్పుడు.

శ్రీనివాస్‌కి ఆ ముగ్గురు వ్యక్తులమీదా బాగా కోపం వచ్చింది. ఎవరో పేరు చెప్పకుండా తనతో జోక్ చేస్తున్నారు. ఎవరు వాళ్ళు?

మళ్ళీ ఫోన్ మోగింది. ఎత్తకూడదనే అనుకున్నాడు. కాని అతని చేతులు అప్రయత్నంగా రిసీవర్‌ని అందుకున్నాయి.

"హల్లో ఎవరు మాట్లాడేది?"

"ఇనస్పెక్టర్ శ్రీనివాస్‌గారేనా మాట్లాడేది?"

"ఎస్, నేనే!"

"రమేష్ హత్య విషయం నాకు తెలిసిన వివరాలు చెప్పాలని ఫోన్ చేశాను."

"ఏమిటి, చెప్పండి!"

"రమేష్‌ని గోపాలరావు చంపేశాడు."

"వాట్?"

"అవును మిస్టర్ ఇనస్పెక్టర్! వాకబు చెయ్యండి!"

"మీరెవరు? ఎక్కడ్నుంచి?"

"ఆ వివరాలు అనవసరమనుకుంటాను" ఫోన్ పెట్టేశాడు అవతలి వ్యక్తి.

శ్రీనివాస్ రిసీవర్ క్రెడిల్ చేసి, తల పట్టుకున్నాడు. అనుమానితులు నలుగురు. వాళ్ళ పేర్లు ఫోన్లో నలుగురు వ్యక్తులు చెప్పారు. ఒక గొంతుకి రెండో గొంతుకి ఎక్కడా పోలికలేదు. వేర్వేరు వ్యక్తులు చేశారన్నది నిర్వివాదాంశం.

మళ్ళీ ఫోన్ మోగింది. శ్రీనివాస్‌కి చాలా కోపంగా వుంది. కోపంగా ఎత్తాడు.

"హల్లో, ఇనస్పెక్టర్ శ్రీనివాస్‌గారా?" అన్న ఆడగొంతు విన్పించగానే సర్దుకుని, "ఎస్. మీరెవరు?" అన్నాడు.

"నేను యెవరైతేనేం లెండి, సరళను హత్య చేసిందెవరో చెప్పమంటారా?" అన్నది అవతలి స్త్రీ.

శ్రీనివాస్‌కి పిచ్చికోపం వచ్చింది. రమేష్ హంతకుడి గురించి చెప్పినట్టే యిప్పుడు సరళ గురించి యీ ఆడపిల్లలెవరో కాల్స్ మొదలెట్టారని అర్థం చేసుకున్నాడు. చటుక్కున ఫోన్ పెట్టేశాడు!

అతనికి చాలా కోపంగా వుంది. పోలీసు డిపార్టుమెంటుపట్ల ప్రజలకు సదభిప్రాయంలేదు. చివరకు ఫోన్ కాల్స్ చేసి తమని ఆటపట్టించటంవరకు వచ్చిందన్నమాట!

మళ్ళీ ఫోన్ మోగింది. శ్రీనివాస్ చాలాసేపు రిసీవర్ ఎత్తలేదు. అతనికి తెలుసు, ఆ ప్రాక్టికల్ జోకర్సు యెవరో మళ్ళీ చేస్తున్నారని! ఫోన్ మోగటం ఆగిపోయింది. రెండు క్షణాల తర్వాత మళ్ళీ మోగింది. అప్పుడూ

ఎత్తలేదు శ్రీనివాస్.

ఫోన్ అలా మోగుతూనే వుంది!

శ్రీనివాస్ చాలా కోపంగా ఎత్తి టేబిల్ మీద పెట్టేశాడు రిసీవర్. హలో, హలో అని చాలా గట్టిగా వినిపిస్తోంది.

అయినా శ్రీనివాస్ అలాగే వదిలేశాడు. కానిస్టేబుల్ని పిలిచి, "ఆ కాల్ ఎక్కడ్నుంచి వస్తున్నదో టాప్ చేసి యిన్ఫర్మేషన్ యిమ్మని కంట్రోల్ రూం టెలిఫోన్ ఆపరేటర్ కి చెప్పు!" అన్నాడు.

కానిస్టేబిల్ వెళ్ళిపోయాడు.

ఫోన్లో ఎవరిదో కంఠం చాలా కోపంగా, కర్కశంగా వినిపిస్తోంది. ఆ వ్యక్తిని మాటల్లో పెట్టి సంభాషణ పొడిగించాల్సిన అవసరముందని శ్రీనివాస్ గుర్తించాడు. రిసీవర్ ఎత్తి "హల్లో!" అన్నాడు.

"హూ యీజ్ స్పీకింగ్!" అన్న గొంతు చాలా అధికార యుతంగా, కఠినంగా విన్పించింది. ఆ గొంతు కమిషనర్ అని గుర్తించగానే వెంటనే అటెన్షన్ లోకి వచ్చేశాడు శ్రీనివాస్.

"అయామ్ ఇనస్పెక్టర్ శ్రీనివాస్ స్పీకింగ్ సర్!" అన్నాడు.

"ఏమయ్యా ఎంతసేపట్నుంచి పిలుస్తున్నాను? స్టేషన్లో అందరూ ఏమయ్యారు? ఐ విల్ టేక్ డిసిప్లిన్ ఏక్షన్ అండ్ సస్పెండ్ యూ ఆల్!" అగ్ని హోత్రుడిలా విరుచుకు పడ్డాడు కమిషనర్.

శ్రీనివాస్ ఫోన్లో యెంతో ప్రాధేయపడగా, కమిషనర్ శాంతించాడు.

"రమేష్, సరళ హత్యల విషయం స్టూడెంట్స్లో

పెద్ద సంచలనం రేపింది. మన డిపార్టుమెంటుమీద, మన చేతకానితనాన్ని ఎత్తి చూపుతూ దుమ్మెత్తి పోస్తున్నారు. మూడు రోజులయినా యింకా హంతకుల్ని పట్టుకోలేని మన అసమర్థతను వేలెత్తి చూపుతున్నారు. కళాశాలలు బహిష్కరించాలని, ఆందోళన లేవదియ్యాలని విద్యార్థి సంఘ నాయకులు పిలుపునిచ్చారు. సో ఇన్వెస్టిగేషన్ స్టాండ్స్ ఎట్ వాట్ స్టేజ్?" కమిషనర్ అడిగాడు.

శ్రీనివాస్ అపాలజటిక్ గా, "ఇన్వెస్టిగేషన్ యీజ్ గోయింగాన్ సార్! కాస్త టైం కావాలి!" అన్నాడు.

కమిషనర్ చాలా ఖచ్చితంగా అన్నాడు. "ఎస్పీకి, డిఎస్పీకి, సి.ఐ.జి. అందరికీ యిందాకే పరిస్థితిని గురించి వివరంగా చెప్పాను మీటింగ్ లో. ఆ ఫైలు నువ్వు డీల్ చేస్తున్నట్టు చెప్పారు. ఎనీ వే, కేస్ షుడ్ బి డిస్పోజ్డ్ టు డే!"

"సార్ ...." శ్రీనివాస్ ఏదో చెప్పబోయాడుగాని, యింతలోనే కమిషనర్ ఫోన్ పెట్టేశాడు.

శ్రీనివాస్ నుదురు కొట్టుకున్నాడు. ఈ విద్యార్థులతో ఏదొచ్చినా పట్టలేం. వాళ్ళు తలుచుకుంటే పోలీసు స్టేషన్లు బూడిదచేసి పారేస్తారు! చచ్చిన యిద్దరూ స్టూడెంట్సు కావటం తన కర్మకొచ్చి పడిందనుకున్నాడు శ్రీనివాస్.

శ్రీనివాస్ ఆలస్యం చెయ్యకుండా యేదో నంబరు డయల్ చేసి, "హల్లో, బ్రదర్ కిరణేనా మాట్లాడుతున్నది?" అన్నాడు.

"ఎస్. కిరణ్ స్పీకింగ్!" అన్నాడు అవతల్నుండి డిటెక్టివ్ కిరణ్.

# 4

కిరణ్ కాసేపటివరకు పొట్ట పట్టుకుని నవ్వుతునే వున్నాడు శ్రీనివాస్ అవస్థకు.

శ్రీనివాస్ గుర్రుగా చూశాడు. "నీకు వేళాకోళం గానే వుంటుంది. అవతల కొంపలు మునగబోతున్నాయి. ప్రమోషన్ మాట దేవుడెరుగు, ఉన్న ఉద్యోగం కాస్తా వూడిపోయేలాగా వుంది!" అన్నాడు.

కిరణ్ కూల్‌గా చూసి, "పోనియ్యి, అప్పుడు నాతో చేరి యిన్వెస్టిగేషన్ చేద్దువుగాని!" అన్నాడు.

"ఓహో, నీకు అసిస్టెంటు లేడుకదా, అందుకని...."

కిరణ్ మళ్ళీ నవ్వాడు.

శ్రీనివాస్ చిన్నబుచ్చుకున్నాడు.

కిరణ్ ఓదార్పుగా "ఇలాంటి చిన్న కేసుకి అంత వర్రీ అయిపోతా వేమిటి మైడియర్ ఇనస్పెక్టర్! కేసు ఫైల్సు యిలా యివ్వు!" అన్నాడు.

శ్రీనివాస్ చకచక ఫైల్సు కిరణ్ కందించాడు.

కిరణ్ ఓ అరగంటవరకు ఫైల్సు పరిశీలనలో మునిగి పోయాడు. తరవాత తలెత్తి శ్రీనివాస్ వంక చూసి, "ఇప్పటివరకు నీ ఫైండింగ్స్ ఏమిటి?" అనడిగాడు.

"సారీ బ్రదర్, ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే వుంది. అనుమానితులు నలుగురికీ బలమైన ఎలిబీలున్నాయి. పైగా స్పాట్‌లో దొరికిన ఆధారాలు హంతకుల్ని ట్రేస్ చెయ్యటానికి యేమాత్రం ఉపయోగపడలేదు!"

"ఏమిటా ఆధారాలు?"

"ఇదిగో యీ యూత్ పెన్ను! పగిలిపోయిన సిరంజి ముక్కలు! ఈ సిరంజి ముక్కలు కెమికల్ ఎనాలిసిస్‌కి

పంపించబడ్డాయి. అందులో సైనేడ్ వుండటం, ఆ సైనేడ్‌తోనే సరళకు విషప్రయోగం జరగటం రుజువయ్యాయి."

"మరి యీ పెన్‌ను కెమికల్ ఎనాలిసిస్‌కి పంపించలేదా?"

"పెన్నా? ఇది దేనికి? దీనిమీద వేలిముద్రలకోసం ప్రయత్నించాం, దొరకలేదు."

కిరణ్ పెన్ కేప్ విప్పి, నిబ్‌తోబాటు వున్న యింక్ ఫిల్లర్‌ని చూపించి, "ఇందులో వున్నది యింకు కాదు, సైనేడ్!" అన్నాడు.

"వాట్?" శ్రీనివాస్ అదిరిపడి ఆ పెన్ అందుకున్నాడు.

"నొక్కవద్దు. డేంజరస్!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ తన ప్రయత్నం విరమించుకున్నాడు.

"ఈ పెన్ నిబ్‌లోకి సైనేడ్ ప్రవహిస్తోంది, ఇంక్ ఫ్లో అయినట్టు! నిబ్‌ని శరీరానికి గుచ్చి ఫిల్లర్‌ని నొక్కగానే సైనేడ్ హతుడి శరీరంలోకి యింజక్టు అయింది. వెంటనే ప్రాణంపోయుంటుంది."

"మరి దానిమీద వేలిముద్రలు దొరకలేదే!"

"పడకుండా జాగ్రత్తచేసుకున్నారు. బహుశా గ్లవ్స్ వాడివుంటాడు!"

శ్రీనివాస్ తలూపాడు.

"సిరంజిమీద దొరికాయా ఫింగర్ ప్రింట్సు?" అడిగాడు కిరణ్.

"దొరికాయిగాని, సగం సగం సిరంజి పగిలిపోయింది కదా!"

"సో, నో యూజ్! రెండు కేసుల్లోను కూడా

హంతకుడ్ని పట్టిచ్చే డైరెక్ట్ ఆధారాలు లేవు. మనం యింకాస్త డీప్‌గా స్టడీచేయాలన్నమాట!" అన్నాడు కిరణ్.

"మరి నాకొచ్చిన ఫోన్ కాల్స్ ఎవరివై వుంటాయి?"

"అది కూడా మనం ఎంక్వయిరీ చెయ్యాల్సి వుంది."

"అయిదో ఫోన్ కాల్ ఎవరో స్త్రీ చేసింది!"

"ఆ నలుగురిలోను యెవరైనా స్త్రీ కంఠాన్ని అనుకరించి ఫోన్ చెయ్యటానికవకాశం లేదంటావా?"

"కావచ్చు, అవకాశముంది!"

"ఆ ఫోన్ చేసినవాళ్ళు అమాయకులు కాదు. నా ఊహ నిజమైతే వాళ్ళకు ఈ హత్యలతో తప్పనిసరిగా కనెక్షన్ ఉండివుండాలి! నిన్ను డైవర్టుచెయ్యటానికి, కేసును కన్‌ఫ్యూజ్ చెయ్యటానికి వాళ్ళు అలా ఫోన్ చేసి వుంటారు. ఫోన్స్ నాలుగు నలుగుర్నించి కాక పోవచ్చు. ఒక్కడే నాలుగు రకాలుగా, గొంతుమార్చి మాట్లాడి వుండొచ్చు. స్త్రీలా కూడా గొంతు మార్చి చేసి వుండొచ్చు, చూడాలి!"

"ఎక్కడ్నుంచి మొదలు పెడదాం?"

"అసలు ఓసారి రమేష్ వాళ్ళింటికి వెళ్ళివద్దాం. తర్వాత అతని శవం కనిపించిన గ్రోవ్స్ గార్డెన్‌కి వెళ్దాం!"

## 5

"మీ అబ్బాయి చనిపోయిన రాత్రి జరిగిన సంఘటనల గురించి గుర్తు చేసుకుని చెప్పండి!" అడిగాడు కిరణ్.

"గుర్తు చేసుకోవటానికి మరచిపోతే కదా బాబూ, భగవంతుడు యింత చిన్న వయసులో నా బిడ్డను తీసుకుపోయి, ఈ ముసలి వయసులో నాకు గర్భశోకాన్ని

కలిగించాడు" రమేష్ తల్లి గొంతు దుఃఖంలో పూడుకు పోయింది.

కిరణ్ కొద్దినిమిషాలు మౌనం వహించాడు. శ్రీనివాస్ కూడా ఆమెనేమీ ప్రశ్నించలేదు.

"మీకు రమేష్ ఒక్కడేనా సంతానం?" అడిగాడు కిరణ్.

"నాకు యిద్దరు కొడుకులు బాబూ! రమేష్ తర్వాత అబ్బాయి ఇంటర్ చదువుతున్నాడు. వాళ్ళ నాన్నగారికి వచ్చే పెన్షనే మాకు జీవనాధారం! రమేష్ చదువు కుంటూనే ట్యూషన్లు చెప్పి ఎంతో కొంత సంపా దిస్తూండేవాడు. ఇప్పుడా ఆధారం కూడా పోయింది!"

కిరణ్ మనసు ద్రవించింది.

"అంటే పాఠాలు పిల్లలకు చెపుతుండేవాడా?"

"ఎక్కువగా పబ్లిక్ పరీక్షలకు కూచునే పిల్లలకు అంటే ఏడు, పది తరగతుల పిల్లలకు—చెప్తుండేవాడు. తన క్లాసు పిల్లలకు కూడా అప్పుడప్పుడు యింట్లో కొద్ది గంటలసేపు పాఠాలు చెప్తుండేవాడు."

"తన క్లాసు వాళ్ళకా? ఎవరో చెప్పగలరా?"

"నలుగురు అమ్మాయిలు, పెద్ద కుటుంబాల పిల్లలే వస్తూండేవారు బాబు. వాళ్లకు వివరించి చెపుతుంటే నాగ స్వరం వినే పాముల్లాగా ఎంతో శ్రద్ధగా, ఆసక్తిగా వినేవారు. బాబు చెప్పే పద్ధతి అలాంటిది!"

"ఆ అమ్మాయిల పేర్లు చెప్పగలరా?"

"విద్య, విశాల, మనోరమ, సరళ!"

శ్రోతలిద్దరు ఆశ్చర్యాన్ని అణచుకుంటూ విన్నారు.

"అయితే ఆ నలుగురు అమ్మాయిలు తప్ప మరెవరూ, అంటే అబ్బాయిలెవరూ వచ్చేవారు కాదా?"

"బాబు ఒప్పుకోలేదు గాని నలుగురైదుగురు రావటానికి చాలా ప్రయత్నించారు. అమ్మాయిల్ని అల్లరి చెయ్యటానికేగాని నిజంగా చదువుకోవాలని కాదని అబ్బాయి ఉద్దేశం!"

"ఓహో, ఆ అమ్మాయిలు ట్యూషన్ పేర ఏమైనా ఫీజు యిచ్చేవారా?"

"ఇచ్చేవారు బాబూ! వాళ్ళు నలుగురూ రమేష్ క్లాసుమేట్లే బాబూ! అసలు మా పరిస్థితికి జాలిపడే వాళ్ళు మా బాబు దగ్గర ట్యూషన్‌కి వచ్చి, తమకు చేతనైన సహాయం ఆ విధంగా చేసేవారని నా అనుమానం! యెవరైనా ఊరకనే యిస్తే పదిపైసలు కూడా బాబు తీసుకోడు. అతని నైజం వాళ్ళకు తెలుసు!"

"సరళ అంటే రమేష్ ప్రత్యేకమైన శ్రద్ధగాని అభిమానంగాని కనపరచేవాడా?"

"చాలా అభిమానంగా చూసుకునేవాడు. ఆ పిల్ల కూడా 'అన్నయ్యా, అన్నయ్యా' అంటూ వదిలేదికాదు వాడ్ని. నన్ను 'అమ్మా, అమ్మా' అంటూ యెంతో ప్రేమగా, గౌరవంగా మన్నించేది."

కిరణ్, శ్రీనివాస్ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

కిరణ్ అడిగాడు. "ఆ అమ్మాయి దగ్గర కూడా ట్యూషన్ ఫీజు తీసుకునేవాడా రమేష్?"

"అసలు ఆ అమ్మాయే ప్రోత్సహించి తక్కిన ముగ్గురు అమ్మాయిల్ని ట్యూషన్‌కి కుదిర్చింది. అయితే విద్య దగ్గర మాత్రం డబ్బు తీసుకునేవాడు కాదు రమేష్."

"అదేం? ఆ అమ్మాయి ధనవంతురాలు కదా?"

"అది కారణం కాదు బాబూ! ఆ పిల్లంటే వాడికి

వల్లమాలిన ఇష్టం! ఆ పిల్లకైతే వీడు ప్రాణం! కాని వీడు యెన్నడూ హద్దులు దాటలేదు. ఆ పిల్ల నన్ను అత్తా అంటూ వదిలేది కాదు. వీడు మాత్రం అంతస్తుల తారతమ్యాన్ని గుర్తుచేసి ఆమెతో పెళ్ళి కుదరదని ఖచ్చితంగా చెప్పేవాడు. ఆ పిల్లను అనవసరంగా తన మీద ఆశలు పెంచుకోవద్దని చెప్పేవాడు. అయినా వాడి మనసు నాకు తెలుసు!"

"ఇంతకీ అసలు విషయం చెప్పారు కాదు. ఆ రోజు రాత్రి రమేష్ యెక్కడికి వెళ్ళాడు? ఎన్ని గంటలకు యిల్లు వదిలి వెళ్ళాడు?"

"ఆ రోజు ఎన్నడూ లేనిది రెండో ఆట సినిమాకు బయల్దేరాడు. సాధారణంగా సినిమాకు వెళ్ళటమే అరుదు. ట్యూషన్‌తోనే సరిపోతుంది వాడికి. అలాంటిది వాడికెంతో యిష్టమైన పౌరాణిక సినిమా ఆ రోజుతో వెళ్ళిపోతున్నదని బయల్దేరి వెళ్ళాడు. రాత్రి తొమ్మిది గంటలవుతుంది. అదే నా బిడ్డను కడసారి చూడటం!"

"పోలీసు రిపోర్టు ఎప్పుడిచ్చారు?"

"మర్నాడుదయం ఎనిమిదిన్నర గంటలకు! రాత్రిళ్ళు ఎక్కడా వుండడు. అలాంటిది తెల్లవారినా రాకపోవటంతో భయంవేసి టూటౌన్ స్టేషన్‌లో రిపోర్టిచ్చాను."

"మీకు ఎవరిమీదనైనా అనుమానముందా?"

"ఎవర్నని అనుమానించగలను బాబూ! అమ్మాయిలకు ట్యూషన్ చెప్పటంనుంచి, ఆకతాయి కుర్రాళ్ళకు చెప్పకపోవటంనుంచి—వాళ్ళు బాబుమీద చాలా కోపంగా వున్నారు. వాళ్ళలో ఎవరైనా ఈ పని చేసుండవచ్చు."

"వాళ్ళ పేర్లేమయినా చెప్పగలరా?"

ఆమె కొద్ది క్షణాలు ఏదో ఆలోచించి, "పార్థ అని

ఓ కుర్రాడు బాగా పొగరుబోతుగా ప్రవర్తించేవాడు. గిరి అనే కుర్రాడు ఓసారి సరళను ఆటపట్టించబోతే రమేష్ చాలా తీవ్రంగా మందలించి పంపాడు. ఆ తర్వాత సరళను బాబును కలిపి చాలా అవమానకరంగా గోడల మీద రాశాడట ఆ గిరి. సరళను రావద్దన్నా ఆ పిల్ల రావటం మానేదికాదు. అలాంటి రాతలు, కూతలు పట్టించుకోకూడదని, మనంతట మనం బయటపడితే మరింత లోకువవుతామనీ ఆ పిల్లే తిరిగి రమేష్‌కు ధైర్యం చెప్పేది!"

"ఇంకా ఎవరైనా వున్నారా....?"

"ఇంకా ఇద్దరు—ముగ్గురున్నారుగాని, పేర్లు తెలియవు బాబూ!"

"అలాగేనమ్మా, చాలా ముఖ్యమైన విషయాలు చెప్పారు. మా పరిశోధనలో చాలా ఉపయోగపడతాయి" అన్నాడు కిరణ్ ఆమెకు కృతజ్ఞతలు చెపుతూ.

"మావాడ్ని చంపినవాడిని మాత్రం క్షమించకూడదు బాబూ! గంగిగోవులాంటి బిడ్డని అన్యాయంగా చంపేశారు. వాళ్ళని ఉరికంబాల కెక్కించండి!" ఆమెలో ఆవేశం అవధులు దాటింది.

ఆమెకు ఊరట కలిగించి బయటికొచ్చారు—కిరణ్, శ్రీనివాస్.

"మీవాళ్ళు సేకరించిన వివరాలు ఇలాగే వుంటాయి. తలా తోకా వుండవు. సరళ, రమేష్ ప్రేమించుకున్నారని, సరళను ప్రేమించిన వ్యక్తులు బహుశా రమేష్‌ని చంపివుండొచ్చనీ మీ వాళ్ళు అభిప్రాయపడ్డారు. కాని అసలు విషయం వేరేలా వుంది. అవునా....?"

"అవును. విద్య, రమేష్ ప్రేమికులు. సరళతో అతనికి సన్నిహిత సంబంధమున్నా, అది వేరే సంబంధం. పవిత్రమైన అన్నా చెల్లెళ్ళ బంధం! దాన్ని మా వాళ్ళు యింకోలా అర్థం చేసుకున్నారన్నమాట! సరే, యిప్పుడు ఎక్కడికి పోవాలి?"

"ఓసారి ఆ ద్రాక్ష తోటకు వెళ్దాం. ఆ తరవాత ఎక్కడికి వెళ్ళాల్సిందీ తరవాత చెపుతాను" అన్నాడు కిరణ్.

# 6

నేలమీద ఒంగి పరీక్షగా చూశాడు కిరణ్.

మోటరుసైకిలు గుర్తులు స్పష్టంగా కనిపించాయి. శ్రీనివాస్ కిరణ్ చర్యలను గమనిస్తున్నాడు.

కిరణ్ జేబునించి మెజరింగ్ టేప్ తీసి టైరు గుర్తులు కొలిచాడు. "ఇవి బుల్లెట్ టైరు గుర్తులు! హంతకుడు మోటారుసైకిలుమీద హతుడ్ని తీసుకువచ్చి యిక్కడ పడేసివుంటాడు. లేదా హతుడు అతనికి సన్నిహితుడై వుంటే యిక్కడికి మోటారుసైకిలుమీద తీసుకువచ్చి వెన్ను గుచ్చి సైనేడ్ ఎక్కించి చంపేసి వదిలేసి పోయుంటాడు. మొదటి పద్ధతిన హత్య చేసి వుంటాడనే నా అభిప్రాయం!" అన్నాడు.

"అయితే రమేష్ స్నేహితులు లేదా శత్రువులు ఎన్‌ఫీల్డ్ మోటర్‌బైక్ వున్న వాళ్ళ గురించి ఎంక్వయిరీ చెయ్యాలంటావు" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ నవ్వి, "ఇదిగో మోటరుసైకిలు యిక్కడ మలుపు తిప్పుకున్నాడు. అంటే ఎంతోసేపు యిక్కడ హంతకుడు గడపలేదు. ఇలా వచ్చి అలా హతుడ్ని తోటలో పడేసి, అలాగే మలుపు తిప్పుకుని వెళ్ళి

పోయాడు. వాచ్‌మన్‌ను కల్సుకుని మాట్లాడావా?" అన్నాడు కిరణ్.

"ఆఁ! అతను ఎవర్నీ చూడలేదని చెప్పాడు."

ఈలోపల ద్రాక్షతోట యజమాని యూసుఫ్, మరో వ్యక్తి అక్కడికి వచ్చారు.

"ఈయన ఓనర్. యితను వాచ్‌మన్!" పరిచయం చేశాడు శ్రీనివాస్ వాళ్ళిద్దర్నీ కిరణ్‌కి.

కిరణ్ వాచ్‌మన్‌ని ఉద్దేశించి, "నాలుగు రోజుల క్రితం తెల్లవారుఝామున నీవు మోటరుసైకిలు శబ్దం ఏదీ వినిపించలేదా?" అనడిగాడు.

వాచ్‌మన్ కాసేపు ఏదో గుర్తుచేసుకోవటానికి ప్రయత్నించి, "ఆఁ! అవును సాబ్! రెండు గంటల కే తిరికాడ యేదో సైకిలు మోటరు చప్పుడయింది. యాదొచ్చినాది!" అన్నాడు.

"మరి అది ఎవరిదో, దానిమీద యెవరున్నారో చూడలేదా?"

"చూడలేదు సాబ్" అన్నాడు వాచ్‌మన్.

కిరణ్, శ్రీనివాస్ వంక తిరిగి, "పద వెళ్దాం!" అన్నాడు.

టయోటా ఎక్కి స్టార్టుచేస్తూ అన్నాడు కిరణ్! "సరళ యింటికి దారి చూపించు!" అని.

శ్రీనివాస్ గుర్తులు చెపుతుండగా వారించి, "సిటీ లిమిట్సుకి రానియ్యి. ఇంకా పదికిలోమీటర్లుంది కదా!" అన్నాడు కిరణ్.

* * *

"అమ్మా, మీ అమ్మాయి హత్య విషయంలో మరి కొన్ని వివరాలు కావాలి. చెప్పగలరా?" మర్యాదగా

అడిగాడు కిరణ్.

"అడగండి!" అన్నది సరళ తల్లి.

"మీ అమ్మాయి రమేష్ అనబడే వాళ్ళ క్లాసుమేటు యింటికి తరచు వెళుతుండేదా?"

"తరచు యేమిటి బాబూ, రోజూ వెళ్తూండేది! అతను అమ్మాయి క్లాసుమేటు కావటాన ట్యూషన్ చెప్పించుకునేది. వాళ్ళిద్దరిదీ అన్నా చెల్లెళ్ళ అనుబంధం! కుర్రాడు చాలా బుద్ధిమంతుడు. అందుకే సంకోచించకుండా వెళ్ళనిచ్చేదాన్ని. పాపం, ఆ అబ్బాయినీ చంపేశారట దుర్మార్గులు!"

"మీ అమ్మాయికోసం ఆమె స్నేహితురాళ్ళు మీ యింటికొస్తూండేవారా?"

"వచ్చేవారండి. వాళ్ళు మొత్తం నలుగురు స్నేహితురాళ్ళు. మా అమ్మాయితో బాటు రమేష్ వాళ్ళింటి దగ్గరే పాఠాలు చెప్పించుకునేవారు. వాళ్ళ పేర్లు విద్య, విశాల, మనోరమ."

కిరణ్ సాభిప్రాయంగా చూశాడు శ్రీనివాస్ వంక.

"మరో విషయం అడుగుతున్నందుకు అన్యధా భావించకండి! మీ అమ్మాయి ప్రేమలో పడటంగాని, లేదా యెవరైనా కుర్రాళ్ళు ప్రేమిస్తున్నామని వెంటపడటం గాని అలాంటిదేమైనా...."

"నా కూతురని చెప్పుకోవటం కాదుగాని సరళ నిప్పులాంటి పిల్లండి. ఒకటి రెండుసార్లు దాని క్లాసు మేట్సే వెంటబడితే మర్యాదగా బుద్ధి చెప్పి వదిలేసిందట. అది మాత్రం నాకు తెలిసి యెవరితోను ప్రేమలో పడలేదు. అంతవరకు కచ్చితంగా చెప్పగలను!"

"మీ పక్కింటామెనోసారి పిలుస్తారా?"

"వుండండి పిలుస్తాను!" అని బయటికి వెళ్ళింది సరళ తల్లి. అయిదు నిమిషాల్లో పక్కింటామెను పిల్చుకుని వచ్చింది.

"చూడండి, మీరు మోటరుసైకిలుమీద యెవరో కుర్రాడిని చూశారు కదా! వర్ణించగలరా?"

"నల్లగా వున్నాడు బాబూ. గడ్డం మీసం కత్తిరించుకున్నాడు. వయసు దాదాపు పాతికేళ్ళుండొచ్చు!"

"ఆ మోటరుసైకిలు యే కంపెనీదో చెప్పగలరా?"

"మోటరుసైకిళ్ళ గురించి నాకంతగా తెలియదండి! ఎర్రరంగు మోటరుసైకిలు! చాలా కొత్తగా నిగనిగ మెరుస్తోంది!"

"నంబరు గురించి ఏమైనా...."

"అబ్బే, ఆ సంగతులేవీ నాకు తెలీదు బాబూ! సరళ చదువుకుంటున్న పిల్ల కదా! స్నేహితులు యెవరైనా కావచ్చుననుకున్నాను!" అన్నదామె.

"ఆ అబ్బాయి వీళ్ళలో యెవరైనా నేమో చూసి చెప్పండి!" అన్నాడు కిరణ్ నాలుగు ఫోటోలు ఆమె ముందుంచి.

ఆమె కాసేపు పరిశీలనగా ఆ ఫోటోలు చూసి, "అబ్బే వీళ్ళలో యెవరూ కాదండి! ఆ అబ్బాయి మరీ గూండాలాగా వున్నాడు. దుబ్బు జుట్టు. వీళ్ళలా సాఫీగాలేదు!" అన్నది.

"మీరు వెళ్ళొచ్చు. మీరు చెప్పిన విషయాలకు చాలా కృతజ్ఞులం!" అన్నాడు కిరణ్.

ఆమె వెళ్ళిపోయాక "ఓసారి మీ అమ్మాయి గది పరిశోధించటానికి అనుమతిస్తారా?" అనడిగాడు కిరణ్.

"చూడండి బాబూ!" అన్నది సరళ తల్లి.

కిరణ్ గదిలోనికి ప్రవేశించాడు. లోపల సరళ పుస్తకాల రేక్, చదువుకునే టేబిలు, పక్కనే ట్యూబ్యులర్ మడత మంచం వున్నాయి. అలమరలో ఆమె వాడే చీరలు మడతలు చక్కగా సర్దబడి వున్నాయి. గోడలకి చక్కటి ప్రకృతి దృశ్యాలు పెయింటింగ్ వున్నాయి.

కిరణ్ ఆమె పుస్తకాలను ఒకటొకటిగా పేజీలుతిప్పి చూశాడు. పుస్తకాల్లో యేం కనిపించలేదుగాని ఆమె డైరీలో కొన్ని ఆసక్తికరమైన విషయాలు రాసుకున్నది. ఆ డైరీ తిరగేశాడు కిరణ్.

అందులో రమేష్ గురించి అక్కడక్కడ ప్రస్తావించింది. ప్రతిచోట రమేష్ అన్నయ్యా అంటూ రాసుకున్నది. ఆమె మనసుకు ప్రతిబింబమైన ఆ డైరీ ఆమె మనసు స్వచ్ఛతను తెలుపుతోంది.

ఓచోట! విద్య అన్నయ్యను ప్రేమిస్తోంది. కాని అన్నయ్యకు తన అంతస్తేమిటో తనేమిటో తెలుసు. అందుకే తనమీద ఆశ పెట్టుకోవద్దని నన్ను విద్యకు నచ్చ చెప్పమన్నాడు. కాని, విద్యకు నేనేమని చెప్పాలి? నన్నపార్థం చేసుకోమా!' అని రాసింది సరళ.

మరోచోట, 'విశాల, మనోరమ అన్నయ్య వంక చూసే చూపుల్లో ఆరాధనతో బాటు అర్థంకాని మరెన్నో భావాలు కదలాడటం 'నేను గమనించాను. వాటి భావం నాకు తెలుసు. వాళ్ళిద్దరు, కూడా అన్నయ్యను ప్రేమిస్తున్నారు, అనుమానంలేదు!' అని రాసుకుంది.

ఇంకోచోట, 'మనోరమ విద్యకు అభిప్రాయభేదాలొచ్చాయి. కారణం రమేష్ అన్నయ్య! మనోరమ, విశాలికూడా సరిగా మాట్లాడుకోవటంలేదు. అందరికీ

అన్నయ్య అంటే ప్రేమ, అభిమానం, కాని అన్నయ్యకు యీ విషయాలు పడవు. విద్యపట్ల మొదట్లో కాస్త మొగ్గు చూపినా, ఇప్పుడదిలేదు. నాకులాగే చెల్లెలా చూసుకుంటున్నాడు తప్ప విద్యమీద మరే ఆశలేదు అన్నయ్యకు. వాళ్ళు మాత్రం ఒకరిమీద మరొకరు పోటీపడి ప్రేమించేస్తున్నారు అన్నయ్యను. చివరికిది ఎలా దారితీస్తుందో అర్థంకాదు!' అని రాసింది.

తర్వాత కొన్ని పేజీలు ఖాళీగా వున్నాయి.

ఓ పేజీలో 'ఈ రోజు విద్య, విశాల చాలా పెద్ద ఘర్షణపడ్డారు. విద్య విశాలను కొట్టినంత పనిచేసింది. వాళ్ళను సరిచెయ్యటం మా యిద్దరితరం కాలేదు' అని వున్నది.

తర్వాత పేజీలన్నీ ఖాళీగానే వున్నాయి. ఇంకేం రాసుకోలేదు. తేదీ చూశాడు కిరణ్. సరళ చనిపోవటానికి రెండురోజులక్రితం వరకు రాసుకుంది. ఆ రెండు రోజులు ఏం రాసుకుని వుందేదో! ఎందుకో ఖాళీగా వదిలేసింది.

సరళ తన గురించి రాసుకున్నది తక్కువే! అక్కడక్కడ తన మనసులో రేగే భావాలు రాసుకుంది. అంతే!

ఇక యేలాంటి సమాచారమూ లభించలేదు ఆమె గదిలో.

సరళ తల్లివద్ద సెలవు తీసుకుని ఇద్దరూ బయటికొచ్చారు. కిరణ్ టయోటా స్టార్టుచేసి, "స్టేషన్‌కి పోనిస్తున్నాను!" అన్నాడు.

## 7

"హల్లో డియర్, కులాసాగా వున్నావా?" అవతలి నుంచి వినిపించిన గొంతు విని ఆమె టెన్షన్‌తో

బిగుసుకుపోయింది.

"ఎవరు నువ్వు? ఏం కావాలి?" ఆమె గొంతు వణికింది.

"నేనెవరో నీకు తెలుసు. నాకేం కావాలో కూడా తెలుసు. నీ రహస్యాలు నా గుప్పెట్లో వున్నాయనీ నీకు తెలుసు. అందుకు పరిహారంగా నేనేం కోరానో నీకు తెలుసు. కాని వీటిని ఎప్పుడు తీరుస్తావో నాకు తెలియటం లేదు."

ఆమె రిసీవర్ని బలంగా పట్టుకున్నా చేతులు వణుకుతునే వున్నాయి.

"ఏం మాట్లాడవు? రమేష్ హత్య గురించి, సరళ హత్య గురించి పోలీసులకి చెప్పేయమంటావా? ఆ రహస్యం తెలిసిన ఏకైక వ్యక్తిని నేను!"

"వద్దు, చెప్పొద్దు."

"మరి నేను చెప్పినట్టు వింటావా?"

ఆమె మాట్లాడలేదు.

"ఆఫ్టరాల్, ఒక్క రాత్రి నువ్వు నాతో గడపటానికి యింత సంకోచిస్తున్నావు. జీవితాంతం ఏ సుఖం లేకుండా కటకటాల వెనక పండంటి జీవితాన్ని బలి చేసుకోదల్చుకుంటే చెప్పు, నీ జోలికి రాను!"

"వద్దు, నాకా నరకం వద్దు!"

"అందుకే నీకు నాకు ఓ చక్కటి పరిష్కారం సూచించాను. నాకు నువ్వు కావాలి. నీ అందం కావాలి. నీతోటి సుఖం కావాలి. ఒక్క రాత్రి నీతో అనుభవం కావాలి. అందుకే యీ తాపత్రయమంతా. తర్వాత నేను ఆ రహస్యం సమాధి చేసేస్తాను—మళ్ళీ నీ జోలికి రాను. నిన్ను కోరను. ఒక్కసారితో నా మోజు తీర్చేసు

కుంటాను. ఏమంటావు?"

"నేను ఆలోచించుకుని చెపుతాను!"

"ఒక్కసారికే నీలో తరిగిపోయేదేమీ వుండదు. ఆ సంగతి నీకు, నాకు తప్ప మరొకరికి తెలియదు. పాపం, తప్పు ___ అనే భావన నీ మనసులోకి నీ దరిదాపులకీ రానివ్వకు! ఆ తర్వాత అంతా సుఖమే! నీకు నచ్చిన వాడ్ని నువ్వు పెళ్ళిచేసుకో, సుఖపడు!"

"నువ్వు నన్ను తప్ప మరేం కోరినా సంతోషంగా యిచ్చుకుంటాను. డబ్బు కావాలంటే చెప్పు. ఎన్ని వేలు కావాలన్నా యిస్తాను. అంతే కాని కోరకూడనిది కోరకు!"

"కోరకూడనిదేం కోరలేదే! అందరూ చేసేదే! ఇందులో వింతేంలేదే!"

"కాని.... కాని.... నా మనసు...."

"వెధవ మనసుని కాసేపు నోరు మూసుకోమను. ఆ సుఖం ఓసారి మరిగితే నీ మనసు, శరీరం కూడా పదే పదే కావాలంటాయి ఆ సుఖాన్ని. ఏమంటావు? ఎప్పుడు, ఎక్కడకు వస్తావో లేక రమ్మంటావో.... చెప్పాలి!"

"నేను ఆలోచించుకుని చెపుతాను!"

"ఆలోచించుకోవటం దేనికి?"

"మనసును సమాధాన పరచుకోవటానికి!"

"ఆల్ రైట్! యిరవై నాలుగ్గంటలు టైమిస్తున్నాను. నన్ను కాదన్నా, మోసం చెయ్యాలని ప్రయత్నించినా జరగబోయే మరో హత్యకు నేను కారకుడ్ని కాదు! నీ జీవితాన్ని చేజేతులా నాశనమే చేసుకుంటావో, నా దారికొస్తావో నువ్వే నిర్ణయించుకో!"

అవతల ఫోన్ పెట్టేసిన చప్పుడయింది.

ఆమె ఫోన్ రెస్టుమీద పెట్టేసి కొంగుతో ముఖానికి పట్టిన చెమట తుడుచుకున్నది. జగ్ నుంచి మంచినీళ్ళు వంచుకుని గటగట తాగింది.

కుర్చీలో నిస్త్రాణగా వాలిపోయింది.

# 8

"వేలిముద్రలు ఫోటోలు తీయించాను. రమేష్ శత్రువుల్లోగాని, మిత్రుల్లోగాని మోటారుసైకిలు—బుల్లెట్ వున్నవాళ్ళు లేరు! గిరికి స్కూటరుంది బజాజ్ చేతక్. గోపాల్రావుకి రాజదూత్ వుందిగాని వేలిముద్రలు టాలీకాలేదు. ముద్రలు ఎన్ ఫీల్డువన్న విషయంలో అనుమానంలేదు!" అన్నాడు శ్రీనివాస్ కిరణ్ తో.

కిరణ్ తలూపాడు. ఇద్దరు స్టేషన్ లో కూచుని చర్చిస్తున్నారు కేసు విషయం!

"హంతకుడికి మోటారుసైకిలుందన్న విషయం నిర్ధారణగా చెప్పలేం. సమయానికి యెవరిదో తీసుకుని వుండొచ్చు, అనుమానం రాకుండా. అయితే సరళను హత్యచేసినవాడు—నరేష్, పార్థు, గిరి, గోపాల్రావుల్లో ఎవడూ కాదు. పక్కింటామె వీళ్ళ నలుగురి ఫోటోల్ని చూసి కచ్చితంగా చెప్పేసింది కదా! కాకపోతే రమేష్ హంతకుడు, సరళ హంతకుడు ఒకడా కాదా అన్న విషయం తెలిస్తే కేసు మరికాస్త తేలికవుతుంది!"

"రమేష్ హంతకుడి కూడా మోటారుసైకిలుంది కదా! ఇద్దరు ఒకరేనేమో!"

కిరణ్ చురుగ్గా చూశాడు శ్రీనివాస్ వంక.

"మోటారుసైకిలున్న ప్రతివాడూ హంతకుడు కానవసరంలేదు!"

ఇంతలో ఫోన్ మోగింది. శ్రీనివాస్ ఎత్తాడు.

"హల్లో, ఇనస్పెక్టర్ శ్రీనివాస్ గారున్నారా?"

"నేనే నే మాట్లాడుతున్నాను, చెప్పండి!"

"మీకు సరళ హంతకుడి గురించి చెప్పాలి. నే నీ టెన్షన్ భరించలేకపోతున్నాను!" అవతలినుంచి స్త్రీ కంఠం వినిపించింది.

శ్రీనివాస్ ముఖం కోపంతో జేవురించింది. ఫోను పెట్టేయబోతుండగా, కిరణ్ వారించి, "ఇలా యివ్వు!" అన్నాడు.

"ఇదివరకు నాతో ప్రాక్టికల్ జోక్ చేసిన స్త్రీ కంఠమే! నాకు తెలుసు, అందుకే పెట్టేస్తున్నాను" అంటూ ఫోన్ కిరణ్ కందించాడు.

"హల్లో, మీ రెవరు? ఏం చెప్పాలనుకుంటున్నారు?" అన్నాడు కిరణ్.

"ఇనస్పెక్టర్ శ్రీనివాస్ గారేనా మాట్లాడుతూంట! నేను విద్యను మాట్లాడుతున్నాను. రమేష్‌ను, సరళను హత్య చేసిందెవరో మీకు చెప్పాలి. మరోసారి మా యింటికి వస్తారా?" అన్నది అవతలి కంఠం.

"ఫోన్ లో చెప్పకూడదా?" అన్నాడు కిరణ్.

"వద్దండి. మీరు దయచేసి మా యింటికి రండి. అన్నీ వివరంగా చెపుతాను!" అవతల ఫోను పెట్టేసిన చప్పుడు.

కిరణ్ శ్రీనివాస్ వంక తిరిగి, "మనం వెంటనే విద్య యింటికి వెళ్ళాలి! హంతకుల గురించి ఆమెకు తెలుసు. ఆమె యింటి అడ్రసు వుంది కదా!" అన్నాడు.

"ఉన్నది. అయితే యిప్పుడు యిదివరలో ఫోన్ చేసినది కూడా విద్యేనన్నమాట! నేను వినకుండా ఫోను పెట్టేశానిదివరలో" నొచ్చుకున్నాడు శ్రీనివాస్.

"మాటలు అనవసరం, పద పోదాం!" కిరణ్ పరుగు లాంటి నడకతో టయోటాను సమీపించాడు. శ్రీనివాస్ కూచుంటుండగానే ముందుకు దూకించాడు.

## 9

విద్య యింటికి వెళ్ళేసరికి అక్కడ చాలామంది గుమిగూడి వుండటం కనిపించింది.

కిరణ్, శ్రీనివాస్ వంక తిరిగి, "ఉన్న ఒక్క ఆధారమూ పోయింది. విద్యను కూడా చంపేశారు!" అన్నాడు.

శ్రీనివాస్ అతనివంక ఆశ్చర్యంగా చూశాడు.

ఇద్దరూ గుమ్మం యెక్కుతుండగా ఓ నడివయసామె పోలీసుల్ని చూసి భయపడి, "అమ్మాయి ఆత్మహత్య చేసుకున్నది బాబూ! మీకు ఫోన్ చేసి చెప్పాలనే అనుకున్నాం, యింతలో మీరే వచ్చారు!" అన్నది. ఆమె బలవంతాన కన్నీళ్ళు ఆపుకుంటోంది.

"అమ్మాయంటే ఎవరు?"

"విద్య—నా బిడ్డ బాబూ!" అన్నదామె.

"శవాన్ని చూపించండి" అన్నాడు కిరణ్ నడుస్తూనే. ఆమె లోపలికి నడిచింది.

మంచానికి అడ్డంగా పడివున్నది శవం. ఇరవై సంవత్సరాల అమ్మాయి. చాలా అందంగా వున్నది. ఆమె యింకా బతికే వుందన్న భ్రమ కలగజేస్తోంది.

శ్రీనివాస్ విద్య తల్లివైపు తిరిగి "మీ ఫోను ఒకసారి ఉపయోగించుకోవచ్చా?" అన్నాడు.

"మాకు ఫోను లేదు బాబూ!" అన్నదామె.

కిరణ్, శ్రీనివాస్ ఉలిక్కిపడి చూశారు.

"మీ అమ్మాయి పేరు విద్యే కదా?"

"అవును బాబూ!"

"పదిహేను నిమిషాల క్రితం మీ యింటినుంచి మీ అమ్మాయి ఫోన్ చేసింది మాకు! మీ పక్కింట్లో ఎవరి కైనా ఫోను వుందా?"

"ఈ వీధి చివర వున్న పత్రిక ఎడిటర్ గారింట్లో ఫోను వుందిగాని, మా అమ్మాయి గంటనుంచి బయటికే పోలేదు. ఆమె ఫోనుచేసే ప్రసక్తేలేదు!"

"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలరు? అయిదు నిమిషాల్లో వెళ్ళి ఫోనుచేసి తిరిగి రావచ్చుకదా!"

"అరగంటక్రితం అమ్మాయి తలుపులు వేసుకుని లోపల పడుకున్నది. భోజనం చేసిన వెంటనే గదిలోకి వెళ్ళిపోయింది. అయితే అంతక్రితం ఆమెను భోజనం చెయ్యమని చెప్పటానికి చాలా సేపు బతిమాలవలసి వచ్చింది. అమ్మాయి లోపలికి వెళ్ళింతర్వాత నేను యిక్కడే గది బయట కుర్చీలో కూచుని వీక్లీ చదువు కుంటున్నాను.

ఇంతలో చాకలివస్తే గుడ్డలు వెయ్యటానికి అమ్మాయిని తలుపుతట్టి పిలిచాను. ఎంతకీ లేవకపోవటంతో నేను, చాకలి, పనివాడు కూడా చాలాసేపు తట్టాం. కాని తలుపులు తెరుచుకోలేదు. భయంవేసి కిటికీ పగలగొట్టి చూస్తే, మంచానికి అడ్డంగా పడుకుని కనిపించింది. పని వాడు కిటికీలోనించే గడియతీశాడు. తీరా లోనికొచ్చి చూసేసరికి అమ్మాయి చనిపోయి వున్నది!" ఆమె దుఃఖాన్ని ఆపుకోడానికి కాసేపు ఆగింది.

కిరణ్ పగిలిన కిటికీ తలుపుల్ని చూశాడు. ఆమె చెప్పింది నిజమే కావచ్చు. అయితే తమకు ఫోను చేసి తన పేరు విద్య అని చెప్పిన స్త్రీ ఎవరు? శ్రీనివాస్

చెప్పినట్టే ఆమె ప్రాక్టికల్ జోకరా? అలా అనుకుంటే మరి, విద్య ఇంటికి తమను ఎందుకు రమ్మని పిలుస్తుంది? విద్య చనిపోతుందని ఆమెకు తెలుసా? లేక విద్యను ఆమె హత్యచేసి తర్వాత ఫోన్ చేసిందా?

కిరణ్ మస్తిష్కం ఆలోచనలతో వేడెక్కింది.

శవం వంక పరీక్షగా చూశాడు. ఎక్కడా దేహం మీద గాయాలు లేవు. కాని నోటినుంచి రక్తం కారి పక్కమీదకు జారింది. అంటే ఆమె సైనేడ్ కాప్సుల్స్ మింగి ఆత్మహత్య చేసుకుని వుండాలి!

ఎందుకు ఆత్మహత్య చేసుకుంది? ఎవరైనా లోపలకొచ్చి ఆమెకు బలవంతాన కాప్సుల్స్ మింగించి హత్య చేసే అవకాశంలేదు! ఆ గదికి రెండో తలుపులేదు! ఉన్నది ఒకటే ద్వారం. ఆ ద్వారం ముందు కుర్చీ వున్నది. విద్య తల్లి ఆ కుర్చీలో కూచుని వున్నమాట అబద్ధం కాదు! కుర్చీలో ఆ వారం వీక్లీ బోర్లాపడవేసి వున్నది!

ఇంతలో అతనికేదో గుర్తొచ్చి అడిగాడు. "మీరిప్పుడు విషయం చెపుతూ, భోంచేయమని బతిమాలవలసి వచ్చిందని చెప్పారు. అంటే యింట్లో ఏమైనా ఘర్షణ పడ్డారా?" అని.

"అబ్బే, అదేంలేదు బాబూ! అమ్మాయి వాళ్ళ క్లాసు కుర్రాడ్ని ప్రేమించింది. ఆ కుర్రాడ్ని ఎవరో చంపేశారు—అప్పట్నుంచీ అమ్మాయి తిండి తినదు. నిద్ర పోదు! విచారంతో కుమిలిపోతోంది. అందుకే బతిమాలి కొంత ఎంగిలిపడేలా చేశాను!" అన్నదామె.

ఈలోపల శ్రీనివాస్ వీధి చివర పత్రిక ఎడిటర్ గారింటినుంచి హెడ్క్వార్టర్సుకి ఫోన్ చేసి వచ్చాడు—

సిబ్బందిని పంపించమని చెప్పి.

కిరణ్, విద్య గదిని పరిశీలనగా చూశాడు. టేబిలు, గాద్రెజ్ కుర్చీ, టేబిల్ లైటు, ఆమె పడుకుని వున్న మంచం, మూలన విడిచిన గుడ్డలు—యివే వున్నాయి గది నిండా. బహుశా ఆ గుడ్డల గురించే చాకలికి వెయ్యటానికి విద్య తల్లి తలుపు కొట్టి వుంటుంది! ఏ విధంగా చూసినా విద్య తల్లి అబద్ధం చెప్పటం లేదనిపించింది కిరణ్ కు.

"ఈ యింట్లో యెవరెవరుంటున్నారు?" అడిగాడామెను.

"నేను, మావారు, విద్య, విద్య అన్న రఘు, పనివాడు, వంటమనిషి — ఆరుగురం! వంటమనిషి రోజూ రెండు పూటలా వంటచేసి వెళ్ళిపోతుంది. పనివాడు మాత్రం రాత్రింబవళ్ళు యిక్కడే వుంటాడు."

"మీవారేం చేస్తున్నారు?"

"స్వాంజ్ ఐరన్ అండ్ స్టీల్ కంపెనీలో సీనియర్ అకౌంటెంటు. సంగతి ఫోన్ ద్వారా చెప్పాం — ఆ ఎడిటర్ గారింటినుంచే ఫోన్ చేసి. వస్తూ వుంటారు."

"మీ అబ్బాయి రఘు ఏం చేస్తున్నాడు?"

"వాడు పాలిటెక్నిక్ పాసయ్యాడు. ప్రస్తుతం సనత్ నగర్లో ప్రయివేట్ కంపెనీలో అప్రెంటిస్ గా పనిచేస్తున్నాడు. వాడుకూడా ఆరుగంటలవరకు యింటికి తిరిగిరాడు!"

కిరణ్ ఆమెతో మాట్లాడుతునే ఇల్లంతా పరిశీలనగా చూస్తున్నాడు. ఎక్కడో మెలిక వుంది. కాని లింక్ అందటంలేదు.

విద్య అంత్యక్రియలు కాగానే భోజనంచేసి గదిలోనికి వెళ్ళి

అంతలోనే ఎందుకు ఆత్మహత్య చేసుకున్నది? రమేష్ చనిపోవటంతో జీవితంమీద విరక్తి చెందిందా? విరక్తి చెందివుంటేందు కవకాశంలేదు. ఎందుకంటే తనమీద ఆశ పెట్టుకోవద్దని రమేష్ యిదివరకే ఆమెకు చెప్పటం, చెప్పించటం కూడా చేశాడు. విరక్తి కలిగితే అప్పుడే కలిగివుండాలి! కాని, అతను చనిపోయాక యిన్ని రోజులకు ఎందుకు విరక్తి కలుగుతుంది?

టేబిలుమీద, పక్కమీద, తలగడ దిండుకింద అన్ని చోట్లా వెతికాడు కిరణ్. ఆమె చనిపోతూ యెలాంటి కాగితమూ పెట్టలేదు. ఆమెకు డైరీరాసే అలవాటు లేనట్టుంది! గదిలో డైరీ ఏదీ కనిపించలేదు!

కిరణ్ కేదో స్ఫురించింది.

"మధ్యాహ్నం అమ్మాయికి భోజనం ఎవరు పెట్టారు?" అనడిగాడు విద్య తల్లిని.

"సాధారణంగా అందరికీ వంటమనిషే భోజనాలు పెడుతుంది బాబూ! అయితే యీ రోజు చాలాసేపు టేబిలుమీద అమ్మాయికి ఉద్దేశించిన భోజనం అలాగే వుండిపోయింది. ఈ రోజు నేను ఉపవాసం. అందుకని అమ్మాయి ఒక్కతెకు భోజనం టేబిలుమీద పెట్టి అమ్మాయి భోజనం చేసేవరకు వంటమనిషి దగ్గరే వుంది. తర్వాత కంచాలు కూడా కడిగేసి, మళ్ళీ వస్తానని ఇంటికి పోయింది! తన కూతురుకు బావుండలేదని వెళ్ళింది. వీలైతే సాయంత్రం వంటచెయ్యటానికొస్తానని వెళ్ళి పోయింది!"

"ఆమె ఎక్కడుంటుందో మీకు తెలుసా?"

"ఇల్లా బాబూ! మా అబ్బాయి రఘుకి తెలుసు. అన్నట్టు పనివాడిక్కూడా తెలుసు. పిలకమంటారా? ఆమె

యిల్లు దేనికి బాబూ!''

"శాంచెం పనుంది. పనివాడ్ని పిలవండి!"

పనివాడు వచ్చాక వాడినుంచి వంటామె యిల్లు గురించి అడిగి తెల్సుకున్నాడు కిరణ్.

"ఈ రోజు ఎవరైనా మోటారుసైకిలుమీదగాని, లేక మరేదైనా వాహనంమీదగాని వచ్చి వంటామె గురించి అడిగారా?" అనడిగాడు కిరణ్.

"ఉదయం ఎవరో ఒకాయన వచ్చారు బాబూ! ఎర్ర సైకిలుమోటారు. వంటామె కావాలని అడిగితే నేనే ఆమెను పిలిచి చెప్పానండి. అతనితో ఏదో మాట్లాడి లోపలికొచ్చాక ఎవరని అడిగానండి. తన కూతురుకు వంట్లో బావుండలేదని కబురు చెప్పటానికొచ్చాడని, తమ వీధిలోని ఉన్నవారి అబ్బాయని, ఉపకార బుద్ధితో తనకు కబురు చెప్పటానికొచ్చాడని, తన కూతురుకు పురుడువచ్చే రోజులనీ చెప్పింది!" అంది విద్య తల్లి.

"ఆ మోటరుబైకుమీద వచ్చిన కుర్రాడు యెలా వున్నాడు?"

"నల్లగా, ఎత్తుగా వున్నాడు బాబూ! బోడిమూతి. వయసు 20పైన వుంటుంది."

కిరణ్ శ్రీనివాస్ వంక సాభిప్రాయంగా చూశాడు. శ్రీనివాస్‌కి కొంత అర్థమై, కొంత కాకుండా వున్నది.

ఇంతలో పోలీసు డాక్టరు, ఫోటోగ్రాఫరు, వేలి ముద్రల నిపుణుడు వచ్చారు.

కిరణ్ డాక్టరుతో, "ఆమెకు ఆహారంలో విషం కలిపారు. బహుశా సైనేడ్. నోటి చివర్లనుంచి రక్తం కనిపిస్తోంది. దాన్నిబట్టి వూహిస్తున్నాను" అన్నాడు.

డాక్టర్ తలూపి, "యు మే బి రైట్! ఆహారం తిని

ఎంతో సేపు కాలేదంటున్నారు కాబట్టి, పోస్టుమార్టంలో అన్ డైజెస్టెడ్ ఫుడ్ పార్టికల్స్‌లో తెలిసిపోతుంది! డెఫినిట్లీ యిటీజ్ సైనేడ్! కాకపోతే రక్తనాళాలు తెగే ప్రసక్తిలేదు!" అన్నాడు.

కిరణ్ శ్రీనివాస్ వంక తిరిగి, "నేను ఓ అరగంట తర్వాత స్టేషన్‌కొస్తాను. నువ్విలోపల యిక్కడి తతంగం ముగించుకుని స్టేషన్‌కిరా!" అన్నాడు.

తర్వాత పనివాడి వంక తిరిగి, "నాతో రా!" అన్నాడు కిరణ్ బయటికి దారితీస్తూ.

## 10

"వంటమనిషి పారిపోయింది! విద్యుత ఆహారంలో విషం కలిపినది ఆమే! అయినా హంతకుడు తెలిసిపోయాడు. విద్యను అడ్డు తొలగించటానికి హంతకుడు వంటామెను ఉపయోగించుకున్నాడు. నిజానికి వంటామెకు కూతురు లేదు, ఆమెకు పురుడూ రాలేదు! నువ్వు వెంటనే ఆమె గురించి అన్ని స్టేషన్స్‌కీ రిపోర్టు పంపించు! ఇంకా నగరంలో వుంటే ఓ ముఖ్యమైన సాక్షి దొరుకుతుంది.

హంతకుడు-మనోరమ అన్నయ్యను వెంటనే ఆ మోటర్ బైక్‌తో స్వాధీనం చేసుకో! ప్రస్తుతం అతను విజయవాడలోని మధురమ హోటల్లో వుంటున్నట్టు చక్కటి ఎలిబీ కూడా సృష్టించుకుని వున్నాడు" అన్నాడు కిరణ్.

"హంతకుడు మనోరమ అన్నయ్యా? అంటే రమేష్ స్నేహితురాలు మనోరమ అన్నయ్యా? అసలు మనోరమకో అన్నయ్య వున్నట్టు నీకెలా తెలుసు? విజయవాడ హోటల్లో వుండటమేమిటి? అంతా అయోమయంగా వుంది!" అన్నాడు శ్రీనివాస్.

"చెపుతాను విను. నీ దగ్గర్నుంచి సరాసరి విద్యా

వాళ్ళ వంటామె యింటికి వెళ్ళాను. ఆమె యెన్నడూ చెయ్యని తప్పు చేయటంతో పోలీసులు వచ్చేరని తెలిసే సరికి టెన్షన్, భయం, భరించలేక ఎక్కడికో పారి పోయింది.

"ఆ తర్వాత విద్య స్నేహితురాళ్ళు విశాల, మనో రమల యిళ్ళకు వెళ్ళాను. ఎంక్వయిరీలో విశాలకు అన్నయ్యలు గాని, తమ్ముళ్ళు గాని ఎవరూ లేరని తెలిసింది. ఆమె యింట్లో ఫోన్ కూడా లేదు. హత్యా ప్రదేశంలో దొరికిన యూత్ పెన్ను తావాలనే కనిపించేలా పట్టు కుని ఏదో రాస్తూన్నట్టు నటించాను. ఆమె ముఖంలో ఎలాటి భావము కన్పించలేదు. కాని మనోరమతో మాట్లాడుతూ అలాగే నటించాను. ఆమె పదేపదే ఈ పెన్ వంకే చూడటం గమనించాను. ఆమె ముఖంలో రంగులు మారాయి. పెన్ను రమేష్‌దేమో చూసి చెప్ప మన్నాను. అతని హత్య జరిగిన ప్రదేశంలో దొరికిందని చెపుతూ తావాలనే ఆమె చేతికి తాకించబోయాను. షాక్ తిన్నట్టు చేతిని వెనక్కు లాగేసుకున్నది. అంటే ఆమెకు ఆ పెన్‌లో సైనేడ్ వున్నట్టు తెలుసు! ఆ చర్యే ఆమెను పట్టిచ్చింది. ఆమె యింట్లో ఫోన్ వున్నది. ఎదురుగా ఆమె అన్న ఫోటో టేబిల్ మీద కనిపించింది. మీసం, గడ్డం ఫాషన్‌గా కత్తిరించుకుని వున్న ఫోటో! ఇదిగో ఆ ఫోటో!" అంటూ ఫ్రేం ఫోటోను శ్రీనివాస్‌కి అందించాడు కిరణ్.

శ్రీనివాస్ ఫోటో వంక ఆశ్చర్యంగా చూశాడు.

"అదే చెప్తున్నాను. ఈ ఫోటో చూడగానే సరళ పక్కింటామె చెప్పిన మాటలు గుర్తువచ్చాయి. ఫాషన్‌గా గడ్డం, మీసం కత్తిరించుకున్న అబ్బాయిని చూశానని

ఆమె చెప్పింది కదా! ఎవరని అడిగాను మనోరమను. తన అన్నయ్య అనీ వారం రోజులుగా విజయవాడలో కేంప్ మీద ఫలానా హోటల్లో వున్నాడనీ, తన అన్నయ్య సేల్స్‌మాన్ అనీ చెప్పింది. హోటల్స్‌తో పాటు అంత ఖచ్చితంగా ఆమె చెప్పటం కూడా నా అనుమానాన్ని బలపరించింది.

“వెంటనే గాల్లోకి బాణం వదిలాను. విద్యను హత్య చేశారని, వంటామె ద్వారా విషప్రయోగం చేశారనీ, వంటామె ఎవరు తనను హత్యకు పురికొలిపారో చెప్పేసిందనీ అన్నాను.

“అంతే! ఆమెకు ఒక్కసారిగా ముచ్చెమటలు పోశాయి. కుర్చీలో కూచోలేకపోయింది. వెంటనే నా జేబునుంచి పెన్ను లాక్కొని నన్ను గుచ్చబోయింది. వెంటనే సందిట బంధించి లాక్కొని వచ్చి కార్లో పడేశాను. నీవు రాకముందే మీ సార్జంటు శివాని కప్పగించాను. ఆమెనుంచి స్టేట్ మెంటు తీసుకో!” అని ముగించాడు కిరణ్.

శివం, మనోరమకు అరదండాలు తగిలించి వారిముందు నిలబెట్టాడు. శ్రీనివాస్ ఆమె వాఙ్మూలం రికార్డు చేశాడు.

“నాకు మొదట్నుంచీ రమేష్ అంటే చాలా ప్రేమ. కాని రమేష్‌కు నేనంటే యిష్టంలేదు. విద్యంటే ఇష్టం! మా అన్న విజయ్‌కు సరళంటే ప్రాణం. కాని సరళ రెండు సార్లు మా అన్నను విదిల్చికొట్టి బాగా మందలించింది.

“నాకు రమేష్‌మీద, మా అన్నకు సరళమీద కసి, ద్వేషం ఏర్పడ్డాయి. నాకు దక్కని రమేష్ యెవరికీ దక్కకూడదు! మా అన్నకు చెప్పాను రమేష్ పని ముగించమని. మా అన్న నా పెన్ తీసుకుని దాంట్లో

సై నేడ్ నింపాడు. నేను దేనికని అడిగితే చెప్పాడు. దాంతో రమేష్‌ని చంపేశాడు. ఆ రోజు రెండో ఆట సినిమాకు రమేష్ వెళ్ళిన సంగతి మా అన్నతో నేనే చెప్పాను. వెంటనే తన ప్లాను అమలు చేశాడు.

"మరునాడు సరళను కూడా సైనేడ్ యింజక్టు చేసి చంపేశాడు. అయితే అదే సమయానికి విద్య సరళ ఇంటి కొచ్చి మా అన్నయ్య హడావిడిగా మోటరుబైక్ మీద పారిపోవటం చూసిందట. సరళ చనిపోయి వుండటం చూసి భయపడి పారిపోయిందట! మా అన్న సరళను చంపినట్టు విద్య గ్రహించిందని మా అన్న భయపడుతూ నాతో చెప్పాడు. అప్పటికే విజయవాడ హోటల్లో తనుంటున్నట్టు ఎలిబీ సృష్టించుకుని, ఎవరిదో ఎర్ర ఎస్ ఫీల్డు బైక్ దొంగిలించి తిరుగుతున్నాడు అన్నయ్య.

"ఇనస్పెక్టర్ శ్రీనివాస్‌కి రకరకాలుగా గొంతుమార్చి రమేష్ శత్రువుల పేర్లు చెప్పి వాళ్ళే రమేష్‌ని చంపినట్టు చెప్పాడు. నన్ను కూడా ప్రేరేపించి, సరళను విద్య చంపినట్టు చెప్పమన్నాడు. కాని ఇనస్పెక్టర్ నా మాట వినకుండా ఫోన్ పెట్టేశాడు.

"అయితే విద్య తన అనుమానం విషయం తన అన్న రఘుతో చెప్పేసింది. అతను నన్ను బ్లాక్ మెయిల్ చేయ సాగాడు. రహస్యాన్ని దాచటానికి నేను తనతో గడ పాలని కోరాడు. మా అన్న విద్య వాళ్ళ వంటామెను వశపరచుకుని, విద్యకు, రఘుకు విషప్రయోగం చెయ్యమని ప్రయోగించాడు. వంటామె తనపని సగం మాత్రమే పూర్తిచేసింది. ఈలోపల నేను దొరికిపోయాను!" అని చెప్పింది మనోరమ.

—:అయిపోయింది:—

# మహాప్రస్థానం

## చంద్రశేఖర అజాద్

తెలుపు అంటే గతంలో నాకు చాలా ఇష్టం వుండేది.

'తెలుపెవరికి ఇష్టం ఉండదు' అంటుండే వారు కొందరు. నాకు చిన్నప్పటినుంచి తెల్లటి బట్టలు వేసుకోవాలని ఉండేది. చాలాకాలం పోరాడాక ఓసారి తెల్ల చొక్కా కుట్టించుకున్నాను. అది తొడుక్కున్నాక ఎంత సంతోషం కలిగిందో!

నేను చదివిన కథల్లో అప్సరసలు దేవతా వస్త్రాల్లో మెరిసిపోతుండేవారు. నేను చూసిన సినిమాల్లో తెల్లటి బట్టలు ధరించిన హీరోగారు ఎంతో అందంగా ఉండేవాడు. ఎవరు తెల్లటి బట్టలు కట్టుకున్నా వారివంక ఆనందంగా చూస్తుండిపోయేవాడ్ని.

ఆ తెల్ల చొక్కా వేసుకున్నాక పొందిన ఆనందం మిత్రులకు కూడా పంచాలనిపించింది. ఆటల్లోకి వెళ్ళాను. అక్కడ అందరూ ఒక్క క్షణం ఆశ్చర్యంగా చూశారు.

"ఎప్పుడు పట్టించావురా" బాబీగా డన్నాడు.

"మా నాన్న పట్టించాడు" అన్నాను. ఆ సమాధానం ఈ రోజుకు కూడా గుర్తువచ్చినప్పుడు నాలో నేను నవ్వుకుంటాను.

మరుక్షణం ఆటల్లో మునిగిపోయాం. గోళీకాయల ఆట. ఆ రోజు చాలా గోళీలు గెల్చుకున్నాను. అవన్నీ జేబులో పోసుకుని గర్వంగా యింటివైపు నడిచాను. వాకిట్లోనే అమ్మ వుంది. నన్ను కోపంతో చూస్తోంది. నా వంక చూసుకున్నాను. చొక్కా అంతా దుమ్ము. తెల్లటి తెలుపుదనం అక్కడక్కడా కనిపిస్తోంది. అమ్మ నన్ను బాగా వాయించేసింది.

"అందుకే పిల్లలకి తెల్లటి బట్టలు వొద్దన్నాను. వింటేగా" అంటూ నాన్నమీద విసుక్కుంది.

రాసుకుంటున్న నాన్న ఓసారి అమ్మవంక చూశారంతే. స్నానంచేసి వచ్చాక నాన్న నన్ను తన దగ్గర కూర్చోబెట్టుకున్నాడు.

"తెలుపంటే ఇష్టం ఒకటే చాలదురా. తెలుపుకి వేరే రంగుకి అసలే పడదు. తెలుపు తెలుపుగానే ఉంటేనే అందం. స్వచ్ఛంగా వుంటుంది. ఇంకే రంగు బట్టలు వేసుకున్నా మురికి ఇంతగా కనపడదు. తెలుపు రంగుని కోరుకుంటే మాత్రం మురికికి దూరంగా వుండాలి. మల్లెపువ్వుల్లా బట్టల్ని వుంచుకోవాలి" అన్నారాయన.

తొలిసారిగా తెలుపు గురించి ఆరాధనతోపాటు భయం కూడా ఏర్పడింది.

తెలుపు రంగు స్వచ్ఛతను నిలబెట్టడం సామాన్యమైన విషయం కాదు. ఎవరో కవికి సమాజం అంతా తెల్లగా కనిపించిందట. బహుశా స్వచ్ఛంగా కాబోలు. అంత

మాత్రాన తెలుపుమీద నా అభిమానంతో మార్పురాక పోగా మరింత పెరిగింది. ఆ తెలుపును స్వచ్ఛంగా ఉంచాలనే ఆరాటం ఎక్కువయింది.

మాది సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబం. నాకు ఇద్దరు అక్కలు. నేనొక్కడినే మొగపిల్లవాడ్ని. మా నాన్న గారు లెక్కలు రాస్తుండేవారు. దానిమీద వచ్చే ఆదాయం బహు స్వల్పం. అందుకే పేదరికంలోనే పెరిగాను.

నేను చదువుకునేటప్పుడు గొప్పవారి పిల్లలు రోజూ తెల్లటి బట్టలు వేసుకొచ్చేవారు. అవి మెరుస్తూ నాకు సంతోషాన్ని కలిగించేవి. అయితే వారెలా ఆ స్వచ్ఛతను నిలబెట్టుకుంటున్నారో నాకర్థం అయ్యేది కాదు. ఓసారి నా స్నేహితుడ్ని అడిగాను. అతను చెప్పాడు.

"ఇలాంటి చొక్కాలు నా దగ్గర చాలా ఉన్నాయ్. రోజుకొకటి వేసుకుంటాను."

అప్పుడే నాకర్థం అయింది. తెలుపుకి మురికి అంట కుండ వుండదని, దాన్ని వదిలించుకోవటానికి చాలా మార్గాలుంటాయని. మురికి అయిందని వదిలెయ్యటం, శుభ్రం చేయటం. ఎక్కువ మురికి కాకుండానే విస ర్జించటం.

తెలుపును గురించి నేనింతగా చెప్పటం మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. మన జీవితంలో ప్రతి ఒక్కరిపై రంగుల ప్రభావం వుంటుందని ఎందరో గొప్పవారు చెప్పారు. వారి వారి అభిరుచుల్ని బట్టి, మనః ప్రవృత్తుల్ని బట్టి రంగులను ఇష్టపడతారట. నాకు తెలిసిన ఒకాయన బట్టలు చూసి సైకాలజీ వివరించేవాడు. అలాగే మరో కాయన.

"ఆ ముఖం చూస్తే తెలవటంలా, దొంగ వెధవని" అనేవాడు. ఆయినే మరికొందర్ని చూసి "అబ్బ! జాతి వడయ్యా! ఆ ముఖంలో కళ చూడు" అంటుండే వాడు. వాళ్ళెలా కనిపెడతారో నాకర్థం అయ్యేది కాదు. ఓసారి "నా ముఖం ఎలా ఉంది" అనడిగేను. ఆయన నా వంక ఓసారి చూసి "నీది తెల్ల ముఖమోయ్" అన్నాడు.

తెలుపు గురించి ఆలోచించి అలా అయిందేమో అనుకున్నా. మొత్తంమీద ఒకందుకు నాకు తృప్తిగా ఉండేది. నేను నల్లరంగునిగాని, ఎర్ర రంగునిగాని ఇష్టపడటంలేదు. తెలుపును మాత్రమే అందులోనూ తెల్లటి తెలుపును మాత్రమే ఇష్టపడుతున్నాను. అంత స్వచ్ఛంగా ఉండాలనుకుంటున్నాను.

మిగతా రంగుల్ని ఇష్టపడేవారంతా అన్యాయాన్ని, మోసాన్ని, రక్తపాతాన్ని మరొకటి కోరుకుంటారు. వాళ్ళందరి నడుమ మట్టిలో మాణిక్యంలాంటి వాడినయి నందుకు నేను గర్విస్తుండేవాడిని. అంతులేని పేదరికంలో ఉంటూ ఇంత మంచి భావాలు కలిగి ఉండటం గర్వ కారణమే కదా!

## 2

ఓ రోజు ఆడుకొని ఇంటికొస్తున్న నాకు ఇంటిముందు ఓ పెద్ద గుంపు కనపడింది. ఏమిటబ్బా అనుకుంటూ వెళ్ళాను.

అమ్మ, అక్కవాళ్ళ ఏడుపు వినిపిస్తోంది. నేను జనాన్ని నెట్టుకుంటూ పోయాను.

నాన్నను క్రిందపడుకోబెట్టారు. ఆయన కళ్ళు నిశ్చలంగా వున్నాయి ఎటో చూస్తూ. ఆయన శరీరంమీద

తెల్లటి గుడ్డ కప్పారు. ఆయనమీదపడి అమ్మ ఏడు స్తోంది. శాళ్ళ దగ్గర అక్కయ్యలు ఏడుస్తున్నారు. నన్ను చూడగానే అమ్మ మరింత బిగ్గరగా ఏడ్చేసింది. చూస్తున్న వాళ్ళంతా సానుభూతిగా ఏమేమో అంటు న్నారు. నాకు ఏడుపొచ్చింది.

మొదటిసారిగా నాన్న వంటిమీద కప్పిన తెల్లటి బట్టమీద స్వచ్ఛత కనిపించటంలేదు, విషాదం కనిపిం చింది. బ్రతుకు భయం కనిపించింది.

శవాన్ని ఎక్కువసేపు ఉంచటానికి యింటాయన ఒప్పుకోలేదు. వెంట వెంటనే ఏర్పాట్లు జరిగాయి. చేతిలో కుండతో నేను ముందు బయలుదేరాను. చితికి నిప్పంటించాను. నాన్న అదృష్టవంతుడు. స్వేచ్ఛగా వెళ్ళిపోయాడు. బ్రతుకు బాధల్లో వివిధ కోణాల్ని దర్శించటానికి సిద్ధంకావలసి వచ్చింది.

మొదట నన్ను కదిలించింది అమ్మ తెల్లటి బట్టలు కట్టుకోవటం. ఆమె రోజూ ముతక బట్టలే ధరిస్తోంది. ఆమెకు జుట్టంతా తీసివేశారు. తెలుపుమీద అభిమా నంతో మరో భాగం కరిగిపోయింది.

అప్పటికి నాకు పన్నెండేళ్ళు. నన్ను చదివించటం అమ్మకెటూ సాధ్యంకాదు. మాకు డబ్బులేకపోవటంతో అటు అమ్మనుండిగాని, ఇటు నాన్ననుండిగాని బంధువు లెవరూ రాలేదు.

ఇంటాయన వెంటనే ఇల్లువదిలి వెళ్ళిపొమ్మన్నాడు. మేం దిక్కుతోచక లేబర్ కాలనీలో ఓ ఇంటికి వెళ్ళి పోయాం.

నేను బడి మానేశాను. ఏదైనా ఉద్యోగం వెతు క్కోవాలి. ఆ ఇంటి చుట్టుప్రక్కల వాతావరణం మహా

దారుణంగా ఉండేది.

మురుక్కాలువలు .... వాటిలో పారే పందులు.... వాటితో సహజీవనంచేసే ప్రజలు, సంగీతం వినిపించే దోమలు అంతా నానా బీభత్సంగా ఉండేది. రోజూ యెవరో ఒకరు తాగొచ్చి నానా గందరగోళం చేస్తుండే వారు. చూస్తుండగానే పెద్ద కొట్లాటలు లేచేవి. మొత్తం పేటంతా అటో ఇటో చీలిపోయేది. అంతలోనే సద్దుమణిగిపోయేది. తెల్లవారగానే ఎవరి పనులకు వారు వెళ్ళిపోయేవారు. ఇదంతా చాలా చిత్రంగా ఉండేది.

నెలకు నలభై రూపాయల జీతంమీద ఓ షాపులో ఉద్యోగానికి కుదిరాను. ఆ డబ్బుతో మా అందరికీ తిండి గడవటం కష్టం. అమ్మ అప్పడాలు లాంటివి చేయాలని ప్రతిపాదించింది. అక్క వాళ్ళు చేస్తున్నారు. వాటిని హోటళ్ళకు అమ్మటం వాటితో ఎలానో బ్రతకటం అలవర్చుకుంటున్నాం. అమ్మ ఎప్పుడూ ఆలోచిస్తుండేది. అక్కల పెళ్ళిళ్ళు ఎలా చేయాల నేదే ఆ ఆలోచన.

## 3

మా షాపు ఓనర్ గారికి చాలా వ్యాపారాలున్నాయి. మిరపకాయల సీజన్ లో అవి కొని నిల్వచేసి రేటు పెరిగాక అమ్మతాడు. అప్పుడప్పుడు నష్టాలు కూడా వస్తుండేవి. ఇంకా ధాన్యం వ్యాపారం చేసేవాడు. యే వ్యాపారంలో లాభం వస్తుందనుకుంటే ఆ వ్యాపారాలు చేస్తుండేవాడు. అందుకే ఆయనకు తీరిక వుండేదికాదు.

ఆయనకో అబ్బాయి ఉండేవాడు. ఆ అబ్బాయి తెల్లటి బట్టలు వేసుకొని మిలమిలలాడుతుండేవాడు. చేతి వ్రేళ్ళకు ఉంగరా లుండేవి. చేతికి ఇంపోర్టెడ్ గడి

య్యారం ఉండేది. ఆ అబ్బాయివి తెల్లటి పళ్ళు. మనిషి కొంచెం నల్లగా ఉంటాడేమో నవ్వినపుడు అవి మెరిసేవి.

కాని యెందుకో అతనిమీద నాకు సదభిప్రాయం కలగలేదు. అందుకు కారణం మా షావుకారే. ఆయన తన కొడుకును కూడా నమ్మినట్లుండేవాడు కాదు. అది వ్యాపార లక్షణం అని ఆ తర్వాత తెలిసింది. ఆయన కింకా చాలా లక్షణా లున్నాయి.

ఆ రోజు కొట్లో వెయ్యి రూపాయలు మాయం అయ్యాయ్. షావుకారు తోకతొక్కిన తాచులా లేచాడు. వాళ్ళబ్బాయి యేదో చెప్పాడు. ఆయన నా వంక క్రూరంగా చూశాడు.

ఆ తర్వాత నా ఒంటిమీద ఎన్ని దెబ్బలు పడ్డాయో లెక్కలేదు. అంతటితో ఆగలేదు. ఆ తర్వాత పోలీస్ స్టేషన్‌లో ఉన్నాను. ఆరు నెలలు కారాగార శిక్ష విధించేరు జడ్జిగారు. అమ్మ షావుకారును ఎంతగా బ్రతిమ లాడిందో, అయినా అతని హృదయం కరగలేదు.

జైళ్ళో నాకు అమ్మవాళ్ళ గురించి ఆలోచన రాలేదు. నన్ను కొట్టినప్పుడు నా నోట్లోనుండి వచ్చిన ఎర్రటి రక్తం గుర్తుకొచ్చేది.

ఇక్కడ నేను వేసుకున్న తెల్ల బనీను లాగు నన్ను వెక్కిరించాయి. నాకిచ్చిన తెల్లటి పళ్ళెంలో తెల్లటి ముద్ద.... దానిమీద సాంబారు గొంగళి పురుగుల్లాంటి మిరపకాయలు నన్ను నిలదన్నాయి.

నేను కరుడు గట్టుకుపోవటం ప్రారంభించాను. చల్లటి మంచు హస్తం నా గుండెను మెల్లగా తాకింది. మొదట విలవిలలాడిపోయాను. తర్వాత అలవాటు పడిపోయాను.

ఇంతకాలం నేను అలౌకిక ప్రపంచంలో ఉన్నాను. ప్రపంచమంతా స్వచ్ఛంగా ఏ మోసాల్లేకుండా ఉంటుం దనుకున్నాను. కానీ ఏదీ తెల్లగాలేదు. తెలుపు గురించి నా దృక్పథంలో మార్పు అప్పుడునుంచే ప్రారంభ మయింది.

నేను జైలునుండి తిరిగొచ్చాను. అప్పటికి ఇంటిసంగతి గుర్తుకొచ్చింది. ఎలా ఉన్నారు? అసలు బతికి వున్నారా? భయం భయంగానే యింటికి వెళ్ళాను. ఏ దృశ్యం చూడాల్సి ఉంటుందో!

నేననుకున్నంత బీభత్సంగా మాత్రంలేదు. పైపెచ్చు ఇంట్లో ఏదో కళ కనపడుతోంది. కొన్ని క్రొత్త వస్తు వులు ఇంట్లో నన్నాకర్షించాయి. వెళ్ళగానే అమ్మ తృప్తికరంగా బ్రహ్మాండమైన భోజనం వడ్డించింది. తింటున్నంతసేపు తలవంచుకునే వున్నాను. ఇంట్లో ఇప్పుడు మంచాలున్నాయి. పరుపులున్నాయి. కుర్చీ లున్నాయి.

ఆ తర్వాత వారం రోజుల్లోనే మేం అక్కడ్నుంచి ఓ విశాలమైన ఇంటికి మారిపోయాం. ఇంట్లోకి రేడియో, ఫ్యాన్‌లు, టేబుల్స్ ఒక్కొక్కటే వస్తున్నాయ్. ఇదంతా నాకు చాలా ఆశ్చర్యంగా కనిపించసాగింది.

మా పెద్దక్క ఉద్యోగం చేస్తుందని అమ్మ చెప్పింది. ఆమె చదువుకుంది అంతంత మాత్రమే. అయితే ఇంతగా జీతాలెలా ఇస్తున్నారో నాకర్థంకాలేదు. మా పెద్దక్క చాలా అందంగా ఉంటుంది. చిన్నక్క కూడా అందం గానే వున్నా పెద్దక్క అంతకాదు. చిన్నప్పటినుండి మా పెద్దక్కను "జగమొండి" అంటుండేవాళ్ళు. సంప్ర దాయాల్ని లెక్కచేసేదికాదు. మా నాన్న బాధపడటం

మినహాయించి ఏం అనేవాడు కాదు.

ఇప్పుడు నేను మంచిబట్టలు కట్టించుకున్నాను. నా మీద దొంగనే నేరం ఆపాదించబడింది. అందుకని అక్కడ తెలిసిన వారెవరూ నాకు ఉద్యోగం యివ్వరు. అందుకు నేను బాధపడలేదుకూడా. యే బాధ లేకుండా అక్క ఉద్యోగం చేస్తోందికదా! తిరిగి చదువుకోవాలని కూడా అనిపించటంలేదు. తీరా బడిలో చేరాక అందరూ "దొంగ, దొంగ" అంటుంటే అది నేను భరించలేను కూడా!

మా షావుకారు గురించి ఆరాతీయటం మానలేదు. వాడి కొడుక్కి పెళ్ళి అయింది. ఇప్పుడు వ్యాపారాలన్నీ వాడే చూస్తున్నాడు. అందుకు కారణం మా షావుకారుకు పక్షవాతం వచ్చింది. కాళ్ళూ చేతులూ పడిపోయాయ్. నాకు సంతోషం కలగలేదు. వాడ్ని చిత్రవధచేసి చంపాలనుకున్నాను. వాడిలా కావటం ఓ రకంగా నాకు బాధే కలిగించింది.

నాకు ఇంటి దగ్గర ఉండటం బాధాకరంగా వుంది. ఈ విషయమే అక్కకు చెప్పాను.

"ఏం చేస్తావ్" అంది అక్క.

"ఏదో ఒకటి చెయ్యాలి. నాకు తిని కూర్చోవటం నచ్చలేదు."

"మద్రాసు వెళతావా" తిరిగి అక్కే అంది.

"మద్రాసా."

"అవును. నువ్వక్కడ చదువుకోవాలి" అంది అక్క.

నాకు ఉత్సాహం కలిగింది.

"అంతేకాదు. నువ్వు సమస్తం నేర్చుకోవాలి. అన్ని భాషలూ నేర్చుకో. శారీరకంగా నువ్వెంత హీనంగా

వున్నావో తెలుసా? అందుకే ఆ రకమైన విద్యలు కూడా నేర్చుకోవాలి. నీ శరీరం ఉక్కులా గట్టిపడాలి. ముఖ్యంగా జీవితం అంటే ఏమిటో నేర్చుకో.

నీమీద నాకు చాలా ఆశ లున్నాయి. ఈ సమాజం మీద అంతులేని ద్వేషం వుంది. నువ్వు చెయ్యని నేరం కోసం జైలుకెళ్ళావు. నాన్న ఎందుకు చచ్చిపోయాడో నాకు తెలుసు. మేం ఆయన గుండెలమీద కుంపటిలా తయారయ్యాం. ఆయన సంప్రదాయాల్ని గౌరవించాడు. ఎవరెవరి లాభాలకోసమో దొంగ లెక్కలు రాశాడు. అయినా మన జీవితాల్లో మార్పు రాలేదు. ఆయన చచ్చి పోతే వెంటనే ఇల్లువదిలి పొమ్మన్నారు. ఆయనచేత ఇన్ని సంవత్సరాలు చాకిరి చేయించుకున్న వాడెవడూ ఇటువైపు చూడలేదు. అయినా నేను బాధపడలేదు. అమ్మ గాజులు బ్రద్దలయ్యాయ్. నుదురు బొట్టు పోయింది. జుట్టు పోయింది. తెల్లటి ముతక బట్టలు మాత్రం వచ్చాయ్.

ఎందుకివన్నీ? మన బ్రతుకులో ఆకలిని తీర్చలేని ఈ సంప్రదాయాలు నాన్న చచ్చిపోయాక కూడా మనమీద అధికారం చెలాయిస్తున్నాయ్. నీకు తెల్లబట్టలంటే ఇష్టం. అమ్మను తెల్ల బట్టల్లో చూస్తుంటే నీకేమని పిస్తోంది. మన జీవితాల్ని బాగుచేయటం సంగతి అలా ఉంచు. మనల్ని ఎదగకుండా చేస్తున్నాయి ఈ సంప్ర దాయాలు. అందుకే ఈ సమాజం అంటే నాకు కసి.

ఈ సమాజం అంటే ఎవరు? మా షావుకారులాంటి వారు. నువ్వు చెయ్యని దొంగతనం నీమీద మోపాడు. జైల్లో త్రోయించాడు. నిన్ను రక్తం చిందేట్లు కొట్టాడు. ఇవన్నీ నా కడుపు మండిస్తున్నాయ్. అందుకే గొప్పవారి

మీద నాకు ద్వేషంగా వుంది. నేను కసి తీర్చుకుంటాను. నేను ఈ సంప్రదాయాల్ని తిరస్కరిస్తాను.

అయితే ఇదంతా నా ఒక్కదానివల్ల సాధ్యంకాదు. నేను తొక్కిన మార్గం సరయింది కాకపోవచ్చు. నువ్వు మాత్రం యే నాటికయినా అర్థంచేసుకోగలవనే నా నమ్మకం. నా జీవితం గురించి మొత్తం వివరాలు నీకు చెబుతాను.

నువ్వు శారీరకంగా మానసికంగా ఎదగాలి. ఈ సమాజం సాలెగూడు లాంటిది. ఈ చట్టాల్లో లొసుగు లున్నాయి. అవన్నీ నీ వర్థం చేసుకోవాలి. నా పద్ధతులు అమ్మకు నచ్చవు. పాతకాలంనాటి మనిషి. నువ్వు మాత్రం నేర్చుకోవటమే చెయ్యాల్సింది. డబ్బు గురించి నువ్వేం బెంగపడాల్సిన అవసరంలేదు'' అంది అక్క.

సుదీర్ఘంగా మాట్లాడిందేమో ఆయాసంతో ఎగిరెగిరి పడుతుంది. ఆమె వదనం ఎర్రగా వుంది. ఆమెను చూస్తుంటే కలకత్తా కాళీ గుర్తొచ్చింది. ఆ వయసులో ఆమెను పూర్తిగా అర్థంచేసుకోవటం నాకు సాధ్యం కాలేదు. కానీ ఆమె నా మీద పెట్టుకున్న ఆశలు మాత్రం అర్థమయ్యాయి. నాకు అక్కతో జరిగిన ఈ సంభాషణ ఆ తర్వాత గుర్తొచ్చేది.

## 4

నేను మద్రాసు వెళ్ళిపోయాను. నెలనెలా డబ్బు అందుతుండేది.

శారీరకంగా గతంలో ఎంత అల్పుడినో ఇప్పుడంత శక్తివంతుడ్ని. నాకు అన్ని విద్యల్లో ప్రవేశం వుంది. ఏ ఆయుధం లేకుండా ఒంటరిగా పదిమందిని యెదుర్కో గలను.

నేను నా పరిధిలోకి వచ్చిన సాహిత్యమంతా చదివాను. అందులో తత్వశాస్త్రం ఉంది. క్రైమ్ సాహిత్యం ఉంది. ప్రేమ సాహిత్యం వుంది.

రోజూ సాయంకాలం బీచ్‌కు వెళుతుండేవాడిని. అలా సముద్రం వంక చూడటం ఓ అలవాటుగా మారింది.

అప్పుడప్పుడు అక్క దగ్గరకు వెళుతుండేవాడిని. నాలో మార్పును అక్క కనిపెట్టింది. మా రెండో అక్క ఎవరో వ్యక్తిని ప్రేమించింది. అక్క వాళ్ళ వివాహం చేసింది. వాళ్ళు ఉద్యోగరీత్యా దూరప్రాంతాలకు వెళ్ళిపోయారు. తాను మాత్రం పెళ్ళి చేసుకోలేదు.

అమ్మ దిగులుతో క్రుంగిపోయింది. ఆ తర్వాత చచ్చిపోయింది. ఇన్నాళ్ళు పెంచిన అమ్మ పోవటం బాధాకరమే అయినా అలవాటయిపోయింది.

అక్క ఊర్లో ఒంటరిగా వుంటోంది. నేను మద్రాసులో ఉంటున్నాను. నేనిప్పుడు ఆధునిక సమాజాన్ని అర్థంచేసుకుని, దాన్ని యెదిరించే స్థితికి చేరుకోగల్గాను.

అందుకే అక్క దగ్గరకెళ్ళాను. ఆమె నన్ను చూసి సంతృప్తి చెందినట్లు కనిపించింది. ఆ రోజు రాత్రి ఇద్దరం ఆమె గదిలో కూర్చున్నాం. ఇప్పుడు అక్క ఓ పెద్ద భవంతికి అధికారిణి. ఆమెకు కారుంది. నౌకర్లున్నారు. ఆ ఇంటినిండా వైభవాలున్నాయి. కలర్ టీ.వి. వుంది. సమస్తం ఉన్నాయ్. అదో భూతల స్వర్గం అనిపించింది. అక్క గదిలో మాత్రం ఓ చిరిగిపోయిన చాప అతుకుల దుప్పట్లు రెండు మాత్రం ఉన్నాయ్.

"ఆశ్చర్యపోతున్నావా" అంది అక్క.

నేను మాట్లాడలేదు. ఆ గది అక్క దృక్పథాన్ని

చెబుతోంది.

"ఈ రోజు నీతో అన్నీ మాట్లాడాలి" అంది ప్రారంభంగా.

"నిన్నిప్పుడు చూస్తే చాలా సంతోషంగా ఉంది. నిన్నో వ్యక్తిగా తీర్చిదిద్దటం నా అదృష్టం. నాన్న పోయాడు__అమ్మ పోయింది. అయినా మనం బ్రతికే వున్నాం. నేను పోయినా, నువ్వు పోయినా మనం బ్రతికేస్తాం. అసలు బ్రతుకెందుకనే సమస్య నా కొచ్చింది. ఈ సమాజం సృష్టించిన భావాలకు ఎదురు తిరగాలనుకున్నాను. తిరిగాను. ఈ పట్టణంలో మహా మహా పెద్దమనుషుల్ని వెధవల్ని చేశాను.

నీకు గుర్తుండే ఉంటుంది. నువ్వు చెయ్యని నేరం మోపబడినప్పుడు, నువ్వు దెబ్బలు తిన్నప్పుడు, నువ్వు జైల్లో నరకం అనుభవించినప్పుడు నాకేం అనిపించిందో నాకు తెలుసు. కానీ ఒక్కసారే మీ షావుకారుని చంపేస్తే అందులో మజా ఏముంటుంది? ఉద్రేకం తప్ప! తిరిగి నీ జీవితం దుర్భరం కావటం తప్ప. అందుకే నేను కసి తీర్చుకున్నాను. ఈ రోజు మీ షావుకారు మొహానికి గంజిపోసే దిక్కు లేదు. ఆ రోజు నేరం నీమీద మోపిన వాడి కొడుకు దివాళాతీసి రోడ్డుమీదున్నాడు. వాళ్ళకి బాధలంటే ఏమిటో ఇప్పుడే తెలుస్తున్నాయి.

వీళ్ళందరినీ అలా చూస్తుంటే నాకు తృప్తి. నాలో అంత కసి పెరిగిపోయింది. చిన్నతనంనుండి మంచి భోజనానికి నోచుకున్నామా? నేను కన్న ఏ కలలూ నిజం కాలేదు. ఆఖరకు అప్పడాలు వత్తి న్యాయంగా బ్రతకాలనుకున్నాం. కాని ఈ సమాజం యేం చేసింది. ఈ రోజు నీ అక్క చెడిపోయిందని సంప్రదాయవాదులంతా

నోళ్ళు నొక్కుతుంటున్నారు. అలాంటి వెధవలపట్ల నా కసహ్యం. నేను చెడిపోయానట. లేదు. వీళ్ళంతా చెడిపోయారు. తెల్లటి బట్టల మాటున, చిరునవ్వుల, మోసాల మాటున బ్రతికేవారిని నా చుట్టూ కావాలని తిప్పుకున్నాను. వాళ్ళ గురించి ఒక్క ముక్క అనలేని దౌర్భాగ్యులు నా వంక వేలు చూపిస్తారు.

ఇదంతా వింటుంటే నీకు కలలా వుంది కదూ! ఆశ్చర్యంగా వుంది కదూ! నేనేం సాధించాననుకుంటున్నావా? ఎవరు మాత్రం ఏం సాధించారు? ఈ దేశ నాయకుల త్యాగాలు ఎవరికోసం. వాళ్ళ పిల్లలకోసం. వ్యాపారాల్లో లక్షలాది రూపాయలు సంపాదించటం ఎందుకు? అందుకే కొలబద్ద కాదు నాది. నేను రాజకీయ వాదుల్ని చూశాను. సంప్రదాయవాదుల్ని చూశాను. కవులూ కళాకరాల్ని చూశాను. ఒక్క మాటలో ఈ సమాజం పేరున్న ప్రతివాడి జీవితం నాకు తెలుసు. ఇక్కడంతా మోసం....కుళ్ళు....జుగుప్స అని అర్థంచేసుకున్నా, ఈ జీవితంపట్ల నాకు అసహ్యం కలగటంలేదు.

అసలు నేనెందుకిలా మారానో కూడా తెలియదు. ఎవరిమీదో కసి నన్నిలా పురికొల్పింది. నా కసి తీర్చుకున్నాను. ఇప్పుడేమిటనే ప్రశ్న నన్ను వేధిస్తోంది. నేను సంప్రదాయాల్ని ఎడంకాలితో తన్నాను.

నిన్ను ఓ వ్యక్తిగా తీర్చాలనుకున్నాను. ఇంతకాలం నా శరీరంమీద వచ్చిన డబ్బే నిన్ను పెంచింది. నేనిలా చేయకుంటే మనమేం అయేవాళ్ళమో నేను ఊహించాను. లక్ష్మి వేరే జీవితం కోరుకుంది. సంతోషంగా ఒప్పుకున్నాను. నా జీవితపు ఛాయలు సోకకుండా దూరంగా పంపించాను. అయితే నీనుండి ఒకే విషయం

తెలుసుకోవా లనుకుంటున్నాను—

"నా గురించి నీ అభిప్రాయం యేమిటి?"

ఆమెవంక చూసే ధైర్యం నాకు లేకపోయింది. అయినా ఒక్కసారి అప్రయత్నంగా కళ్ళెత్తి ఆమె వంక చూసి తల దించుకున్నాను.

"నువ్వుకూడా నా డబ్బు పాపిష్టిదనుకుంటున్నావా? ఈ సమాజంలో పాపిష్టిది కానిదేమిటి? అసలు డబ్బంటే యేమిటి? అదెందుకు పుట్టింది? నువ్వుకూడా ఆ రకంగా ఆలోచిస్తే చెప్పు. నా ప్రయత్నం దెబ్బతిందనుకుంటాను. ఇన్నినాళ్ళు ఈ డబ్బుతో సాకబడిన నేరానికి ప్రాయశ్చిత్తం చేసుకుందువుగాని" అంది.

"అక్కా" అరవాలనుకున్నాను. నా గొంతులో పిలుపు అలానే వుండిపోయింది. నా కళ్ళలో నీరు గిరుక్కున తిరిగి బుగ్గలమీద కారిపోయింది.

"తమ్ముడూ" గుండె పొరల్ని చీల్చుకొచ్చాయా మాటలు. అమాంతం నన్ను ప్రేమతో గుండెలకు అదుముకుంది. నాకు అమ్మ గుర్తొచ్చింది. పండువెన్నెల గుర్తొచ్చింది. ఆమె స్పర్శ చల్లగానూ, ప్రేమగానూ ఉంది. ఆమె దేవతలా ఉంది. ఆమెకు మాలిన్యం ఎలా అంటకలదు.

అక్క జీవితాన్ని గురించి ఎంత గొప్పగా ఎనలైజ్ చేసి చెప్పగలిగింది. నేను చదివిన ఫిలాసఫి బుక్స్‌లో అక్క ప్రశ్నలకు సమాధానం లభించదు. ఈ ప్రపంచం అంతా మాయ అనుకున్నప్పుడు అక్క కూడా మాయలో భాగమే కదా. ఆమెను వ్యతిరేకించాల్సిన పనేముంది.

అలా ఎంతసేపున్నామో తెలియదు. నౌకరు భోజనానికి పిలిచాక లేచి వెళ్ళాం. మౌనంగానే భోంచేశాం.

నేను నా గదిలోనికి వచ్చాను. నిద్రరావటంలేదు. కిటికీలోనుండి చందమామ కనిపిస్తోంది. పూలచెట్లను రాసుకుని వాటి సువాసన పీల్చుకుని మధురంగా అందించి వెళుతోంది పిల్లగాలి.

జీవితం ఏమిటి? ఎక్కడికి? ఎందుకు? నా తలలో అంతులేని ఆలోచనలు....కొన్నేళ్ళ క్రితం ఇలానే జైలు గోడల నడుమ నిద్రరాక చంద్రుడిన్ని చూస్తుంటే లావాలు, అగ్నిగోళాలు కనిపించేవి. యెంత మార్పు. నా ఆలోచనల వెనక అక్క వుంది. అలానే ఆలోచిస్తూ పడుకున్నాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు.

నా నుదుటిమీద యెవరిదో చల్లని చెయ్యి మృదువుగా! మెల్లగా నడిచివెళుతున్న చప్పుడు.

అది అక్క పాదాల చప్పుడే!

## 5

నేను తిరిగి మద్రాసు వెళ్ళిపోయాను. ఈసారి అక్క నుండి డబ్బుతీసుకోలేదు.

"నీ డబ్బుమీద నాకు ద్వేషంలేదు. ఓ వేళ ద్వేషం వుంటే నేను ఆత్మహత్య చేసుకోవాలి. కారణం నా నరనరాల్లోనూ నీ డబ్బే వుంది. అయితే స్వతంత్రంగా బ్రతకాలని ఆశపడుతున్నాను. ఇన్నాళ్ళు నన్నో మనిషిగా తీర్చిదిద్దావు. మరి నన్ను కూడా ప్రయత్నం చెయ్యినివ్వు. అంతగా జీవితంలో ఫీలయితే నీ దగ్గరకే వస్తాను. నువ్వు కాదనవని నాకు తెలుసు" అన్నాను.

అక్క "నీ ఇష్టం" అంది. వచ్చేటప్పుడు అక్క మాటలు నాకింకా గుర్తు ఉన్నాయ్.

"నీతో చెప్పినట్లు నా జీవితంలో ఓ భాగం ముగిసిపోయింది. ఇంక తెర దించేయాలనుకుంటున్నాను. అయితే

ఒక్క విషయం. ఈ జీవితం మూలంగా తిరిగి సంప్రదాయాల కౌగిట్లోకి పోవటంలేదు. నాకిప్పుడు జిజ్ఞాస కలుగుతోంది. ఈ ప్రపంచం గురించి పరిశోధించాలని పిస్తోంది. నా కసి ఎవరిమీదో ఇంకా నాకు స్పష్టం కాలేదు. నేను పొరపాటు అభిప్రాయాలు కలిగి ఉండవచ్చు. అందుకే త్వరలో ఈ ఊరు విడిచి వెళుతున్నాను. ఎక్కడికో నాకే తెలియదు. కానీ ఒకటి మాత్రం నిజం. ఈ క్షణంనుండి నేను విద్యార్థిని. నేను నేర్చుకోబోతున్నాను. ఇంక ఈ పట్టణంలోని నాగరిక, దద్దుజన మహిళలు ఊపిరి పీల్చుకుంటారు కాబోలు" అంటూ నవ్వింది.

ఆ నవ్వు ఎంత స్వచ్ఛంగా..ఎంత అందంగా ఉందో!

మద్రాసు వచ్చాక నాకూ తిరిగి ఆ లో చ న లు ప్రారంభం అయ్యాయ్. జీవితం ఏమిటి? నేనే మార్గాన్ని ఎన్నుకోవాలి? బ్రతకటం ఎందుకు?

ఓ రోజు సాయంకాలం అలా సముద్రంకేసి చూస్తుండగా ఎవరిదో ఆక్రందన. ఆ వైపుకు దూసుకెళ్ళాను. ఓ అమ్మాయిని ఎవరో బలవంతం చేయబోతున్నారు. ఆ అమ్మాయి పెనుగులాడుతోంది. వెనగ్గా వెళ్ళి వాడి కాలర్ పట్టుకొని గుంజాను. గజం దూరంలో పడ్డాడు.

"ఎవడ్రా నువ్వు?" అరిచాడు.

"నీ బాబును బే!"

అతను విసురుగా లేచాడు. నా మొహంమీదికి బలంగా చెయ్యి విసిరాడు. గాల్లోనే అందుకొని అరచేత్తో భుజం మీద కొట్టాను. ఎక్కడో సన్నగా ధ్వని. వాడి భుజం ఓ ప్రక్కకు ఒరిగిపోయింది. వాడు భయంగా చూశాడు. అంతే మరుక్షణం లేచి పరిగెత్తాడు. ఆ చెయ్యి ఓ

ప్రక్కగా వాల్చి పరిగెడుతుంటే నాకు భలే నవ్వొచ్చింది. ఆ అమ్మాయి భయం భయంగా చూస్తుంది.... ఏడుస్తూనే.

"మీరేం భయపడకండి" అన్నాను.

ఇద్దరం నడుస్తున్నాం. ఎదురుగా అనంతమైన సముద్రం ఘోషిస్తోంది.

"మీ పేరు తెలుసుకోవచ్చా" అన్నాను.

"సీత" అందామె.

"ఎవరతను?"

"నేను ఆయన కంపెనీలో పనిచేస్తున్నాను. క్రొత్త బిజినెస్ విషయం మాట్లాడాలి, అక్కడ లెటర్స్ డిక్టేట్ చేస్తానని చెప్పి తీసుకొచ్చి" ఆమె గొంతు దుఃఖంతో పూడిపోయింది.

"అంటే రేపట్నుంచి మీ ఉద్యోగం పోయిందన్నమాట."

"అంతకంటే ఆయన మిమ్మల్ని ఏం చేస్తాడోనని భయంగా వుంది" అంది సీత.

కని పోయింది రక్షించి పొరపాటు చేశానా అనిపించింది.

ఆమెతోపాటు ఆమె ఇంటికి వెళ్ళాను. అచ్చంగా మా సంసారంలానే వుంది. ఆ అమ్మాయి ఉద్యోగమే ఆధారం. మరి రేపటినుండి వీళ్ళ పరిస్థితి ఏమిటి? ఈమె కూడా సమాజంమీద కసి పెంచుకొని అక్కలా తయారు కాదుగదా! వీల్లేదు. సీత అలా కావటానికి వీల్లేదు. అందుకే ఆ కుటుంబానికి ఓ ఆధారం కల్పించాలనుకున్నాను.

అన్నట్టు చెప్పటం మరిచిపోయాను. నా కంఠం మధు

రంగా వుంటుంది. నేను గిటార్ నేర్చుకున్నాను. తీరిక సమయాల్లో అనేక ప్రయోగాలు కూడా చేశాను.

ఇప్పుడు అదే ఉపయోగపడింది. ఆ రోజే ఓ ఆధునిక హోటల్‌కు వెళ్ళాను. అక్కడ నృత్యగానాలు సాగుతుంటాయి. సంప్రదాయ నృత్యంనుండి ఆధునిక నృత్యాలు ఆఖరకు నేకెడ్ దృశ్యాలతోసహా ఆస్వాదించవచ్చు. నేను వెళ్ళి సంప్రదించాను. నా అదృష్టం ప్రధాన గాయకుడు అకస్మాత్తుగా ఇంకోచోటుకి వెళ్ళిపోయాడు. వాళ్ళు టెంపరరీగానే నన్ను నియమించుకున్నారు. ఆ రోజు నేను పాడుతుంటే జనం అంతా ఊగిపోయారు. రూపాయల వాన కురిసింది. లెక్కపెట్టాక నా వంతు రెండువందలొచ్చాయ్.

ఆ డబ్బు తీసుకెళ్ళి ఆమె చేతిలో పెట్టాను. సీత ఆశ్చర్యంగా చూసింది.

"మీరు మరోలా భావించకండి. మీ ఉద్యోగం పోవటానికి కారణం నేను.

"భలేవారే. మీరు నన్ను రక్షించారు."

"రక్షించవచ్చు. అయినా మీ ఆధారం పోయింది. ఈ డబ్బు అప్పుగానే తీసుకోండి" అన్నాను.

ఆ అమ్మాయి ఆశ్చర్యంతోనూ కృతజ్ఞతతోనూ చూసింది. వింతలు జరగటం ఇదే కాబోలు. నాకు కూడా చాలా వింతగా ఉంది. అసలు నాదే విచిత్రమైన జీవితం! విచిత్రమైన మలుపులు!

ఆ ఇంటికి కావలసినవన్నీ తెస్తున్నాను. ఇప్పుడు నాకంటూ ఓ పని ఉంది. అప్పుడప్పుడు అక్క గురించి ఆలోచనలు వస్తుండేవి. ఆ రోజు మామూలుగానే ఆ ఇంటికి వెళ్ళాను.

రక్తపు మడుగులో సీత!

విలపిస్తూ కుటుంబం!

నేను చదివిన పుస్తకాలలో హత్య జరుగుతుంది. ఎవరు చంపారో తెలియదు. డిటెక్టివ్ వచ్చి ఎక్కడో ఉన్న ఆ లింక్ కనుక్కుంటాడు. అయితే ఇక్కడ అంతా ప్రత్యక్షంగా ఉంది. గొప్ప లాజిక్ అవసరంలేదు. సీతను వాడే హత్యచేశాడు. ఆ సంగతి స్పష్టం. మరో విషయం కూడా స్పష్టమే. వాడ్ని ఈ చట్టాలు ఏం చెయ్యలేవు!

నాలో ఆవేశం ఉడుకెత్తింది. సీత శవం నన్ను వెక్కిరిస్తోంది. ఆ రోజు బీచ్‌కి వెళ్ళకపోయినా బాగుం డేది. ఆమెను రక్షించటం ఎంత దారుణానికి గురిచేసింది. అంతగా అయితే ఆమె శీలం పోయేదేమో? అనుకు న్నాను. వెంటనే నాలో మరో మనిషి యెదురు తిరిగాడు.

"అలా ఆలోచిస్తావేంటి. శీలంపోతే ఆ అమ్మాయి బ్రతికుండేదా. అప్పుడూ చచ్చిపోయేదేమో? దీనికంతటికి కారణం వాడే.

నా పిడికిళ్ళు బిగుసుకున్నాయ్. కళ్ళలో యెర్రటి జీరలుండి ఉంటాయ్. నా కళ్ళు మండి శరీరంలోనుండి వేడిసెగలు వెలువడుతున్నట్లనిపించింది. నాకు అకస్మా త్తుగా పావురావు గుర్తువచ్చాడు. నా వంటిమీద పడ్డ దెబ్బలు గుర్తువచ్చాయ్. వాళ్ళు గుండెలవిసేలా ఏడుస్తు న్నారు. నాకు ఏడుపు రావటంలేదు.

నా కళ్ళు గిర్రున వెనక్కు తిరిగాయ్.

## 6

పట్టపగలు పన్నెండు గంట లవుతోంది. ఆఫీసులో వాడు వాడి బంట్రోతు మాత్రం ఉన్నారు.

అదేం పెద్ద కంపెనీ ఏం కాదు. వాడి వ్యాపారం కూడా ఏదో చీకటి వ్యాపారం అయి వుండవచ్చు. వాడి మీసాలు అసహ్యంగా వున్నాయి. వాడు ఆ సమయంలో కూర్చుని త్రాగుతున్నాడు. విసురుగా గదిలోనికి ప్రవేశించాను. నన్ను గుర్తుపట్టాడు. వాడి కళ్ళు కంగారుగా అటూ, ఇటూ చూశాయ్. వాడు నా దెబ్బ మరిచిపోయి ఉండడు. అంతలోనే తనముందు బాటిలందుకొని విసిరేశాడు.

దాన్ని అందుకొని నా యెడం చేతిమీద కొట్టుకున్నాను. అది భళ్ళున పగిలింది.

“హుస్సేన్” భయంకరంగా అరిచాడు.

వాడు పరుగెత్తుకొచ్చాడు.

“వాడ్ని చంపేయ్” అరిచాడు.

వాడు నన్ను వెనక్కు నెట్టాడు. వాడు ఊహించి వుండడు. వేగంగా వాడి కడుపులో ఓ పంచ్. ‘అమ్మో’ అని అరిచి క్రింద పడిపోయాడు. వాడి ప్రేగులు ఉండలు చుట్టుకొని వుంటాయి.

నేను ముందుకు నడిచాను. అడ్డం వచ్చిన కుర్చీని నేలకేసి బాదాను. అది ముక్కలు ముక్కలుగా విడిపోయింది. వాడు భయంగా లేచాడు. చెయ్యి ఓ ప్రక్కకు వాలి ఉంది. వాడి మొకం అమాంతం దిగిపోయింది.

మరుక్షణం వాడు పెడబొబ్బ పెడుతూ గాల్లోకిలేచి హాల్లో పడ్డాడు. వాడ్ని లేపాను.

“ఒరేయ్ పేదవాళ్ళంటే అంత అలుసా? నీ క్రింద ఉద్యోగం చేస్తే నీకు శీలాన్ని బలిపెట్టాలా? నీకు లొంగకపోతే ప్రాణాలు తీస్తావా? ఎంతమందిని చంపుతావ్? నీ ప్రాణానికి దిక్కెవరు?

తిరిగి కవ్వన అరుస్తూ అంతదూరంలో పడ్డాడు. ఆ క్షణం నాలో క్రోధం తప్ప ఇంకేంలేదు. వాడి అరుపులకు అప్పటికే జనం పోగయ్యారు. ఎవరూ ముందుకు రావటం లేదు. నా రూపం అంత భయంకరంగా ఉంది. వాడి మొహంమీద కొట్టానేమో వాడి పళ్ళన్నీ కదిలివుంటాయి. నోటినుండి రక్తం కారుతోంది.

వాడ్ని లేపాను. నా కళ్ళముందు సీత శవం.

నా చేతులు వేగంగా, కసిగా.

వాడి పొట్టమీద, భుజంమీద.

ఎక్కడ వీలయితే అక్కడ. వాడు క్రింద దొర్లుతున్నాడు. రక్తం వరదలుగా కారుతుంది. నా ఆవేశం ఇంకా పెరిగింది. బలాన్నంతా పిడికిల్లోకి తెచ్చుకొని గుండెలమీద గుద్దాను. భళక్‌మంటూ రక్తం కక్కుకొని క్రింద పడిపోయాడు.

ఇంతలో నలుగురు నామీదపడి బంధించేశారు.

పోలీసులు!

ఎవరో ఫోన్ చేశారనుకుంటా. ఎవరో పరుగెత్తికెళ్ళి వాడి ముక్కుమీద వేలుపెట్టి చూస్తున్నాడు. అంతలోనే రిక్షా రావటం వాడ్ని అందులో చేర్చటం జరిగాయ్.

అదే క్షణం నన్ను జీవ్‌లో ఎక్కిస్తున్నారు.

## 7

ఉదయంకల్లా రాష్ట్ర వ్యాపితంగా, పత్రికలలో నా ఫోటో వచ్చేసింది. ఆ తర్వాత దేశ వ్యాప్తంగా.

పట్టపగలు వార్త. తలుచుకుంటే నాకే అంతులేని ఆశ్చర్యంగా ఉంది. ఇదంతా కలలా, మాయలా ఉంది.

ఎందరో పత్రికల వాళ్ళు నన్ను ఇంటర్వ్యూ చేయ

టానికి వచ్చారు. వారికి నా అభివాదాలు ఆశ్చర్యం కల్గించాయ్. రాజకీయ నాయకుల్ని ఏడిపించటానికి, అవసరాన్నిబట్టి అమ్ముడుబోయే అమాంబాపతు సరుకు నా ప్రశ్నలకు జవాబివ్వలేకపోయింది.

నాపై కేసు ఫైల్ చేశారు. ఉరిశిక్ష ఖాయం అంటున్నారు. అంత బలమైన ఆధారా లున్నాయి. నాకు జీవితంమీద ఆశలేదు. నేను పోతాననే భయంలేదు. నా ఆలోచనలు ఈ సమాజం గురించే. నాకు బెయిల్ రద్దు చేశారు.

సరిగ్గా నాలుగు రోజుల తర్వాత నాకోసం ఎవరో వచ్చారని తెలిసింది.

"లక్ష్మి అక్క, బావ."

నన్ను చూసి అక్క దారుణంగా ఏడ్చేసింది. "ఎందుకిలా జరుగుతుందిరా" అంది. అక్క వెళ్ళిపోయాక చూడటం ఇదే. నా మొహంలో విచారం లేకపోవటం వారికి ఆశ్చర్యపరిచి వుండవచ్చు.

"నువ్వు దిగులు పడకు" అంది యేమనాలో తెలీక.

బావ చూస్తూ నిలబడ్డాడు. అంతలో టైం అయిపోయింది. అక్క ఏడుస్తూనే వెనక్కు తిరిగింది. నా బాల్యం అభిరుచులు ఒక్క క్షణం ఊపిరిపోసుకున్నాయ్.

మరుసటి రోజు పెద్దక్క కారులో వచ్చింది. ఆమె ఎవరితో మాట్లాడిందో, ఎలా రికమండేషన్ సంపాదించిందో గంటవరకు నాతో ఉండిపోయింది.

"ఇదేనా స్వతంత్ర జీవితం" మొదటి ప్రశ్న.

నేను మాట్లాడలేదు.

"నేను గతంలో చెప్పాను. ఆవేశం వలన ప్రయోజనంలేదని. నువ్వెందుకింతగా త్వరపడ్డావో నాకు తెలీదు.

ఓ వేళ నిజంగా అంత ద్వేషమున్నా వేరే పద్ధతులున్నాయి. మనిషిని చంపటంతో సమస్య పరిష్కరించబడుతుందా?"

నేను అక్క కళ్ళలోకి చూశాను.

సీత కనబడింది.

సీత పరిస్థితుల్లో ఉంటే అక్క యేం చేసేదో!

"ఇంతకూ ఏం జరిగిందో చెప్పు" అంది.

నేను జరిగిందంతా చెప్పాను. "నేను ఉరికంబం ఎక్కినా బాధలేదు. నాకు రక్తపు మరకలు అంటవచ్చు. కానీ స్వచ్ఛతను కాపాడానని నాకు గర్వంగా ఉంది" అన్నాను. అక్క ఓ నిమిషం మాట్లాడలేదు.

నా అభిప్రాయాల్లో ఆమెకు అభ్యంతరం ఉండేవి చాలా వుండొచ్చు. అసలు అక్క ఇంతగా ఎదగటమే జీవితంకంటే ఆశ్చర్యం కలిగించే విషయం. అక్క నాతో విభేదాలున్నా వ్యక్తిగా, తమ్ముడిగా గౌరవిస్తుంది.

"నువ్వేం బాధపడకు. జరిగిందేదో జరిగిపోయింది. నిన్ను ఉరికంబానికి అవులి కానివ్వను" అంది వెళ్తూ.

నాకు లాయర్‌ను ఏర్పాటు చేసింది. కోర్టులో వాదోపవాదాలు సుదీర్ఘంగా నడిచాయ్. నన్నో ఆటవిక మృగంగా చిత్రీకరించారు. పత్రికలన్నీ ఈ కేసు వివరాల్ని ప్రచారం చేశాయ్. నేను మాత్రం ఒకటేమాట మీదున్నాను.

"నే నీ హత్య చేశాను. అందుకు కారణం వాడు హంతకుడు కావటం. స్త్రీ జాతిని అవమానించటం."

తీర్పు వెలువడింది.

"మరణశిక్ష."

నేను ఆశ్చర్యపోలేదు.

అక్క ఓ క్షణం దిగ్భ్రాంతి చెందింది. అయితే ఓటమిని అంగీకరించలేదు."

"సుప్రీంకోర్టుకెళదాం. నువ్వు బాధపడకు" ఆమె ఎంతో నిశ్చలంగా అంది. కళ్ళు ఏ భావాల్ని వెలువరించటం లేదు. ఆమెలో గూడుకట్టుకున్న కార్యమే నన్ను చకితుడ్ని చేసింది.

తిరిగి ఆమె రంగంలోకి దిగింది. ఈసారి ఒక్క రంగంలోనే కాదు. ఆ కేసును తిరగతోడిగించింది. సీత హత్య తాలూకు వివరాల్ని నిజాల్ని కూపీ తీయించింది. వారే హంతకుడని నిరూపించే సకల సాక్ష్యాలు లభించాయ్.

దాంతోపాటు మహిళా ఉద్యమం ఒకటి ఉవ్వెత్తున లేచింది. మానభంగాలకూ, కట్నం చావులకూ, హత్యలకూ వ్యతిరేకంగా స్త్రీ లోకమంతా కదిలింది. ఆ వెల్లువ మొత్తం దేశ రాజకీయ రంగంమీద గొప్ప ప్రభావాన్ని చూపించే స్థితికి చేరుకుంది. ఏవో కొన్ని పరిమితుల్లో చట్టాలు తేక తప్పలేదు.

మరో విశేషం మేధావి వర్గం మొత్తం ఉరిశిక్ష రద్దుకోసం గొంతెత్తారు. ఉరిశిక్షలుండటంవలన నేరాలు తగ్గుముఖం పట్టలేదని వారు లెక్కలు చూపారు. దేశంలో ఈ వెల్లువతో అత్యున్నత న్యాయస్థానమే కదిలిపోయింది. తుది నిర్ణయం తీసుకేనేదాకా తాత్కాలికంగా ఉరిశిక్షల్ని రద్దుచేశారు.

ఇందులో అక్క పాత్ర ఎంత ఉందో నాకు తెలియదు. చాలా స్వల్పం అయివుండవచ్చు. లేకుంటే అసలు లేకుండునూ ఉండవచ్చు. ఈ సంఘటనలన్నీ యాదృచ్ఛికంగానే జరిగి వుండవచ్చు. లేకుంటే దేశంలో

మిగతా నేరాలు కూడా అందుకు దోహదం చేసి ఉండ వచ్చు. ఏది ఏమైనా ఓ అద్భుత వాతావరణం సామాజిక జీవితంలోకి ప్రవేశించింది.

అక్క వివరాలన్నీ కోర్టుముందుంచింది. ఈ హత్య వెనుకవున్న బలమైన కారణాల్ని సానుభూతితో పరిశీలిం చాలని ఆమె కోరింది. స్త్రీని విలాస వస్తువుగా భావించే సంస్కృతిని ఆమె తీవ్రంగా దుయ్యబట్టింది. ఓ స్త్రీని, అందులో ఓ పేద యువతిని శీలంకోసం దౌర్జన్యం చేయటం కాకుండా అమానుషంగా హత్య చేయటాన్ని గర్విస్తూ అందుకు ప్రతిగా హత్యచేయటం సమంజసం కాకపోయినా అందువలన సమస్య పరిష్కరించబడక పోయినా ప్రస్తుతం కోర్టు చేస్తుందేమిటి? అని ప్రశ్నిం చింది. మానవుడు అనాగరికంగా ప్రవర్తిస్తే అందుకు కోర్టులు కూడా అదేవిధంగా ప్రవర్తించాలా అంటూ అసలు 'ఉరిశిక్ష' రాజ్యాంగబద్ధతనే కోర్టులో సవాల్ చేసింది.

ఆమె పేరు దేశమంతా మారుమ్రోగిపోయింది. ఆ సమయంలోనే కొన్ని పత్రికలు ఆమె గత జీవితం గురించి పరిశోధించి ప్రత్యేక వ్యాసాలు ప్రముఖంగా ప్రచురించటం మొదలు పెట్టాయి. దానికి అక్క ఇచ్చిన సమాధానం చారిత్రాత్మకంగా నిలిచిపోతుంది.

"నేను చెడిపోయానని రాస్తున్న ఈ వెధవల్లో చెడి పోనివాడు ఒక్కడున్నా నేను సంతోషిస్తా. మీరు మీ భావాల్ని తాకట్టు పెట్టుకుంటున్నారు. మీకూ నాకూ ఏం తేడా వుందని మీ భావం! ఈ దేశంలో కోట్లాది అన్యాయాలు జరిగిపోతున్నాయ్. వాటిని ప్రశ్నించే దమ్ములేదు మీకు. ఇక్కడి సమస్య నా వ్యక్తిగతంకాదు.

నేను చెడిపోయానా మరోటి అయ్యానా అని కాదు—నేను ఉరిశిక్ష రద్దు కావాలంటున్నాను. స్త్రీ బానిసత్వం పోవాలంటున్నాను. మీకేమైనా సిగ్గు, అభిమానంవుంటే మీ పెళ్ళాలమీద, మీ అమ్మల, మీ సోదరీమణులపట్ల గౌరవం ఉంటే ఈ సమస్యల్ని చర్చించండి" అందామె మేఘ గంభీర స్వరంతో.

ఆమె ప్రకటనను బాక్సులుకట్టి ప్రకటించారు. విదేశీ పత్రికలు సైతం ఈ వార్తను ప్రకటించాయ్. నాకు ఆనందం.... గర్వం.... చెప్పలేని తన్మయత్వం.

ఎక్కడి అక్క ఎంతగా ఎదిగిపోయింది.

ఆమెను ప్రశంసించేవారు. విమర్శించేవారు. ఆమె అభిప్రాయాల్లో కొన్నింటిని ఏకీభవించేవారు. వివిధ వర్గాలుగా యేర్పడ్డారు.

సుప్రీంకోర్టు తీర్పు వచ్చేరోజు....!

వేలాదిమంది జనం ఉత్కంఠతో ఎదురుచూస్తున్నారు. అక్క బదులవనున్న లావాలా ఉంది. ఇంకా న్యాయాధిపతి రాలేదు. ఆ సింహాసనం గంభీరంగా వుంది. కదిలిస్తే వేల కథలు చెప్పేదానిలా. ధర్మదేవత స్వచ్ఛమైన పాలరాతితో మలచబడి ఉంది. తెల్లగా.

ఈ ధర్మం తెలుపా? నలుపా? ఎరుపా?

కోర్టు గది గోడలు తెలుపుగా వున్నాయ్. గోడ గడియారం గంటలు కొడుతోంది. దాని డయల్ తెల్లగా ఉంది. అక్కడి గుమస్తాలు తెల్లటిదేదో భుజానికి తగిలించుకున్నారు. అక్కడ లాయర్లు, పోలీసులు అంతా తెల్ల మొహాలతో ఉన్నారు. అంతా తెలుపు.... తెలుపు.... తెలుపే!

అక్క ఒక్కటే ఎర్రని వదనంతో మెరుస్తోంది.

ఆమెను చూస్తుంటే ఉదయించే సూర్యుడు, సాయం సంధ్య ఏక కాలంలో గుర్తుకొస్తున్నారు.

న్యాయాధిపతి వచ్చేశారు.

ఒక్కసారి నా వంక చూశారు. తీర్పు చదవటం మొదలయింది.

"నా ఉరిశిక్ష రద్దు చేశారు. దాన్ని యావజ్జీవంగా మార్చారు.

అక్క కళ్ళలో ఓ క్షణం బాధ....ఆ తర్వాత గర్వం ....తృప్తి ఇంకేవో భావాలు. ఆయన ఇంకేమో చదువుతున్నారు. అవేం నాకు వినిపించటంలేదు.

"అక్క ఆడదయివుండి ఇవన్నీ సాధించింది. అక్క ఇప్పుడు మహోన్నతమైన శిఖరంలా కనపడింది.

నేను తిరిగి కటకటాల వెనక్కు వెళ్ళాను.

"తమ్ముడూ నాకు సాధ్యపడిందింతే. నిన్ను బ్రతికించుకోగలాను" అంది.

## 8

జీవితకాలంలో ఎన్నెన్ని మలుపులు!

జైల్లో నాకు పుస్తకాలిచ్చేవారు. అనేక పుస్తకాలు చదివాను. ఓ రోజు తల దువ్వుకుంటుంటే వచ్చింది తెల్ల వెంట్రుక! నా వార్ధక్యం సూచిస్తూ!

తెలుపు గురించి నా భావాలు ఎంతగా పరిణామం చెందుతూ వచ్చాయో! అదే ఆశ్చర్యం. మొత్తం రంగులకు చెందిన పుస్తకాలన్నీ చదివాను. జైల్లో ఉండగానే "మానవ జీవితంపై రంగుల ప్రభావం" అనే పుస్తకం రాశాను. అది అచ్చయి విపరీతమైన సంచలనం సృష్టించింది. అన్ని భాషల్లోకి అనువదించబడింది.

అక్క అప్పుడప్పుడు వచ్చి కలుస్తుందేది. వచ్చిన ప్రతి

సారీ ఆమెలో ఎంతో మార్పు....పరిపక్వత దిశగా ఆమె!

నేను చెప్పిన కథలో మీకు రెండో అక్క ప్రసక్తి ఎక్కువగా రాలేదు. ఆమె గురించి ఎక్కువగా చెప్పదగ్గ విశేషాలేం లేవు. అందుకే ఆమె నామీద ప్రభావం చూపించలేకపోయింది.

నేను విడుదలయ్యే రోజు....

అన్ని సంవత్సరాలు నాతో సహజీవనం చేసినవారు సంతోషంగా, విచారంగా, దుఃఖంగా వీడ్కోలిచ్చారు.

వాళ్ళు నన్నో తాత్వికుడుగా గౌరవించారు.

ప్రపంచంలోకి అడుగు పెట్టాను.

ఎదురుగా అక్క....!

ఆమె ఎర్రటి చీర కట్టుకొని వుంది. ఆమె వదనంలో వయసు ముదిరిన ఛాయలుగాక ఓ ఆశయానికి కట్టుబడిన పట్టుదల ఉంది.

ఆమెతో వెళ్ళాను.

ఆ ఇంటిలో ఆమెతోపాటు చాలామంది ఉన్నారు. అదో సంస్థ.

ఆ రాత్రి అక్కతో మాట్లాడాను.

"చూడు తమ్ముడూ. నీకిదివరకే చెప్పాను. నాకెవరి మీదో కసి ఏదో సాధించాలని వాటికి కారణాలు అప్పుడు తెలియలేదు. ముఖ్యంగా నీ జీవితంలో జరిగిన రెండు సంఘటనలు నాలో మార్పు తెచ్చాయ్.

నేనెందరినో మేథావుల్ని కలిశాను.జీవితాల్ని త్యాగం చేసిన మహోన్నతుల్ని కలిశాను. వారు నాకు పాఠాలు నేర్పారు. ఈ సమాజం ఎందుకలా ఉందో ఇప్పుడు నాకు స్పష్టంగా తెలుసు. అందుకు ఏం చేయాలో....ఈ కష్టాలు కన్నీళ్ళు పోవటానికి ఈ జనాన్ని ఎలా కదిలిం

చాలా అనేది ఆలోచన....ఆచరణనూ. ఇప్పుడు వ్యక్తుల మీద నాకు ద్వేషంలేదు. నేను స్ఫూర్తిని పొందిన పెద్దలు నన్ను భుజంతట్టి ఆశీర్వదించారు. చెడిపోవటం లేని రాజ్యంకోసమే నా ప్రయాణం" అంది అక్క.

ఈరోజు ఆమెలో సంపూర్ణ స్త్రీత్వాన్ని చూడగల్గాను.

"నాతోపాటు అక్క తెలుపును ప్రేమించింది. ఆరాధించింది. కానీ ఈ సమాజం వాటిమీద దెబ్బకొట్టింది. అనుభవాలు దృక్పథాల్లో మార్పును తెచ్చాయ్. ఈ తెలుపు ఇక్కడ స్వచ్ఛంగా లేదు. మలినంగా వుంది. తెల్లటి తెలుపు స్వచ్ఛమైన సమాజం ఇంకా అందనంత దూరంలోనే వున్నాయ్. బాబాల ఆశ్రమాలకెళ్ళి విప్లవానికి దూరం అవ్వాలనిపించిందని ప్రకటించే అమాంబాపతు విప్లవ కారులకంటే అక్కేం చెడిపోలేదు."

ఇంతకూ ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే—

తెల్లదనాన్ని
చల్లదనాన్ని మాత్రమే కోరుకుంటూ జీవితంలోవున్న
కష్టాల్ని, కన్నీళ్ళని
క్రైమ్‌నీ
చూడటానికి దడిసే
అమాయకుల్ని
గడుసువారినీ
జెంటిల్ మెన్‌నీ—

"బాబూ, ఈ తెలుపు శాశ్వతం కాదు. మీ అభిరుచులు స్వచ్ఛంగా ఉండటమే చాలదు. ఈ సమాజంలో మీ అభిరుచులు మారితీరుతాయి. మీరు· ఈ మహాప్రస్థానంలోకి రాక తప్పదని హెచ్చరించటానికే!

—:సమాప్తం:—

# చంపకమాల

## టెంపోరావ్

ప్రఖ్యాత సినీతార చంపకమాల రాత్రి ఒంటి గంటకు యింటికి తిరిగి వెళుతోంది, తన మెర్సిడిస్ కారులో. స్పీడు తగ్గింది. కాస్సేపట్లో కుదుపుతూ కారు ఆగిపోయింది. డ్రయివర్ నాయుడు ఆమెవైపు భయంతో చూశాడు.

"టాంకులో పెట్రోలు లేదమ్మా" అన్నా డతను.

"సాయంత్రం ఫిల్ చేయించాం!" అర్చిందామె.

"అదే నాకు ఆశ్చర్యంగా వుందమ్మా" అని డ్రయివర్ కిందకు దిగాడు.

రోడ్డు యిరువైపులా ఆమె చూసింది. ఎక్కడగా జనసంచారం లేదు. పట్టపగలు ఇలా జరిగివుంటే ప్రజలు ఆమె కారును చుట్టేసేవారు. ఆమె ముప్పుతిప్పలూ పడేది.

"బంకు ఎంత దూరంలో వుంది?"

"చాలా దూరం వెళ్ళాలమ్మా" అన్నాడు డ్రయివరు.

"వెళ్ళి కొని కాన్‌లో పట్రా."

"మిమ్మల్ని ఒంటరిగా వదిలివెళ్ళడం మంచిది కాదమ్మా" అన్నాడు నాయుడు వినయంగా.

పదేళ్ళనుంచి నాయుడు ఆమె దగ్గర డ్రయివర్ గా పనిచేస్తున్నాడు. విశాలమైన కాంపౌండులో చిన్న యిల్లొకటి కట్టించి ఆమె నాయుడి కిచ్చింది. తన భార్యా పిల్లలతో నాయుడు ఆ ఇంట్లో సుఖంగా జీవితాన్ని సాగిస్తున్నాడు. మరోచోట డ్రయివర్ గా వుంటే తన కిప్పుడొచ్చే డబ్బురాదు. సౌకర్యాలు వుండవు.

కార్లో కూర్చుని చంపకమాల ఆలోచిస్తోంది. అంత పెట్రోలు పోస్తే ఏమైంది? వాడే యేదో చేసివుండాలి! వాడే, తన భర్త! తను యింట్లోంచి గెంటేసిన భర్త శివరావు!

ఏదో కారు వస్తోంది. డ్రయివర్ నాయుడు ఆ కారును ఆపాడు. కార్లోని వాళ్ళతో ఏదో మాట్లాడి అతడు మెర్సిడిస్ వైపు పరిగెత్తుకొచ్చాడు.

"అమ్మా, ఆ కారులో ప్రొడ్యూసర్ బంగార్రాజు గారున్నారు. మిమ్మల్ని మీ యింటి దగ్గర దింపుతా నన్నారు" అన్నాడు డ్రయివర్.

"చంపకమాలా, రాఅమ్మా" పిల్చాడు బంగార్రాజు.

ఆమె డ్రయివర్ కి డబ్బిచ్చింది.

"పెట్రోలు పోయించి తీసుకురా" అని చెప్పి ఆమె బంగార్రాజు అంబాసిడర్ కార్లో ఎక్కింది.

డ్రయివర్ కారును పోనిచ్చాడు. బంగార్రాజునుంచి విస్కీ వాసన గుప్పున కొడ్తోంది. అతడు రోజూ ఒక ఫుల్ బాటిల్ సేవిస్తూ వుంటాడు. ఇంతకుముందు అతడి చిత్రంలో ఆమె నటించింది. కాని పెద్ద స్టార్ అయ్యాక ఆమెను అతడు బుక్ చేయలేదు.

కారు స్పీడుగా వెళుతోంది. బంగార్రాజు ఆమెవైపు ఓరగా చూశాడు.

"వెంటనే యింటికెళ్ళాలా?"

"వెళ్ళి నిద్రపోవాలి" అందామె.

"నా దగ్గర ఒక మంచి కథ వుంది. హీరోయిన్ చిత్రం. నీ దగ్గరకు తద్దామనుకుంటున్నాను" అన్నాడు బంగార్రాజు.

"తెలుగు చిత్రాలకు ముఖ్యం హీరోలు, హీరోయిన్లు కాదుగా!"

"హీరోయిన్ చిత్రాలు కూడా జయిస్తాయి, బలమైన కథ వుంటే."

"నా మార్కెట్ రేటు మీకు తెల్సే వుంటుంది."

"నాలాటి పాతవాళ్ళకు కొంత తగ్గించాలి. ఈ మధ్య నేను నిర్మించిన రెండూ ఫ్లాంఫ్స్. నన్ను మళ్ళా నువ్వు నిలబెట్టాలి."

"ఇంటికి రండి, చూద్దాం."

"వింటానంటే కథ ఇప్పుడే చెప్తాను."

ఆమె విసుగ్గా అతడివైపు చూసింది.

"ఇప్పుడు వినే సితిలో లేను. ముందుగా ఫోన్ చేసి రండి" అందామె.

జేబులో వున్న బాటిల్లోంచి అతడు కొంచెం విస్కీని తాగేసి ఆమెకంక తిరిగాడు.

"నువ్వు బాగా పైకెళ్ళిపోయావు. చాలా సంతోషం."

"థాంక్స్, నన్ను కాస్సేపు విశ్రాంతిగా వుండనీయండి" అందామె.

"అలాగేనమ్మా" అన్నాడు బంగార్రాజు.

# 2

భోజనం చేసి చంపకమాల తన గదికి చేరుకుంది. పరుపుమీద అలసటగా వాలింది. మూడు రోజులనుంచి ఆమెకు మంచి నిద్రలేదు. సుఖంగా పడుకోవాలి! పొద్దుట పద్దాకా లేవకూడదు.

పక్కనే గాఢ నిద్రలో వున్న కొడుకువైపు ఆమె ఆప్యాయంగా చూసింది. అతడిమీద చేయివేసి పడుకుంది.

టెలిఫోన్ మ్రోగింది! అది తన అన్‌లిస్టెడ్ నంబరు ఫోన్! ఆ నంబరు కొంతమందికి మాత్రం తెలుసు. ఆ దుర్మార్గుడికి కూడా తెలుసు!

"హలో!" అందామె.

"సుబ్బాయమ్మా, ఎలా వున్నావు?"

"నువ్వా?"

"నేనే, అగ్ని సాక్షిగా నిన్ను పెళ్లాడిన భర్తను!"

"నీకేం కావాలి?"

అతడు అటువైపున గంభీరంగా నవ్వాడు.

"నాకేం కావాలి! మధ్యలో నీ కారు ఆగిపోయిందా?"

"ఆగిపోతే హడిలిపోను. మరో కారులో యింటికి చేరుకున్నాను. నన్నిలా పీడిస్తే నీకేమిటి వస్తుంది?"

"సుబ్బాయమ్మా, నువ్వు యేడిస్తే నేను ఆనందిస్తాను. నువ్వు కష్టపడ్డం నాకెంతో యిష్టం. నిన్నిలా యమదూతలా పీడిస్తూనే వుంటాను."

"త్వరలో నీకు బుద్ధి చెప్తాను. నేను పోలీసు రిపోర్టు చేస్తే జైల్లో వుంటావు."

"రిపోర్టివచ్చుగా!"

"బరి తెగించిన మనిషివి! నేను పడుకోవాలి."

"త్వరలో నిన్ను నా కాళ్ళ దగ్గరకు రప్పిస్తాను!"

"ఏం చేస్తావేమిటి?"

"అదంతా ముందుగా చెప్పను. జరిగాక నువ్వే చూస్తావు."

"షటప్, యూ రోగ్" అని ఆమె రిసీవర్ పెట్టేసింది.

పడుకోడానికి ఉపక్రమించింది. కాని నిద్ర పట్టలేదు. గతం ఆమెకు గుర్తొస్తోంది.

శివరావు ఆమెను పెళ్ళాడినపుడు తన వయస్సు 16 ఏళ్ళు. అతడితో సంవత్సరంపాటు కాపురం చేసింది. అప్పట్లో అతడు 200 రూపాయలు గడించేవాడు. బట్టల షాపులో పనిచేసేవాడు. పట్నంలో మారుమూల నున్న చిన్న ఫ్లాట్ లో వాళ్ళు జీవించేవారు.

సంవత్సరం గడిచాక ఆమె జీవితం మారిపోయింది. బస్సు స్టేండులో నిలబడిన ఆమెను కారులో వెళ్తూన్న ఫిలిం డైరెక్టర్ ధనరాజ్ చూశాడు. వెంటనే కారాపి ఆమెవైపు కొంతసేపు చూస్తూ వుండిపోయాడు.

అటుపైన అంతా చకచక సాగిపోయింది. డ్రయివర్ ఆమెతో మాట్లాడాడు. ఆమెను కారు దగ్గరకు తీసుకెళ్లాడు. ధనరాజ్ ను చూసి ఆమె నమస్కరించింది. అతడి చిత్రాలెన్నో చూసింది. యెన్నో సూపర్ హిట్ చిత్రాలను ధనరాజ్ తెలుగు తమిళ భాషల్లో నిర్మించాడు. అతడు డైరెక్టు చేసిన హిందీ చిత్రాలు కూడా అఖండ విజయాన్ని సాధించాయి.

ధనరాజ్ ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"నీతో మాట్లాడాలి, యిలా కూర్చో!" అన్నాడతను.

ధనరాజ్‌లో ఏదో కమాండ్ వుంది. ఆమె కారులో అతడి పక్కనే కూర్చుంది. ధనరాజ్ డ్రయివర్ వంక చూశాడు. తలుపు మూసి, డ్రయివర్ తన సీటులో కూర్చుని కారును పోనిచ్చాడు.

"నీ పేరు?"

"సుబ్బాయమ్మ."

"చిత్రాల్లో నటిస్తావా? నువ్వు చాలా పైకి వెళ్తావు" అన్నాడతను.

"నాకు నటించడం తెలియదు" అందామె.

"గుడ్! ఫొటోజనిక్ ఫేస్ వుంటే చాలు. తలిమ్మా వన్నీ నేర్పగలను."

మరికొన్ని విషయాలు మాట్లాడి ఆమెను ఇంటిముందు ధనరాజ్ దింపాడు. పక్క వాటాలో వున్నామెతో ఆమె గర్వంగా కారువైపు చూపిస్తూ చెప్పింది! "ఆ కారులో వున్నాయన యెవరో తెలుసా? ప్రఖ్యాత సినిమా నిర్మాత, డైరెక్టర్ ధనరాజ్‌గారు!"

పక్క వాటాలో వున్నామె ఉలిక్కిపడింది.

"ధనరాజ్‌గారా! నిజంగా!" అర్చిందామె.

ఆనాటి రాత్రి ఆమె చెప్పింది విని శివరావు ఆశ్చర్య పోయాడు.

"ఆయన ధనరాజ్ అయివుండరు. ఎవరో నీ అందం చూసి కారులో ఎక్కించుకుని తిప్పారు. లక్కీ, వెనక్కి రాగలావు. యిటుపైన అలా వెళ్ళకు అన్నాడు శివరావు.

గదిలో వున్న ఒక పాత పత్రికను తెచ్చి ధనరాజ్ చిత్రంవైపు ఆమె చూపించింది.

"ఆయనే నన్నిక్కడ దింపారు. ధనరాజ్ ఆయనే!" అందామె.

"మళ్ళా ఆయన ఎప్పు డొస్తారు?"

"రేపు కారు పంపుతానన్నారు. నీతో చెప్పి వాళ్ళ ఆఫీసుకు కారులో రమ్మన్నారు.

శివరావు ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"ఆయన చేతుల్లో పడితే నువ్వు గొప్ప సినిమా తార వవుతావు."

"అయితే కాల్చే వెళ్ళనా?"

"వెళ్ళు! కాని ఒక్క విషయం మర్చిపోవుగా!"

"ఏమిటది?"

"నువ్వు ఎంత గొప్ప స్టార్ అయినా, నేను నీ భర్తను" అన్నాడతను ఆవేశంతో.

"ఎవరు కాదన్నారు?" అందామె నవ్వుతూ.

"నువ్వు చాలా అందంగా వుంటావు. భవిష్యత్తు ఎలా వుంటుందో చెప్పలేం!"

"శివా, బెంగెట్టుకోకు! నేనెప్పుడూ నీ భార్యనే. నిన్ను ఈ జీవితంలో వదిలి నేను బతకలేను" అందామె.

అతడామెను కౌగలించుకుని, బలంగా ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

చంపకమాల తేరుకుని టైమ్ చూసింది. మూడు దాటింది. తనకీవేళ నిద్రపట్టదా?

ఆమె పక్కనున్న బాలువైపు చూసింది. అతడి పేరు రాజకుమార్. అతడు హాయిగా నిద్రపోతున్నాడు. నిమిషాలు గడుస్తున్నాయి. కాని నిద్రరావడంలేదు. గతంలో జరిగినదంతా గుర్తుకొస్తోంది.

ధనరాజ్ తీసిన చిత్రంతో ఆమె గొప్ప తారగా రూపొందింది. యాభై మంది నిర్మాతలు ఆమెను వాళ్ళ చిత్రాల్లో నటించడానికి బుక్ చేశారు. ఆమె మార్కెట్

రేటు లక్షల్లో వుంది.

శివరావు ఉద్యోగం మానేశాడు. సుబ్బాయమ్మ యిప్పుడు చంపకమాల! ప్రముఖ డైరెక్టర్ ధనరాజ్ సృష్టించిన కెరటాలు ఆమెను ఆకాశానికి ఎత్తేశాయి.

ధనరాజ్ రాత్రిళ్ళు ఆమెతో వుండేవాడు. అతడు పడుకొని వుంటే ఆమె అతడి కాళ్ళు నొక్కేది. ఇదంతా చూస్తూ శివరావు వుగ్రుడయ్యాడు.

ఒకరాత్రి ధనరాజ్ చుట్టూవుండే గూండాలు శివరావును తన్ని యింట్లోంచి బయటకు గెంటేశారు. చంపకమాల ఏమీ అనకుండా చూస్తూ వుండిపోయింది.

"నన్నిలా అవమానిస్తావా?" అర్చాడు శివరావు.

ఆమె అతడివంక చూసింది.

"ధనరాజ్ దేవుడులాంటివారు. ఆయన నా దైవం. ఆయన లేకుండా నేనింతదాన్ని కాలేను. ఇప్పుడేనా నోరు మూసుకుని యింట్లో పడుంటే నిన్నెవరూ పొమ్మనరు. హాయిగా ఇక్కడే వుండొచ్చు" అందామె.

నేలమీద పడివున్న శివరావు లేచాడు. ఆమెవైపు మరోసారి చూడకుండా కట్టుగుడ్డలతో బయటకు కదిలి పోయాడు. మళ్ళా ఆమెకెక్కడా కనబడలేదు.

రెండేళ్ళపాటు ధనరాజ్ ఆమెతో నాలుగు చిత్రాలు నిర్మించాడు. ఆమె సూపర్ స్టార్ అయింది. ధనరాజ్ ఆమె యింటికి రావడం మానేశాడు. ఎందుకు రావడం మానేశాడో ఆమెకు తెలుస్తూనే వుంది.

మాండలిక అనే యువతిని ఆయన పైకి తీసుకొస్తున్నాడు. పారిస్‌లో ఆయన తీసే చిత్రంలో మాండలిక హీరోయిన్!

ఆమె అంతిగా బాధపడలేదు. సినిమా పరిశ్రమలో కొంతకాలంపాటు వున్న వాళ్ళకు అక్కడి విలువలు అర్థమవుతూనే వుంటాయి.

అదే టైమ్‌లో కోటీశ్వరుడైన కోటిరెడ్డితో ఆమెకు పరిచయమైంది. కోటిరెడ్డి పేరు పొందిన యిండస్ట్రియలిస్టు. ఆమెకు పెద్ద ఇల్లు కట్టించి యిచ్చాడతను. ఆమెకు మెర్సిడిస్ కారు కొన్నాడు.

రాజ్‌కుమార్ కోటిరెడ్డి కొడుకని ఆమె తన దగ్గర వాళ్ళతో చెప్పేది.

గుండె పోటుతో కోటిరెడ్డి ఆమె యింట్లో మరణించాడు. బ్రతికున్నప్పుడు అతడు ఆమె యింట్లో కాలం గడిపేవాడు. కాని చనిపోయాక కోటిరెడ్డి శవాన్ని అతడి భార్య యింటికి పంపక తప్పలేదు.

అటుపైన ఆమెలో కొంత మార్పు వచ్చింది. ఆమె గొప్ప నటిగా రూపొందింది. ఆమె సర్వశక్తులనూ నటన మీద కేంద్రీకృతం చేసింది. అనేక అవార్డ్సు ఆమెకు లభించాయి. చంపకమాల పేరు యెటువైపు చూసినా విజయ ఘంటా మ్రోగిస్తోంది.

రాజకుమార్ తప్ప తనకెవ్వరూ లేరు. అతడంటే ఆమెకెంతో ప్రేమ. అతడి తండ్రెవరు—కోటిరెడ్డా? ఇతర్లతో ఆమె కోటిరెడ్డి తండ్రని చెప్పినా లోలోపల ఆమెకు నమ్మకం లేదు.

ఒకప్పుడు ఆమె వైజాగ్‌కు షూటింగ్‌కు వెళ్ళింది. షూటింగ్ జరిగే చోటకు టాక్సీలో వెళుతోంది. డ్రయివరు పొడుగ్గా, బలంగా వున్నాడు. కొండ ప్రదేశంలో ఒకచోట కారాపి అతడు బయటకు దిగి ఆమెవైపు చూశాడు.

"ఎందుకా పాపు, పోనీ!" అందామె.

"అగలేక!" అన్నా డతను.

అతడివంక ఆమె కోపంగా చూసింది. సమీపంలో యెవ్వరూ లేరు. అతడు తన్ని ఏం చేసినా కను ఎదిరించ లేదు.

"మీకేం కావాలి?"

"నీ సినిమా ప్రేమానుబంధం మూడుసార్లు చూశాను. అందులోని రేప్ సీన్‌లో నువ్వెంత బాగున్నావో! ఆ సీన్ చూసినప్పటినుంచీ నా మనసు నీమీదే వుంది" అని వెనక తలుపు తెర్చా డతను.

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది.

"షూటింగ్‌కి టైమ్ అవుతోంది. నేనుండే హోటల్ సమీపంలో రాత్రి నీ టాక్సీ ఆపుకొని వుండు. నేను రహస్యంగా వస్తాను. సరిగ్గా పన్నెండింటికి ఎక్కడికైనా పోదాం. నీ కోరిక ఫలిస్తుంది."

"నిన్ను నమ్మలేను. ఆ హీరోగాడిని వెంటేసుకొని వస్తావు. వాడు నన్ను తన్ని, తగిలేస్తాడు"అన్నా డతను.

అతడివైపు ఆమె తీక్షణంగా చూసింది.

"నేను యిచ్చిన మాటమీద నిలుస్తాను. యేదేనా చెప్తే చేస్తాను. నేను ఒంటరిగా వస్తాను. నాతో మరెవ్వరూ రారు" అందామె.

"నీ మాట నమ్మగలనా? షూటింగ్ స్థలానికి వెళ్ళాక నేను చేసింది బయట పెట్టవుగా!"

"ఇలారా" అందామె.

అతడు కారు కిటికీ దగ్గరగా వచ్చాడు. ఆమె అతడిని ముద్దెట్టుకుంది.

"ఇప్పుడు నమ్ముతావా?" అందామె.

"నమ్ముతున్నాను" అని అతడు టాక్సీని పోనిచ్చాడు.

రాత్రి పన్నెండయింది. పురుషుడిలా ఆమె వేషం మార్చుకుంది. తలమీద ఫెల్ట్ హేట్. ఆమె గదిలోంచి బయటకు నడిచింది.

హోటల్ గేటు దాటి వెళ్ళిపోయింది. రోడ్డు వారగా ఒక టాక్సీ ఆగివుంది. అటువైపు ఆమె వేగంగా వెళ్ళింది. ఆమెవైపు టాక్సీ డ్రయివర్ భయంతో చూశాడు.

"భయపడకు! మారువేషంలో వచ్చాను, యెవ్వరూ గుర్తించకుండా!" అందామె.

కారు ముందు సీటుమీద అతడి పక్కనే కూర్చుని తలుపు మూసింది. అతడు టాక్సీని పోనిచ్చాడు.

"ఎక్కడికి పోదాం?" అందామె.

"నాకో చక్కటి ప్రదేశం తెలుసు. ఈ వెన్నెల్లో అక్కడ బాగుంటుంది" అన్నాడతను.

వెన్నెల్లో, గడ్డి నేలమీద రెండు గంటలపాటు ఆమె అతడితో వుంది. ఆ సమయంలో ఆ టాక్సీ డ్రయివర్ ఆమె కళ్ళకు ఒక ప్రేమ మూర్తిగా అగుపించాడు.

"నీ పేరు?" అడిగిందామె.

"లింగమూర్తి" అన్నాడతను.

"నా జీవితంలో ఎంతమంది గొప్పవాళ్ళనో కలుసుకున్నాను. కాని నిన్ను యీ జీవితంలో నేనెప్పుడూ మరువను" అందామె.

లింగమూర్తి కొడుకు రాజకుమార్ అని ఆమెకు తెలుసు, కాని టాక్సీ డ్రయివర్ కొడుకనడం యిష్టంలేక కోటిరెడ్డి పుత్రుడని ఆమె కొందరికి చెప్పేది.

ఇదంతా జరిగాక ఆమెకు లింగమూర్తితో సంబంధం

లేకుండా పోలేదు. అతడు రెండు మూడుసార్లు మద్రాస్ వచ్చాడు—ఆమెతో రెండుమూడు రోజులు వుండి వెళ్ళి పోయాడు.

రెండేళ్ళు గడిచేలోపల లింగమూర్తి కారు ప్రమాదంలో మరణించాడు. దినపత్రికలో ప్రచురించిన ఆ వార్త చదివి ఆమె కన్నీళ్ళు కార్చింది.

చంపకమాల లేచి పక్కనున్న రాజకుమార్ వైపు చూసింది. కళ్ళు మూసుకుని, కొడుకు దగ్గరగా జరిగి పడుకుంది. కాస్సేపట్లో ఆమెకు నిద్ర పట్టేసింది.

## 3

మధ్యాహ్నం రెండు కావస్తోంది. చంపకమాల యింట్లో వున్న ఆరుగురు నౌఖర్లూ బాగా తిని నిద్ర పోతున్నారు. షూటింగ్‌కి వెళ్ళిన చంపకమాల రాత్రి పన్నెండు దాటాక తిరిగి వస్తుంది. అంతవరకూ నౌఖర్లే ఆ యింటికి ప్రభువులు!

ఇంటి ముందునుంచి శివరావు తన మోపెడ్‌ను పోనిచ్చాడు. గూర్ఖావాడు స్టూల్ మీద కూర్చుని ఏదో పత్రిక చూస్తున్నాడు. ఇంటి యెడంవైపున రాజా రోడ్డు వారగా అతడు మోపెడ్‌ను ఆపాడు.

అన్నీ పెద్ద యిళ్ళు. ధనవంతులు తిండితిని నిద్ర పోతారు. కాంపౌండు వాలు ఎక్కి అతడు అటువైపుకు దూకాడు. గోడవారగా నిలబడి నలువైపులా చూశాడు. యెక్కడా మనుషులు కనబడలేదు.

అతడు మేడ వైపు నడిచాడు. చెట్లూ, పూల మొక్కలూ ఎక్కువగా వున్నందువలన అతడు రహస్యంగా మేడ దగ్గరకు వెళ్ళగలిగాడు.

సమీపంలో వున్న వేపచెట్టు ఎక్కి వెనుక డాబా

మీదకు దూకాడు. వరండామీద నడిచి చంపకమాల గదిలోకి ప్రవేశించాడు.

చంపకమాల కొత్తగా నిర్మించుకున్న గృహమది. ఆమెకు తెలియకుండా రెండు మూడుసార్లు అతడు యిక్కడకు రాగలాడు.

గాడ్రెజ్ బీరువా తెర్చాడు. ఒక అరలో నోట్ల కట్టలు కుప్పలుగా వున్నాయి. వాటిని తీసి తన బాగ్ లో అతను పడేసుకున్నాడు. అరలో రెండువందల రూపాయల నోట్లు మాత్రం వుంచాడు. తలుపు మూసి తాళంవేశాడు.

వేగంగా బయటకు నడిచాడు. డాబామీదకు చేరుకుని పైకి చూశాడు. పిట్టగోడెక్కి వేపచెట్టు కొమ్మ మీదకు పాకాడు. అక్కడినుంచి కిందకు దిగి, ప్రహరీ గోడవైపు పరుగెత్తాడు.

ప్రహరీ గోడ యెక్కి రోడ్డువైపు చూశాడు. ఏదో కారు దూసుకుపోయింది. అతడు రోడ్డువైపు దూకి మోపెడ్ దగ్గరకు వెళ్ళి సిగరెట్ వెలిగించాడు.

ఏ అడ్డంకులూ లేకుండా అంతా సవ్యంగా జరిగింది. అతడు మోపెడ్‌ను శరవేగంగా పోనిచ్చాడు.

రంజిత్ నగరులోని ఒక చిన్న కాంపౌండులోకి మోపెడ్ వెళ్ళి ఆగింది. అతడు దిగాడు. తాళంతీసి లోపలకు వెళ్ళాడు. అందంగా నిర్మించిన చిన్న బంగళా హాల్లోనుంచి మేడమెట్లు పై డాబామీదకు వెళు తున్నాయి.

అతడు పడకగదిలోకి నడిచాడు. తన చేతిలో వున్న బాగ్‌ను బీరువాలో పెట్టి తాళంవేసి ఫోము కుర్చీలో కూర్చున్నాడు.

పక్కనున్న బాటిల్లోని రమ్‌ను గ్లాసులో పోసుకుని,

సోడా కలిపి తాగసాగాడు. అలా రెండు పెగ్గులు తాగేశాడు. ఇప్పుడు అతను వుషారుగా వున్నాడు.

అనేక విధాల ఆమెను కష్టపెడుతున్న తనని గురించి ఆమె పోలీసు రిపోర్టు ఎందుకివ్వదు? పత్రికల్లో బాడ్ పబ్లిసిటీ వస్తుందేమో అని ఆమె భయమా?

సోఫామీద వెనక్కు వాలి అతడు ఆలోచిస్తున్నాడు. సుబ్బాయమ్మ! అతడు లోలోపల నవ్వుకున్నాడు.

శివరావు తన బావను చూడ్డానికి రాజమండ్రి వెళ్ళాడు. బావ యింట్లో ఆమె పనిమనిషిగా వుండేది. ఆమె అతడిని యెంతో ఆకర్షించింది. ఆమె చాలా అందమైన వుషారైన యువతి. బావ ఆమెను "సుబ్బీ" అని పిల్చేవాడు. కాని అలా పిలవడం శివరావుకి యిష్టంలేదు. "సుబ్బాయమ్మా" అని అతడు పిల్చేవాడు.

అక్కయ్య మరణించింది. బావ ఆఫీసుకుపోయాడు. ఆమె పనికి వచ్చేసరికి శివరావు మాత్రం యింట్లో వుండేవాడు. పనిమనిషి రాకకోసం యెదురుచూస్తూ అతడు కూర్చునేవాడు.

గదులు తుడుస్తూంటే కళ్ళతో ఆమె సౌందర్యాన్ని అతడు తిలకించేవాడు. పచ్చటి శరీరం. కోల మొహం. పెద్ద కళ్ళు. ఎర్రటి పెదిమలు. పొడుగాటి జుత్తు. ఎత్తయిన స్తనాలు. బలమైన శరీరం. ఇంత భాగ్యమిచ్చి భగవంతుడు యీమెను పనిమనిషిగా యెందుకు వుంచేశాడు?

"సుబ్బాయమ్మా, మద్రాసులో నువ్వు బాగా రాణిస్తావు!" అన్నాడతను ఓసారి.

"తీసుకెళ్తావా, బాబూ?" అందామె.

"నువ్వు వస్తానంటే తప్పక తీసుకెళ్తాను."

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది.

"అక్కడ యింత తిండెడతావా?" అడిగిందామె.

"కావలసినంత. సినిమాలుకూడా చూడొచ్చు."

"ఎప్పుడు పోదాం?"

"నీ వాళ్ళు యేమంటారో!" అన్నాడతను.

"నా వాళ్ళు యెవ్వరూ లేరు, బాబూ. మా అమ్మ మరొకనితో కాపురం చేస్తోంది. నే పోతే అమ్మ ఏమీ అనదు."

ధైర్యంచేసి అతడామెను దగ్గరకు లాక్కున్నాడు. ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"నీ బావ వూరుకుంటారా?" అందామె.

"బావ యేమన్నా నేను భయపడను."

ఆమె రహస్యంగా స్టేషన్‌కి వచ్చింది. అతడు ఆమెను మద్రాసుకు తీసుకుపోయాడు. రంజిత్ నగర్‌లో చిన్న ఫ్లాట్ తీసుకుని ఆమెతో జీవించసాగాడు. ఆమెకు రాయడం, చదవడం, మాట్లాడ్డం నేర్పాడు. గుళ్ళో ఆమెను పెళ్ళాడాడు. బట్టల షాపులో ఉద్యోగంచేస్తూ, వచ్చే రెండువందలతో యిద్దరూ సుఖంగా వుండేవారు.

ఆమె పట్నం పిల్లలా రూపొందింది. తన ప్రాణంగా భావిస్తూ ఆమెను ఎంతో ప్రేమతో అతడు చూసేవాడు.

"మా పనిపిల్ల సుబ్బిలో లేచిపోయావటగా!" అని బావ ఎత్తిపొడిచాడు ఉత్తరంలో.

"ఆమెను పెళ్ళాడి నా భార్యగా చేసుకున్నాను. సుబ్బాయమ్మ చక్కటి మనిషి" అని గర్వంగా జవాబిచ్చాడు.

తనంతగా నమ్మిన భార్య సినిమా తార అవగానే,

పెద్ద పెట్టున డబ్బును చూడగానే తనను బయటకు గెంటేయించింది.

వులిక్కిపడి అతడు లేచాడు. గ్లాసులో రమ్ పోసుకుని, కొద్దిగా సోడా కలిపి గడగడ తాగేశాడు. గొంతు లోంచి ద్రవం మండుతూ లోపలకు దిగింది.

అతడు సిగరెట్ వెలిగించాడు. పొగవదులుతూ ఆలోచిస్తున్నాడు. ధనరాజ్ కోసం ఆమె తనను పొమ్మంది. కాని యీనాడు ధనరాజ్ ఆమెను మర్చిపోయాడు. మాండలిక అనే యువతితో వుంటున్నాడతను. అతడు వికటంగా నవ్వాడు.

పక్కనున్న పరుపుమీద అతడు వాలాడు. క్షణంలో అతడికి నిద్ర పట్టేసింది.

## 4

బొంబాయినుంచి ఆమె విమానంలో మద్రాసుకు ప్రయాణం చేస్తోంది. పక్కనకూర్చున్న వ్యక్తివైపు ఓసారి చూసి ఆమె పత్రిక చదువుతూ కూర్చుంది. కాని ఆమె మనసు పత్రికమీద లేదు.

పక్కన కూర్చున్నతను బాగ్గ నలుపురంగులో వున్నాడు. తెల్లటి షార్క్‌స్కిన్ సూటు ధరించాడు. బలిష్టమైన శరీరం. కళ్ళు కొంచెం ఎర్రగా వున్నాయి. జుత్తు మెలికలు తిరుగుతూ వెనక్కు వెళ్ళింది. అతడు బాగా డబ్బున్నవాడయి వుండాలి.

అతడి ముహం చూస్తే భయంకరంగా వుంది. సినిమాల్లో విలన్ పాత్రలకు అతడు పనికొస్తాడు, అనుకుందామె.

విమానం ఆకాశంలో ప్రయాణం సాగిస్తోంది. ఒక యువతి వాళ్ళ సీట్ల దగ్గరకు వచ్చింది. సాసర్లో పెట్టిన

ఐస్ క్రీమ్ కప్పును వాళ్ళిద్దరకూ యిచ్చింది.

చంపకమాల ఆమె వంక చూసింది. ఆమె యేర్ హోస్టెస్ కాదు. అయితే ఐస్ క్రీమ్ తనకెందుకిచ్చింది?

పక్కన కూర్చున్నతను నవ్వుతూ ఆమెవైపు తిరిగాడు.

"నేనే మీకు యివ్వమన్నాను. నా పేరు కపాలీ! వినేవుంటారు" అన్నాడతను.

కపాలీ! ఆ పేరు విందామె. తనకు ఏదో చిత్రం చెప్తూ డైరక్టర్ రాజారామ్ అన్న మాటలు ఆమెకు జ్ఞాపకొచ్చాయి.

"కపాలీ గాంగ్ వాళ్ళు హీరోని ఎత్తుకుపోతారు. నువ్వు అష్టకష్టాలుపడి అతడిని రక్షిస్తావు. అదీ నేను తీయబోయే చిత్రం కథ, క్లుప్తంగా" అన్నాడతను.

ఆ కపాలీ యితనేనా?

మరోసారి కపాలీ నాటుసారా తయారుచేసి కోట్లకు కోట్లు ఆర్జిస్తున్నాడనీ, ఎంత ప్రయత్నించినా పోలీసులు అతడిని అపలేకపోతున్నారనీ ఆమె పత్రికలో చదివింది.

ఆ కపాలీ యితడేనా?

ఎన్నో హత్యలు చేయించాడనీ, కాని పోలీసులకు యెప్పుడూ చిక్కడనీ కపాలీ గురించి సినిమా వాళ్ళు చెప్పుకుంటూంటే ఆమె విన్నది.

కపాలీ కలియుగ రాక్షసుడిలా ఆమెకు కనిపిస్తున్నాడు.

ఐస్ క్రీమ్ వైపు ఆమె చూస్తూ వుండిపోయింది. కపాలీ మెల్లిగా తింటున్నాడు.

"చంపకమాలా, మీ చిత్రాలన్నీ నేను చూశాను. మీలాంటి స్టార్ మరొకతి లేదని నా నమ్మకం. ఐస్ క్రీమ్ తినండి. అది తాజ్ ఐస్ క్రీమ్, ది బెస్టు మనీ కెన్ బై"

అన్నాడతను.

నవ్వుతూ అతడివైపు చూసి ఆమె కప్పులోని ఐస్ క్రీమ్‌ని తినసాగింది. ఏర్ హోస్టెస్ పక్కనుంచి పోతూ కపాలీవైపు నవ్వుతూ "వాంట్ ఎనీ థింగ్, సార్?" అని అడిగింది.

"థాంగ్స్, నథింగ్" అన్నాడతను.

అతడు బాగా పలుకుబడి వున్న వ్యక్తిలా వున్నాడు. చంపకమాల ఐస్ క్రీమ్ తినేసింది. వెనుకనుంచి ఒక యువతి వచ్చి ఖాళీ ప్లేట్లను తీసుకుపోయింది.

"ఆమె, మరి కొంతమంది నాతో ప్రయాణం చేస్తున్నారు. నేను ఒంటరిగా ఎక్కడికీ వెళ్ళను. నాతో పన్నెండుగురు ప్రయాణం చేస్తూ వుంటారు" అన్నాడతను.

గొప్ప కారక్టర్ అనుకుంది చంపకమాల.

మరో పావుగంటలో మీనంబాకం ఏరోడ్రోమ్‌లో విమానం దిగబోతోంది. అతడు ఆమెకు ఒక విజిటింగ్ కార్డు తీసి యిచ్చాడు.

"మీ కెప్పుడేనా నా సహాయం కావలిస్తే ఆ నంబర్లకు ఫోన్ చేయండి. నేను లేకపోవచ్చు. మీరా పేరు చెప్పండి. తర్వాత నేనే మీకు ఫోన్ చేస్తాను" అన్నాడతను.

"చాలా థాంక్స్" అని కార్డును ఆమె తన హేండ్ బాగ్‌లో పడేసుకుంది.

మీనంబాకం ఏరోడ్రోమ్‌లో విమానం దిగింది. ఆమె కిందకు దిగింది. వెనకనే కపాలీ వెళ్ళాడు.

"మిమ్మల్ని మీ కారుదాకా తీసుకెళతాను" అన్నాడతను.

ఆమె నడుస్తోంది. పక్కనే అతడు కదుల్తున్నాడు.

వెనక నే డజనుమంది నడవసాగారు.

డ్రయివర్ నాయుడు ఆమెవైపు వచ్చాడు.

"మెర్సిడిస్ రిపేరులో వుందమ్మా. ఫియట్ కారు తెచ్చాను" అన్నాడతను.

ఆమె కపాలీవైపు చిరునవ్వుతో చూసింది.

"చాలా థాంక్స్" అందామె.

"డోంట్ బాదర్" అన్నాడతను.

"మీరు నా సినిమాలు థియేటర్లకు వెళ్ళి చూస్తూ వుంటారా?" అడిగిందామె.

"నా యింట్లో చిన్న థియేటర్ వుంది. అక్కడ చూస్తాను" అన్నాడతను.

ఆమె ఫియట్ కారులో కూర్చుంది. డ్రయివర్ తలుపు మూశాడు. ఆమె మళ్ళా కపాలీవైపు చూసింది.

తనకు ఏం కావలసినా అతడు చేస్తాడనే నమ్మకం ఆ క్షణంలో ఆమెలో ఏర్పడింది.

ఇంటికెళ్ళాక ఆమె కొంతసేపు కొడుకుతో ఆడుకుంది, తర్వాత సినీతార దమయంతికి ఫోన్ చేసింది.

"హలో, యెప్పుడొచ్చావు బొంబేనుంచి?" అడిగింది దమయంతి.

"ఇవాళే. ప్లేనులో నా పక్కన కూర్చుని ప్రయాణం చేసినాయన మిస్టర్ కపాలీ" అంది చంపకమాల.

"అతడిని చూసి నువ్వు భయపడలేదూ?"

"పెద్దమనిషిలా వున్నాడు. మర్యాదగా ప్రవర్తించాడు."

"ఏమో, కపాలీ పేరు ఎత్తితే మంత్రులు కూడా భయపడ్తారని విన్నాను. పోలీసులు అతడి జోలికిపోరు. ఏం చేస్తాడో అని భయం! చిటికెలో మనిషిని కపాలీ

హత్యచేస్తాడని విన్నాను. అతడిమీద యెన్ని కథలో వున్నాయి."

"ఒక కథ చెప్పు, వినాలని వుంది."

"విమల అనే యువతిని ప్రకాష్ అనే యువకుడు మోసం చేశాడు. ఆమె గర్భవతి అయింది. అయినా ప్రకాష్ ఆమెను పెళ్ళాడలేదు. ఆమె నూతిలోపడి చచ్చింది. పోలీసులు యేమీ చెయ్యలేకపోయారు. విమల తల్లిదండ్రులు కపాలీని కలుసుకుని అంతా చెప్పారు. కపాలీ ప్రకాష్‌ను విమల దగ్గరకు పంపేశాడు."

"ఎలా?"

"అదే నూతిలోపడి చచ్చాడు ప్రకాష్. పైన వదిలిన షర్టు జేబులో ఉత్తరం వుంది. విమలను మోసంచేసినట్లు ఒప్పుకుని ఆత్మహత్య చేసుకుంటున్నానని ప్రకాష్ రాశాడు."

"అది ప్రకాష్ రాయలేదేమో?"

"అతనే రాశాడు. అతడిచేత అలా కపాలీ రాయించి తర్వాత నూతిలోకి తోయించేసి వుంటాడని అందరూ అంటున్నారు" అంది దమయంతి.

"కపాలీ అంత కిరాతకుడా?" అంది చంపకమాల.

"అతడితో స్నేహం చేయకు-డేంజరస్!" దమయంతి సలహా యిచ్చింది.

పుత్రుడు నిద్రపోతున్నాడు. టెలిఫోన్ మ్రోగింది. ఆమె వెళ్ళి రిసీవర్ని ఎత్తింది.

"హలో!" అంది.

"సుబ్బాయమ్మా, నీ బ్లాక్ మనీ అంతా ఎగిరిపోయినట్లుంది!" అన్నాడతను.

"అది యెవరు యెగరేసుకుపోయారో తెలుసులే"

అందామె.

"ఎలా తెల్సుకున్నావు?"

"నీ ట్రేడ్ మార్క్ వుందిగా! ఒకప్పుడు నీకొచ్చే జీతం డబ్బులు 200 అక్కడ వదిలిపెట్టావుగా!"

అతడు నవ్వాడు.

"బాగా కనుక్కున్నావు! సుబ్బాయమ్మ బుర్ర కూడా యిప్పుడు పనిచేస్తోంది."

"యూ డర్టీ రోగ్, నువ్వు యెక్కడున్నా నా మీద ఆధారపడే జీవిస్తున్నావు. నీలో పౌరుషం అనేది వుంటే నా డబ్బు ముట్టుకునేవాడవు కాదు!" అందామె.

"నీ బ్లాక్ మనీతో సంఘానికి మేలుచేయాలని నా ఉద్దేశం."

"ఏం చేస్తున్నావో యెవడికి తెలుసు? నా దగ్గరున్నదంతా పట్టుకుపోయానని గర్వపడకు! నా దగ్గరున్న దానిలో చిన్న మొత్తం నువ్వు తీసుకుపోయావు. అది నాకు లెక్కలేదు. నీలాటి పందికొక్కులు యెంత తిన్నా తరగని ఆస్తి నాది" అందామె.

ఆమె రిసీవర్ పెట్టేసింది. టెలిఫోన్ మ్రోగింది పూరుకుంటే అదే ఆగిపోతుంది. అతడే అయివుండాలి!

కాని టెలిఫోన్ మ్రోగుతూనే వుంది. విసుగ్గా ఆమె రిసీవర్ ఎత్తింది.

"చంపకమాల వున్నారా?"

"నేనే" అందామె.

"కపాలీ స్పీకింగ్. ఎలా వున్నారు?"

"ఫైన్" అందామె.

"జాన్ యింగ్లీషు పిక్చర్ మీరు చూశారా?"

"లేదు" అందామె.

"రేపు రాత్రి వీడియో నా ఇంట్లో చూపిస్తున్నాను. మీరు వస్తే సంతోషిస్తాను" అన్నాడతను.

"ఎన్నింటికి?"

"మీరు ఎప్పుడైనా మీ వీలు చూసుకుని రావచ్చు."

"తొమ్మిదింటికి వస్తాను" అందామె.

దమయంతి చెప్పినది ఆమెకు జ్ఞాపకముంది. కాని కపాలీ ఏం చేస్తాడు? హృదయంలో తనని పూజించే మనిషి హాని చేయడు!

"హలో" అన్నాడతను.

"చెప్పండి."

"మీకు నా మెర్సిడిస్ కారు పంపుతాను. అందులో రండి."

"అలాగే థాంక్స్, గుడ్ నైట్" అని రిసీవర్ పెట్టేసిందామె.

## 5

నర్సింగ్ హోమ్‌లో చంపకమాల కోలుకుంటోంది. డాక్టర్ సుమతి ఆమెవైపు నవ్వుతూ చూసింది.

"ఎల్లుండి మీరు యింటికి పోవచ్చు" అందామె.

"థాంక్స్ డాక్టర్! మీరు నాకు మళ్ళా జీవం పోశారు. అప్పటి పరిస్థితి చూసి ఛస్తానేమో అనుకున్నాను" అంది చంపకమాల.

యూనిఫామ్‌లో వున్న నర్స్ ఒక బుకే తెచ్చి చంపకమాల కిచ్చింది. బుకేకి ఒక కార్డు కట్టబడి వుంది.

"విత్ లవ్ ఫ్రమ్ కపాలీ!" అని కార్డుమీద రాసి వుంది.

చంపకమాల ఆశ్చర్యపోయింది. తనకు ఆపరేషన్ జరిగిందనీ, నర్సింగ్ హోమ్‌లో వున్నదనీ కపాలీ యెలా

కనుక్కున్నాడు? అతడు దేవాంతకుడు. యేదైనా కనుక్కో గలడు.

ఆ రోజే ఆమె యింటికి తిరిగివచ్చింది. కొడుకును తన పక్కనే పడుకోబెట్టుకొని ఆమె విశ్రమిస్తోంది.

టెలిఫోన్లు మ్రోగుతున్నాయి. సెక్రటరీ సుందరం అందరితోనూ మాట్లాడుతున్నాడు.

"మరో పదిహేను రోజులుదాకా ఆమె షూటింగ్ కు రాలేరు" అన్నాడు సుందరం యెవరితోనో.

ఆ నాటి రాత్రి పడగ్గదిలో ఆమె తన బిడ్డ పక్కనే పడుకుని వుంది. టెలిఫోన్ మ్రోగింది. ఆమె రిసీవర్ని ఎత్తింది.

"సుబ్బాయమ్మా, హిస్టరెక్టొమీ చేయించుకున్నావని తెలిసింది!" అన్నాడతను.

"ఎవరు చెప్పారు నీకు?"

"నాకు వార్తలు వస్తూనే వుంటాయి."

"చేయించుకోవలసిన పరిస్థితి ఏర్పడింది" అందామె.

"గుడ్ లక్, బాగా కోలుకో! అప్పుడు మళ్ళీ రంగంలోకి వస్తాను" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

ఆమె పరుపుమీద పడుకుని తన బిడ్డవంక ఆప్యాయంగా చూసింది. తరగని తన ఆస్తికి వారసుడు రాజకుమారే! తనకీ జన్మలో యిహ పిల్లలు పుట్టరు. ఈ ఆలోచన రాగానే ఆమె బిడ్డమీద ఆప్యాయంగా చెయ్యి వేసింది.

రాజకుమార్ని బాగా చదివించాలి! అమెరికా పంపాలి! యేదో ఆలోచిస్తూ కలలుకంటూ ఆమె నిద్రపోయింది.

# 6

ఏర్ కండిషండ్ గదిలో కూర్చుని కపాలీ మిస్ రీటా వైపు చూశాడు.

అతడి గ్లాసులో స్కాచ్ విస్కీ పోసి ఆమె సోడా కలిపింది. గ్లాసులో ఐస్ క్యూబ్స్ పడేసింది.

అతడి కుడిభుజమైన మస్తాన్ లోపలకొచ్చాడు. రీటా బయటకు వెళ్ళిపోయింది.

"బాస్, చాలామంది సినిమా నిర్మాతలు చంపకమాల యింటికి ఫోన్ చేశారు. వాళ్ళందరికీ సుందరం జవాబిచ్చాడు. ఆమె వాళ్ళతో మాట్లాడలేదు. ఒకడు ఆమె అన్‌లిస్టెడ్ నంబర్‌కి ఫోన్ చేసి ఆమెతో మాట్లాడాడు. సుబ్బాయమ్మా అని పిల్చాడతను...."

"రన్ ది టేప్!" అన్నాడు కపాలీ.

మస్తాన్ కాస్సేపట్లో టేప్ రికార్డర్ ఆన్ చేశాడు. అంతా కపాలీ విన్నాడు.

"అతడు తన పేరు చెప్పలేదు. అతడెవరో, యెక్కడుంటున్నాడు, అన్నీ కనుక్కోండి" అన్నాడు కపాలీ.

"అలాగే, బాస్" అన్నాడు మస్తాన్.

మస్తాన్ బయటకు వెళ్ళిపోయాడు. గ్లాసులోని విస్కీని కపాలీ తాగేశాడు. రీటా అతడి పక్కనే వచ్చి నిలబడింది. అతడామెవైపు చూశాడు. గ్లాసులో ఆమె మళ్ళా విస్కీ పోసింది.

మస్తాన్ మళ్ళా లోపలకు వచ్చాడు.

"ఈమెను మీరు చూడాలి!" అన్నాడు మస్తాన్ ఒక చీటీ యిస్తూ.

"లోపలకు రమ్మను" అని కపాలీ గ్లాసు ఖాళీ చేశాడు.

* * *

హోటల్ రియో టెలిఫోన్ బూత్‌లోకి వెళ్ళి శివరావు గాజు తలుపు మూశాడు. పది నిమిషాలుపైగా మాట్లాడుతూనే వున్నాడు.

రియో హోటల్ కాంపౌండులో స్కూటర్ దిగి ఒకతను ముందు హాల్లోకి పరుగెత్తాడు. గోడవారగావున్న మూడు ఫోన్ బూత్‌లవైపు అతడు చూశాడు. రెండు ఖాళీగా వున్నాయి. మూడో బూత్‌లోంచి బయటకు వస్తున్న వ్యక్తివైపు అతడు పరీక్షగా చూశాడు. శివరావు మేడమీదున్న 20 నంబరు గదిలోకి వెళ్ళిపోయాడు. స్కూటర్ దిగినతను నడవమ్మట నడుస్తూ 20 నంబరు గదిముందు ఆగాడు.

క్షణకాలం ఆలోచించి కిందకు పరుగెత్తాడు. రిసెప్షన్ కౌంటర్ ముందుకు వెళ్ళాడు.

"రూమ్ నంబర్ 20లో ఆయనున్నారా?" ప్రశ్నించాడతను.

"ఎవరు—రామ్మూర్తిగారా?" అడిగాడు గుమస్తా.

"ఆయన కాదు, మిస్టర్ పెరీరా!"

"ఆ పేరుతో యీ హోటల్లో యెవ్వరూ లేరు."

స్కూటర్ మనిషి మళ్ళా 20 నంబరు గది ముందుకు వెళ్ళాడు. మెల్లిగా తలుపును తట్టాడు. శివరావు తలుపు తెర్చి అతడివంక విచిత్రంగా చూశాడు.

"నా ఫ్రెండ్ రామ్మూర్తి యీ గదిలో వున్నాడని రిసెప్షన్‌లో చెప్పారు" అన్నాడతను.

శివరావు అతడివైపు సూటిగా చూశాడు.

"నీ ఫ్రెండ్ నేను కానుగా! ఈ లోకంలో ఎందరో రామ్మూర్తులు వుండొచ్చు."

"యూ ఆర్ రైట్" అని అతను వెళ్ళిపోయాడు.

శివరావు తలుపు మూసి లోపలున్న సోఫావైపు కదిలాడు.

"ఎవరు?" అడిగింది మిస్ మేనక, సోఫాలో కూర్చుని.

"డోంట్ బాదర్," అన్నాడతను.

మేనక సన్నగా, పొడుగ్గా వుంది. అదే హోటల్లో ఆమె టెలిఫోన్ ఆపరేటర్‌గా పనిచేస్తోంది.

శివరావు ఆమెను లాగి అమాంతంగా పరుపుమీదకు తోశాడు. గిర్రున తిరుగుతూ ఆమె పరుపుమీద పడింది. అతడివైపు ఆమె కోపంగా చూసింది.

"యూ ఆరే బ్రూట్!" అర్చిందామె.

అతడు గంభీరంగా నవ్వాడు.

"నీకు డబ్బు కావాలిగా! డబ్బుకోసం అంతా సహించాలి," అన్నాడతను.

"రెండువేలు తెచ్చావా?"

అతడు ఒక నోట్లకట్టను ఆమెవైపు విసిరాడు. ఆమె దాన్ని భద్రంగా జాకెట్ లోపల దాచుకుంది.

అతడు అమాంతంగా ఆమెమీద వాలాడు. ఆమె పెదిమలను ముట్టెట్టుకుని క్రూరంగా కొరికాడు. ఆమె అడుమ్మా దూరంగా జరిగింది. హేండ్ బాగ్ లో వున్న అద్దంలో ఆమె తన పెదిమలను చూసుకుంది.

పళ్ళ గాట్లు కనిపిస్తున్నాయి. కొద్దిగా రక్తం చిమ్మింది.

"ఏం చేశావో చూడు," అందామె.

"అలా చేస్తేగాని నాకు ఆనందంగా వుండదు" అన్నాడతను.

"యూ శాడిస్టు!" అర్చిందామె.

ఆమెవైపు అతడు సూటిగా చూశాడు. అతడి పెదిమలు వణుకుతున్నాయి.

"నేనేం చేసినా నోరు మూసుకుని వుండడానికి ఇంకా ఎంత కావాలి?" అడిగాడతను.

"మరో రెండువేలు" అందామె.

మరో నోట్లకట్టను ఆమెవైపు విసిరాడతను. ఆమె నోట్లకట్టను దాచుకుంది.

"ఈ హోటల్లో నా డ్యూటీ అయిపోయింది. పద, మా ఇంటికి పోదాం" అందామె.

"పద" అన్నాడతను.

ఇద్దరూ బయటకు నడిచారు. గదికి అతడు తాళం వేశాడు. తాళంచెవిని రిసెప్షన్ కౌంటరు గుమాస్తాకు ఇచ్చాడు.

మోపెడ్ని స్టార్టుచేసి అతడు సీటుమీద కూర్చున్నాడు. మేనక వెనకనే కూర్చుంది.

సమీపంలో నిలబడివున్న స్కూటర్ మనిషి మోపెడ్ నంబర్ను గుర్తుంచుకున్నాడు.

## 7

బేదింగ్ టబ్లో పడుకుని ఆమె స్నానం చేస్తోంది. ఇద్దరు నౌఖర్లు ఆమె జుత్తుకు షాంపూ, ఆమె ఒంటికి సోప్ పూస్తున్నారు.

చంపకమాల ప్రతి రోజూ గంటపైగా బేదింగ్ టబ్లో వుంటుంది. వేడి నీళ్ళలో యూడికొలోన్ పోస్తారు నౌఖర్లు. నగ్నంగా ఆమె టబ్లోకి దిగుతుంది.

కొంతమందితో ఆమె అదే సమయంలో మాట్లాడ్తూ వుంటుంది.

సెక్రెటరీ సుందరం బాత్‌రూమ్‌లోకి పరుగెత్తుకొచ్చాడు.

"ప్రఖ్యాత డైరెక్టర్ ధనరాజ్ గారు వచ్చారు!" అన్నాడతను.

"ఇక్కడికు రమ్మను" అందామె.

సుందరం అలాగే వుండిపోయాడు.

"మీరు తొందరగా స్నానంచేసి రావడం మంచిదేమో" అన్నాడతను.

"సుందరం, నేను చెప్పింది చేయి!" అందామె.

సుందరం బయటకు పోయాడు. కాసేపట్లో ధనరాజ్ లోపలకొచ్చాడు. ఆమె చూపించిన స్టూల్ మీద ధనరాజ్ కూర్చున్నాడు.

"అమ్మాయి, యెలా వున్నావు?" అడిగాడతను.

"చూస్తున్నారుగా!" అందామె.

అతడివైపు నవ్వుతూ చూసింది. అతడు ధరించిన గుడ్డలు మాసి వున్నాయి. మెళ్ళో గొలుసు లేదు. వేళ్ళకు ఉంగరాలు లేవు. చేతికి వాచ్ కూడా లేదు.

"అమ్మాయి, మాండలికతో ఒకేసారి మూడుభాషల్లో చిత్రం తీశాను. అది యెందువలనో నెగ్గలేదు. డబ్బాలు వెనక్కొచ్చాయి. పూర్తిగా చితికిపోయాను. ఎవ్వరూ నన్ను డైరెక్టర్‌గా వుండమని అడగడం లేదు. సినిమా లైఫ్ అంతే!" అన్నాడతను.

"మాండలిక ఏమైంది?"

"భర్తతో కాపురంచేస్తోంది. జరిగినదంతా పీడకలలా భావించి సినిమా రంగాన్ని పూర్తిగా మర్చిపోయింది"

అన్నాడతను.

"నన్ను సూపర్ స్టార్ చేశానని మీరు ఒకప్పుడు గర్వంగా అనేవారు. నన్ను సూపర్ స్టార్ చేసినది మీరు కాదు, ప్రేక్షకుల అభిమానం! ఇప్పుడేనా అది తెలుసుకున్నారా?" అందామె.

"ఎందుకు తెలుసుకోనమ్మా! నేను లేకపోయినా నువ్వు నీ సూపర్ స్టార్ స్టేటస్‌ని నిలుపుకుంటూనే వున్నావు. నువ్వొక గొప్ప ఆర్టిస్టువి!"

ఆమె తీయగా నవ్వింది.

"నువ్వు నాకో అవకాశం యిస్తే దుమారం లేపేస్తాను. మంచి కథ రెడీగా వుంది. నువ్వు సరే అంటే మూడు నెలల్లో చిత్రం పూర్తి చేసి విడుదల చేస్తాను."

"ఒకసారి పేరు పోయాక మళ్ళా పేరు సంపాదించడం సినిమారంగంలో అంత సులభమైన పనికాదు" అందామె.

"నువ్వూ అలాగే అంటున్నావా?"

"మరో విధంగా అనలేను" అందామె.

"నా గతి యింతేనా?" అన్నాడతను దీనంగా.

"కాలచక్రం తిరుగుతూ వుంటుంది. కొత్త నిర్మాతలు, కొత్త డైరక్టర్లు, కొత్త ఆర్టిస్టులు వస్తూంటారు. సినిమా రంగంలో యెవరూ శాశ్వతంగా వుండలేరు. కొంత కాలంపాటు సినిమా రంగంలో మీరు జ్యోతిలా వెల్గారు. వెల్గి వెల్గి దీపం ఆరిపోయింది" అందామె.

ధనరాజ్ కళ్ళమ్మట నీళ్ళు జలజల కారాయి. అతడు మౌనంగా వుండిపోయాడు.

"మీకు నా నుంచి ఏం కావాలి?" అడిగిందామె.

"నా భార్య, నలుగురు పిల్లలు యింట్లో వున్నారు.

తినడానికి తిండి కూడా లేదు," అన్నాడతను.

"ప్రతినెలా మీ కెంతుంటే జీవితం సుఖంగా సాగుతుంది?"

"కనీసం వెయ్యి రూపాయి లుండాలి."

"ప్రతినెలా వెయ్యి రూపాయలు మీకు ముట్టేటట్లు నేను చూస్తాను. బ్యాంకిలో కొంత డబ్బు డిపాజిట్‌గా వేస్తాను. వెయ్యి రూపాయిలు వడ్డీగా మీకు ప్రతి నెలా నా బ్యాంకి పంపుతుంది" అందామె.

"అమ్మాయి, నువ్వు చాలా గొప్పదానివి. అంత వడ్డీ రావడానికి నువ్వు బాంకిలో చాలా డబ్బు డిపాజిట్ చెయ్యాలి. ఆ డబ్బు నాకిస్తే మూడు నెలల్లో ఒక పిక్చర్ తీసేస్తాను" అన్నాడు ధనరాజ్.

"అందుకే ఆ డబ్బు మీ కివ్వను. మీ కిస్తే మరో పిక్చర్ తీసి రోడ్డుమీద పడ్తారు. మీరు రోడ్డుమీద పడ్డం నా కిష్టంలేదు. ఇవాళ మీరు ఎలా వున్నా ఒకప్పుడు మీ ద్వారా అనేకమంది పైకి వెళ్ళారు. అలా వెళ్ళిన వాళ్ళలో నే నొకతిని. ఈ జీవితాంతం మీరు సుఖంగా వుండేటట్లు నేను చూస్తాను" అందామె.

ధనరాజ్ ఆమె వైపు మెచ్చుకుంటున్నట్లు చూశాడు.

"నీ యిష్ట మొచ్చినట్లు చెయ్యమ్మా! నాలుగు కాలాల పాటు నీలాటివాళ్ళు వర్ధిల్లాలి" అన్నాడతను.

అతడు లేచాడు. ఆమె సుందరాన్ని పిల్చింది. అతడు గబగబా వచ్చాడు.

"ధనరాజ్ గారికి టిఫిన్ పెట్టించు. ఆయనకు వెయ్యి రూపాయి లిచ్చి పంపించు" అందామె.

ధనరాజ్ ఆమెకు నమస్కరించబోయాడు.

"ధనరాజ్ గారూ, చేతులెత్తి దైవానికి నమస్కరించండి, నాకు కాదు" అందామె.

ధనరాజ్ సుందరంతో బయటకు వెళ్ళిపోయాడు. చంపకమాల కళ్ళమ్మట నీళ్ళు జలజల టబ్‌లోకి రాలాయి.

# 8

మూడేళ్ళ రాజకుమార్ తోటలో ఆడుకుంటున్నాడు. పూల మొక్కల పక్కనుంచి అతడివైపు చూశాడు. ఆయా పద్మావతి అతడి పక్కనే వుంది.

సాయంత్రం సమయం. ఇంకా ఆలస్యం చేస్తే చీకటి పడుతుంది. చీకటిలో ఆ కుర్రాడిని పట్టుకుని గోడ దూకడం అంత సులువైన పనికాదు.

అమాంతంగా శివరావు వాళ్ళవైపు దూకాడు.

"దొంగ! దొంగ!!" అని అర్చింది పద్మావతి.

శివరావు ఆమె చెంపమీద బలంగా కొట్టాడు. ఆమె నేలమీద దబ్బులా కూలిపోయింది. రాజకుమార్‌ని అతడు ఎత్తుకుని ప్రహరీగోడవైపు పరుగెత్తాడు.

ఆయా కేకలు విని కొందరు నౌఖర్లు పరుగెత్తుకొస్తున్నారు. శివరావు గోడ యెక్కి అటువైపుకు దూకాడు. మరుక్షణంలో అతడి మోపెడ్ రోడ్డుమ్మట వేగంగా వెళ్ళిపోయింది.

సెక్రటరీ సుందరం అక్కడికొచ్చాడు. అంతా తెల్సుకున్నాడు.

"ఆమె మనల్ని క్షమించదు!" అన్నాడు సుందరం.

"మనం ఏం చెయ్యగలం?" అన్నాడొక నౌఖరు.

సుందరం యింట్లోకి పరుగెత్తాడు. స్టూడియోకి ఫోన్ చేశాడు. వాళ్ళు వాళ్ళా ఫోన్ చేస్తామన్నారు.

కాస్సేపట్లో చంపకమాల ఫోన్ చేసింది.

సుందరం వణుకుతూ రిసీవర్ని ఎత్తాడు.

"ఏమైంది?" అందామె.

"రాజకుమార్ని యెవరో ఎత్తుకుపోయారు" అన గల్గాడతను.

"మీరందరూ వుప్పురదున్నపోతుల్లా తిని ఏం చేస్తున్నారు?" అర్చిందామె.

"మమ్మల్ని తిట్టి లాభంలేదు. వెంటనే యేదో చెయ్యాలి" అన్నాడు సుందరం.

"షూటింగ్ మానేసి నేను వస్తున్నాను" అందామె.

మరో పదిహేను నిమిషాల్లో ఆమె వచ్చింది.

"నా బిడ్డను ఎవరు ఎత్తుకుపోయారు?" అర్చిందామె.

"అతనెవరో తెలియదమ్మా. పొట్టిగా, లావుగా వున్నాడు. పచ్చగా వున్నాడు" అంది పద్మావతి.

వెంటనే చంపకమాల పోల్చేసింది.

"వాడే! వాడే! శివరావు!" అందామె.

హాల్లో ఆమె అటూ యిటూ, పచార్లు చేస్తోంది. సుందరం, నౌఖర్లు హాల్లో నిలబడి వున్నారు.

టెలిఫోన్ మ్రోగింది. ఆమె రిసీవర్ని ఎత్తింది.

"హలో!" అందామె.

"సుబ్బాయమ్మా, నీది తరగని ఆస్తి. నీ రాజకుమార్ నా దగ్గర వున్నాడు. అతడు నీ దగ్గరకు సజీవంగా రాడు" అన్నాడు శివరావు.

"శివా, వాడిని చంపొద్దు. నాకీ జీవితంలో యింక పిల్లలు పుట్టరు. ప్లీజ్ స్పేర్ హిమ్!" అందామె ఏడుస్తూ.

అటు వైపునుంచి అతడు వికటంగా నవ్వాడు.

"నా బాధ నీకు తెలియాలంటే అతడిని చంపాలి

అతడి శవాన్ని నీకు పాక్ చేసి పంపుతాను."

ఆమె మౌనంగా వుండిపోయింది.

"నా బిడ్డను నా కివ్వడానికి నీ కెంత కావాలి?" అడిగిందామె.

"నీ దగ్గరున్నదంతా యిచ్చినా వాడు బతకకూడదు!" అన్నాడతను.

"నీకేదో పిచ్చి పట్టింది. యూ ఆర్ మాడ్!" అందామె.

"సుబ్బాయమ్మా, ఏడువు! జీవితాంతం యేడుస్తూ వుండు. అదే నాకు కావలసింది."

"నేను యేడిస్తే నీకేమొస్తుంది?"

"ఆనందం. హేపీనెస్!"

"నువ్వు పిశాచంగా మారావు. నువ్వు మనిషిలా ఉండాలని నా ఆశ."

"నీ ఆశలు ఫలించవు. ఆ సమయం దాటిపోయింది."

"శివా, ప్లీస్, అతడిని వదిలేయి! నా ముద్దుల బిడ్డను నాకిచ్చేయి" వాపోయిందామె.

"పోలీసు రిపోర్టియ్య. నన్ను పట్టుకోమను, నీ బిడ్డను రక్షించుకో!" అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

## 9

హాల్లో చంపకమాల పిచ్చిదానిలా తిరుగుతోంది. ఏం చేయాలి? తన బిడ్డను కాపాడాలి!

పోలీసు రిపోర్టిస్తే!

శివరావు పిచ్చివాడు. పోలీసులు యేదేనా చేసే లోపలో అతడు తన బిడ్డను హతమారుస్తాడు.

ఆ క్షణంలో కపాలీ పేరు ఆమెకు గుర్తొచ్చింది. కపాలీ తనకోసం యేదైనా చేస్తాడు. కపాలీ తనబిడ్డను

రక్షించవచ్చు!

రిసీవర్ ఎత్తి ఆమె విజిటింగ్ కార్డులో వున్న ఒక నంబర్ని తిప్పింది.

"హలో" అన్నారెవరో.

"మిస్టర్ కపాలీతో మాట్లాడాలి" అందామె.

"ఆయన యిక్కడ లేరు."

ఆ జవాబు విని ఆమెకు యేడ్వాలనిపించింది.

"ఆయన యెక్కడున్నారు?"

"మీరు యెవరో చెప్పండి."

"ఐయామ్ చంపకమాల. అర్జంట్ విషయం గురించి ఆయనతో మాట్లాడాలి" అందామె.

"మీరు ఫోన్ దగ్గరే వుండండి."

ఆమె రిసీవర్ పెట్టేసింది. సెకన్లు, నిమిషాలు దొర్లి పోతున్నాయి. ఆమె హాల్లో పచార్లు చేస్తోంది.

"పోలీసు రిపోర్టివ్వడం మంచిది" అన్నాడు సుందరం.

"షటప్" అర్చిందామె.

అతడు నోరు మూసుకున్నాడు.

కాస్సేపట్లో టెలిఫోన్ మ్రోగింది. ఆమె ఆత్రంగా రిసీవర్ని ఎత్తింది.

"కపాలీ హియర్! చంపకమాలా, మీకేం కావాలి?"

"శివరావు అనేవాడు నా కొడుకుని యెత్తుకు పోయాడు. నా బిడ్డను చంపుతానన్నాడు. వెంటనే యేదో చేసి నా బిడ్డను కాపాడి, నాకు అప్పగించాలి" అందామె.

"మిస్ చంపకమాలా, శివరావు మాకు దొరికితే అతడిని చంపొచ్చా?"

చంపకమాల క్షణకాలం ఆలోచించింది,

"అతడిని చంపొద్దు. నా బిడ్డను కాపాడండి. అంతే నాకు కావల్సింది."

"మీరు ఫోన్ సమీపంలో వుండండి. మేం వెంటనే రంగంలోకి దిగుతాం" అన్నాడతను.

ఆమె రిసీవర్ పెట్టేసింది. గదిలో పచార్లు చేస్తోంది.

కపాలీ బజ్జర్ నొక్కాడు. ఏర్‌కండిషండ్ గదిలోకి మస్తాన్ పరుగెత్తుకొచ్చాడు.

"ఏమిటి బాస్?" అడిగాడతను.

"హోటల్ రియాలో మన మనిషి చూసిన మోపెడ్ ఎవరి పేరులో వుంది?"

"శివరావు పేరులో, సార్. అతడు రంజిత్‌నగర్‌లో వున్నాడు" అన్నాడు మస్తాన్.

సైలెన్సర్ అమర్చిన పిస్టల్ని కపాలీ తన కోటు జేబులో పడేసుకున్నాడు.

"పద, అక్కడకు వెళదాం" అన్నాడతను.

## 10

రోడ్డుమీద మెర్సిడిస్ కారాపి కపాలీ, మస్తాన్ కిందకు దిగారు. గేటు తోసుకుని లోపలకు వెళ్ళారు. ముందు తలుపు మూసివుంది.

హాల్లో రాజకుమార్ నేల మీద బోర్లా పడుకుని వున్నాడు. తీగల్తో అతడి కాళ్ళను శివరావు కట్టేశాడు. కాళ్ళను తీగలు కోయడం మూలంగా రక్తం కొద్దిగా చిమ్ముతోంది.

రాజకుమార్ భయంగా అతడివైపు చూస్తున్నాడు.

"నేనెవరో తెలుసా?" అడిగాడతను.

"తెలియదు" అన్నాడు రాజకుమార్.

"నీ అమ్మ మొగుడిని!"

"డాడీ!" అన్నాడు రాజకుమార్.

"నేను నీ డాడీని కాను. నీ డాడీ ఎవరో నీ తల్లికే తెలియాలి" అరిచాడతను.

పొడుగాటి మేకును అతడు రాజకుమార్ కుడిచేతి మీద గుచ్చాడు. సుత్తిని పైకి ఎత్తాడు. మేకు చర్మం లోంచి కిందకు దిగాలి!

"డాడీ!" అన్నాడు రాజకుమార్.

రాజకుమార్ బాధతో యేడుస్తున్నాడు.

అమాంతంగా సుత్తి మేకుమీదకు దిగింది. మేకు అతడి చేతిలోకి గుచ్చుకుపోయింది.

"అమ్మా!"అని అరుస్తూ యేడ్వసాగాడు రాజకుమార్.

ముందు తలుపును యెవరో పిచ్చిగా కొడుతున్నారు. సుత్తిని నేలమీదపడేసి శివరావు తలుపుదగ్గరకు నడిచాడు.

మేనక తనకోసం వచ్చి వుంటుంది!

అతడు తలుపు తెరిచాడు. కపాలీ, మస్తాన్ లోపలకు దూసుకొచ్చారు. కపాలీ రాజకుమార్ వైపు పరుగెత్తాడు. చేతిలో దిగిన మేకును పీకేశాడు. కాళ్ళకు కట్టిన తీగలను తొలగించాడు.

రాజకుమార్ని ఎత్తుకుని కపాలీ వెనక్కి నడిచాడు. శివరావు వైపు కోపంగా చూశాడు.

"శివరావు, నిన్ను చంపివుండేవాడిని, కాని యితడి తల్లి నిన్ను చంపవద్దని నాతో అంది. నిన్ను వదిలేస్తున్నాను" అని కపాలీ కారువైపు పరుగెత్తాడు.

మస్తాన్ కారును శరవేగంగా పోనిచ్చాడు. తోవలో డాక్టర్ శేఖర్ యింటిముందు కారు ఆగింది. కపాలీ ముందు తలుపును తట్టాడు.

డాక్టర్ భార్య తలుపు తెరిచింది.

"ఆయన నిద్రపోతున్నారు" అందామె.

"వెంటనే లేపు!" అరిచాడు కపాలీ.

కాస్సేపట్లో డాక్టర్ శేఖర్ వచ్చాడు. కపాలీ చేతుల్లో వున్న కుర్రాడికి ఇంజక్షన్ యిచ్చి, గాయపడిన చోట కట్టు కట్టాడు.

"కపాలీగారూ, మరేం ఫరవాలేదు. రెండు రోజుల్లో ఈ కుర్రాడు క్షేమంగా వుంటాడు" అన్నాడు డాక్టర్ శేఖర్.

పది నిమిషాల్లో కపాలీ కారు చంపకమాల యింటి ముందు ఆగింది. ఆమె కారువైపు పరుగెత్తుకొచ్చింది. అతడి చేతుల్లోవున్న బిడ్డను ఆమె ఆప్యాయంగా తీసుకుంది.

కపాలీ ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"రెండు మూడు రోజుల్లో అతను శుభ్రంగా వుంటాడని డాక్టర్ అన్నాడు" అన్నాడు కపాలీ.

చేతుల్లోవున్న కొడుకును ఆమె పిచ్చిగా ముద్దెట్టుకుంది.

"మీకు కావల్సింది ఇచ్చాను. నేను వెళ్ళొచ్చా?" అన్నాడు కపాలీ.

"మీరు వెళ్ళాలా?" అందామె.

"వెళ్ళొద్దా?" అడిగాడతను.

"ఇవాళ ఇక్కడే వుండండి. నాకెందుకో భయంగా వుంది" అందామె.

టెలిఫోన్ మ్రోగింది. ఆమె వెళ్ళి రిసీవర్ని అందుకుంది. రాజకుమార్ని కపాలీ తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"హలో!" అందామె.

"హలో, రంజిత్ నగర్ నుంచి మేం మాట్లాడుతున్నాం. మా యిల్లు శివరావు యింటిపక్కనుంది. పిస్టల్ శబ్దం విని మేం ఆయన యింటికెళ్ళాం. ఆయన

షూట్ చేసుకుని చచ్చిపోయారు. ఆయన ఒక ఉత్తరం రాశారు. మీకు ఫోన్ చేసి ఆ ఉత్తరంలో రాసింది చదివి వినిపించమన్నారాయన" అన్నాడా కతను.

"శివరావు ఏం రాశాడు?" అడిగిందామె.

"చదువుతున్నా, వినండి. 'మై డియర్ చంపకమాలా, నన్ను క్షమించు. నన్ను చంపొద్దని నువ్వు ఆ వ్యక్తితో చెప్పావట. నీకంత ద్రోహం చేసినా నువ్వు నన్ను మన్నించగల్గావు. నా హృదయం పగతో నిండిపోయింది. నేను పిచ్చివాడిని అయ్యాను. అయినా నా ప్రాణాన్ని నువ్వు కాపాడి, నన్ను మన్నించినందుకు నిన్ను మెచ్చుకుంటున్నాను. ఈ జీవితంలో నే నింక నీ దగ్గరకు రాలేను. అందుకే పోతున్నాను. వచ్చే జన్మలో నీకు దగ్గరవాలని నా ఆఖరి కోరిక.

నీ శివరావు."

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది. కపాలీ ఆమె దగ్గరకు వెళ్ళాడు.

"ఏమైంది?" అడిగాడతను.

"శివరావు ఆత్మహత్య చేసుకున్నాడు" అందామె.

"శివరావు మీ కేవిధంగా తెలుసు?" అడిగాడు కపాలీ.

ఆమె కపాలీవైపు సూటిగా చూసింది.

"దారి తెలియని మనిషి! నామీద పగ సాధించాలనుకున్నాడు. పగకంటె ప్రేమ గొప్పదని ఆఖరికి అతడు తెల్సుకున్నాడు. అతడి ఆత్మకు శాంతి చేకూరాలని మనం ప్రార్థించుదాం" అందామె.

—:అ యి పో యిం ది:—

# ఇండియా స్కెలిటన్స్

## ప్రతాప రవిశంకర్

ప్లీడరు విష్ణుమూర్తిగారింట్లో జనం శోకాలు పెట్టి యేడుస్తున్నారు. ఒకరు కాదు—ఇద్దరు కాదు—పదిమందికి పైగా అలా పెద్దగా ఏడుస్తుంటే రోడ్డుమీద పోయే మనుషులు కూడా లోపలకు వచ్చి శవాన్ని చూసి వెళుతున్నారు.

ఆ శవం యెవరిదో కాదు—ప్లీడరు విష్ణుమూర్తిదే—ఆయనకు ఇంకా యాభై ఏళ్ళు రాలేదు. ఇంకో రెండు రోజుల్లో యాభైయవ యేడు వచ్చేది. కాని మాయదారి గుండెపోటు తొందరపడి వచ్చి విష్ణుమూర్తి యాభైలో పడకముందే ఆ సాయంత్రం ఆరుగంటల సమయంలో అతడిని పైకి తీసుకుపోయింది.

ఇప్పుడు అతని భార్య-ఇద్దరు కూతుళ్ళు—ఒక కొడుకు ఇంకొంతమంది బంధువులు, ఆ శవంమీదపడి ఒకటే యేడుపు.

ఆ యేడుపు ఒక్క బజారుకే కాకుండా నాలుగైదు

వీధులవరకూ వినపడుతున్నది. అందులో విష్ణుమూర్తి పెద్ద కూతురు సుశీల గొంతు బావురు కప్పగొంతులా వుంటుంది. బొంగురుగా ఎంత దూరానికో మైకులో అరిచినట్టు వినపడుతుంది. పైగా ఎక్కువసేపు ఏడవటంవల్ల గొంతు మరింత బొంగురుపోయి రీ సవుండ్ ఇస్తోంది.

పక్కింట్లో వుంటున్న లెక్చరర్ రంగారావు—విష్ణుమూర్తి ముఖ్యమైన బంధువుల ఎడ్రసులు తీసుకుని వాళ్ళందరికీ టెలిగ్రాములు ఇవ్వటానికి అరగంట క్రితమే సైకిలు మీద వెళ్ళాడు.

విష్ణుమూర్తి పెద్దకొడుకు ఆదిలాబాదులో ఓ ప్రభుత్వ ఆఫీసులో పనిచేస్తున్నాడు. అతనికి కూడా టెలిగ్రాం ఇచ్చాడు రంగారావు.

రెండో కొడుకు జనార్దనానికి ఇంకా పెళ్ళికాలేదు. రెండో కూతురు శకుంతలకు కూడా పెళ్ళి కాలేదు. ప్రస్తుతం వాళ్ళందరూ ఇంట్లోనే వున్నారు.

అసలు విష్ణుమూర్తికి గుండెపోటు వస్తుందనీ—ఇలా అర్ధంతరంగా టపాకడతాడనీ యెవ్వరూ అనుకోలేక పోయారు. ఆయనకు ఆ వూళ్లో చెట్టుకింద ప్లీడరుగా మంచి పేరు వుంది.

అందుకే ప్లీడరు విష్ణుమూర్తి చావు వార్త అరగంటలోనే ఆరు మైళ్ళవరకు వ్యాపించింది. అతనిలాటి చెట్టుకింద ప్లీడర్లు—చెట్టుమీద ప్లీడర్లు అంతా వరుసగా రావటం మొదలుపెట్టారు.

బాగా చీకటి పడిపోయింది. యెవరో లైటు స్విచ్ నొక్కారు. దీపం వెలిగింది.

వరండాలో పడుకోబెట్టారు విష్ణుమూర్తి శవాన్ని.

ప్రశాంతంగా వున్నది అతని మొహం.

జనం వస్తున్నారు. శవాన్ని చూసి వెళుతున్నారు. చూస్తుండగానే బాగా చీకటిపడిపోయింది.

ఎనిమిది—తొమ్మిది .... పది .... పదకొండు గంటలు దాటింది.

ఏడ్చి అలసిపోయిన వాళ్ళు మవునంగా మనసులోనే దైవప్రార్థన చేస్తున్నట్టు రోదించటం మొదలుపెట్టారు. రావలసిన ముఖ్య బంధువులు ఇంకా రాలేదు.

ఉన్నట్టుండి మేఘాలు కమ్ముకొచ్చాయి. చలిగాలి విసురుగా కొట్టింది. పదినిముషాల తర్వాత వర్షం మొదలయింది. క్షణాలమీద అది ఉధృతంగా మారిపోయింది.

జల్లు పడుతోందని వరండాలో శవానికి దగ్గరగా కూర్చున్న మనుషులు కొంచెం లోపలకు జరిగారు.

విష్ణుమూర్తి మీద కూడా జల్లు పడుతోన్నది. అయినా అతను చనిపోయాడు కాబట్టి బాధలేదు.

ఎక్కడో పిడుగు పడింది. ఆ తర్వాత రెండు నిమిషాలకు ఉన్నట్టుండి కరెంటు పోయింది.

అంతా చీకటి. గాఢాంధకారం.

"దీపం వెలిగించండి" యెవరో ఒకామె అన్నది.

"వెధవ కరెంటు ఇప్పుడే పోవాలా?" అన్నది విష్ణుమూర్తి రెండో కూతురు.

"అగ్గిపెట్టె యెక్కడ వుంది?" యెవరో అడిగారు. పదినిముషాలు గడిచాయి.

దీపం వెలిగించబోతున్నప్పుడు కరెంటు వచ్చింది.

దీపాలు వెలిగాయి.

ఒక్కసారి అంతా షాక్ కొట్టినట్టు అయిపోయారు. స్ట్రెచరు విష్ణుమూర్తి శవం అక్కడ లేదు. అక్కడంతా

ఖాళీగా వున్నది.

అందరూ భయంతో ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

అంతే! ఒక్కసారి కోరస్ లా అంతా పెద్దగా కేకలు మొదలు పెట్టారు.

## 2

జనార్దనం_ అతని అన్నయ్య ప్రకాశం పోలీసుస్టేషన్ లోకి అడుగుపెట్టారు. తెల్లవారు జామున నాలుగు గంటలకు అదిలాబాదువించి వచ్చాడు ప్లీడరు విష్ణుమూర్తి పెద్దకొడుకు ప్రకాశం.

లోపల ఇన్ స్పెక్టర్ యేదో ఫైలు చూసుకుంటున్నారు. ఇద్దరు కాన్ స్టేబుళ్ళు ఆ పక్కగా నిలబడి వున్నారు.

వీళ్ళిద్దరు వెళ్ళగానే "ఎవరు మీరు? యెందుకోసం వచ్చారు?" అనడిగారు కాన్ స్టేబుళ్ళు.

అప్పుడే ఇన్ స్పెక్టర్ సూర్యం తలెత్తి ఆ అన్న దమ్ములను చూశాడు.

సోదరులిద్దరూ ఇన్ స్పెక్టర్ కి నమస్కారంచేసి వాళ్ళ పేర్లు చెప్పి మేమిద్దరం ప్లీడరు విష్ణుమూర్తిగారి కొడుకులం. రాత్రి చనిపోయిన మా నాన్నగారి శవం కరెంటు పోయినప్పుడు మాయమైపోయింది. ఆ విషయమై మీకు రిపోర్టు ఇవ్వటానికి వచ్చాము" అన్నారు.

"ఏమిటీ....శవం మాయం కావటమా?!" అని జంటగా ఆశ్చర్యపోయారు రక్షకభటులు.

ఇన్ స్పెక్టర్ సూర్యం వాళ్ళని కూర్చోమని "అంతా వివరంగా చెప్పండి....ప్లీడరు విష్ణుమూర్తిగారు మా అందరికీ బాగానే తెలుసు. కోర్టులో కలుసుకుంటుంటాము.

అసలు ఆయన చనిపోవటమే నాకు ఆశ్చర్యంగా వున్నది. పైగా శవం కూడా మాయం కావటమా?!" అన్నాడు.

కుర్చీల్లో సర్దుకుని కూర్చున్నాక తర్వాత జనార్దనం గొంతు సవరించుకుని వస్తున్న దుఃఖాన్ని బలవంతాన ఆపుకుంటూ — పదకొండు గంటలు దాటుతున్నప్పుడు వర్షం రావటం కరెంటు పోవటం—మళ్ళీ కరెంటు వచ్చినప్పుడు చూస్తే తండ్రి శవం కనిపించకపోవటం గురించి వివరంగా చెప్పాడు.

"ఇదెక్కడి వింత? యెక్కడో అమెరికాలో శవాలు మాయం కావటం గురించి యెప్పుడో విన్నాను కాని ఇండియాలో కూడా శవాలు మాయం అవుతున్నాయా!" అన్నాడు ఓ కానిస్టేబుల్—అతడి పేరు చెన్నయ్య. మూడు నాలుగులు.

"శవం ఒంటిమీద యేమయినా నగలు వున్నాయా బాబూ" అనడిగాడు రెండో కానిస్టేబులు. అతని పేరు శివయ్య. నెంబరు మూడు ఒకటి మూడు.

అతనలా అనగానే చెన్నయ్య పెద్దగా నవ్వి, "ప్లీడరు విష్ణుమూర్తిగారు లేడీ అనుకున్నావా? వంటిమీద నగలు వుండటానికి" అన్నాడు.

వెంటనే ఇన్‌స్పెక్టర్ కలగజేసుకుని "ఆపండి మీ సుత్తి....కొంచెంసేపు మాట్లాడకండి" అని ప్రకాశం కేసి చూసి "మీరు చెప్పినదంతా విన్నాను. అంతా అర్థమయ్యింది. అయితే నాకు కొన్ని అనుమానాలు వున్నాయి. వాటిని నేను తీర్చుకోవాలి" అన్నాడు.

"అడగండి సార్" అన్నాడు ప్రకాశం.

"మీ నాన్నగారికి బద్ధశత్రువులు యెవరయినా వున్నట్టు మీకు తెలుసా?"

"తెలీదండి .... ఆయన కోర్టులో కూడా గట్టిగా వాదించలేదండి .... అందుకే మా నాన్నకు పెద్దగా ప్రాక్టీసు కూడా లేదు. ఆయన్ని చాలామంది చెట్టుకింద ప్లీడరు అంటారు. మా నాన్న నలుగురితో స్నేహంగా వుండే మనిషి....అలాంటి వ్యక్తికి ఆయన శవాన్ని కూడా మాయంచేసి అంత్యక్రియలు జరగకుండా చూసేంతటి శత్రువులు వున్నారంటే నేను నమ్మను" అన్నాడు.

"నేను కూడా నమ్మను" అన్నాడు జనార్దనం.

"సరే ఇద్దరూ నమ్మకద్దు .... అయితే మీ ఇద్దరికీ శత్రువులు వున్నారా? ఒకవేళ మిమ్మల్ని ఏడిపించటానికి యెవరయినా ఈ పని చేశారేమో!" అన్నాడు యిన్స్పెక్టర్.

"లేరు సార్ ....ఆ తండ్రి కడుపున పుట్టిన మాకు శత్రువులు వుంటారా?" అన్నాడు ప్రకాశం.

"మరి ఎవరికి వున్నారయ్యా శత్రువులు—మీ నాన్న శవాన్ని మాయం చెయ్యటానికి" అన్నాడు చెన్నయ్య.

ఇన్స్పెక్టర్ అతడికేసి కోపంగా చూసేసరికి "సార్ ఇందులో ఏదో మిస్టరీ వుంది. మీరు కేసు రిజిష్టరు చేసుకోండి. ఈ మాయమైన శవం మిస్టరీ ఏమిటో మేము తేలుస్తాం" అన్నాడు చెన్నయ్య.

"అవును సార్ .... నేర పరిశోధనలో మా యిద్దరికీ వున్న అనుభవం యేమిటో మీకు తెలుసు. ఈ వ్యవహారాన్ని మా ఇద్దరికీ వదిలెయ్యండి" అన్నాడు శివయ్య.

సరేనన్నట్టు తలవూపాడు సూర్యం.

"ఏమిటీ.... ఈ మామూలు కానిస్టేబుళ్ళు మా నాన్న శవం గురించి దర్యాప్తుచేస్తారా?" అనడిగాడు ప్రకాశం.

"ఏమిటి మీరనేది? మా ఇద్దరి సంగతి మీకు తెలిసి

నట్టులేదు. ఇదిగో ఈ చిన్న పుస్తకం చదవండి మీకే అర్థమవుతుంది" అని చెన్నయ్య నిక్కరు జేబులోనించి ఓ ఆరు పేజీల పుస్తకంతీసి ప్రకాశానికి ఇచ్చాడు.

"ఇదేమిటి?" అన్నాడు జనార్దనం.

"మేమిద్దరం కలిసి పరిశోధించిన కేసుల వివరాలు.... ఎంతమంది హంతకులను — దొంగలను—వ్యభిచారులను చట్టానికి పట్టిచ్చిందీ ఇందులో వివరంగా వుంది. వంద కేసులు పూర్తయిన సందర్భంగా ఓ వారం క్రితమే ఈ పుస్తకాన్ని అచ్చు వేయించాము" అన్నాడు శివయ్య.

ఆ పుస్తకాన్ని జేబులో పెట్టుకున్నాడు ప్రకాశం తర్వాత చదువుదామని.

"సరే....మీ ఎడ్రసు ఇచ్చి వెళ్ళండి. నేను ఈ విషయం గురించి దర్యాప్తు చేస్తాను. వీలయినంత త్వరలో మీ నాన్న శవాన్ని పట్టుకుని మీకు అప్పగిస్తాము" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"థాంక్స్ సార్....ఎలాగయినా త్వరలో మీరు మా ఫాదర్ గారి శవాన్ని మాకు అందజెయ్యండి. లేకపోతే టెలిగ్రాములు అందుకుని మా ఇంటికి వచ్చే బంధువులకు మేము జవాబులు చెప్పలేక చావాలి" అన్నాడు జనార్దనం.

"అలాగే....నిర్భయంగా వెళ్ళిరండి...." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

సోదరులు నీరసంగా స్టేషన్‌లోనించి బయటకు వచ్చారు. వాళ్ళు రోడ్డుమీదకు రాగానే కానిస్టేబుళ్ళిద్దరూ వాళ్ళ వెనుకే పరిగెత్తుకుంటూ వచ్చి "మీరు ఆ పుస్తకాన్ని తప్పక చదవండి. మా గురించి మీకు పూర్తిగా అర్థమవుతుంది" అన్నారు.

"సర్లే బాబూ....తప్పకుండా చదువుతాము. ముందు మా నాన్న శవం గురించి ఆమాట తియ్యండి" అన్నాడు ప్రకాశం.

"ఇప్పుడదే మేము రంగంలోకి దిగుతున్నాము. మీరు దిగులు పడకండి. అన్నట్టు మీరు మా మామూలు యివ్వకుండా వెళ్ళిపోతున్నారేమిటి?" అన్నాడు శివయ్య.

"మామూలా! అసలే మేము మా నాన్న శవంపోయిన దుఃఖంలో వుంటే" అన్నాడు జనార్దనం.

"మామూళ్ళకి అలాంటి భేదాలుండవు .... త్వరగా ఇచ్చేయండి .... మేము దర్యాప్తు ప్రారంభించాలి" అన్నాడు చెన్నయ్య.

ఇక ఈ రక్షకభటులు వదిలేట్టుగా లేరని ప్రకాశం జేబులోనించి ఓ ఇరవై రూపాయలు తీసి వాళ్ళకి ఇచ్చి పంపించాడు.

## 3

కానిస్టేబుళ్ళు చెన్నయ్య—శివయ్యలు హుషారుగా ప్లీడరు విష్ణుమూర్తి శవం గురించిన దర్యాప్తుకు బయల్దేరారు.

"మన పరిశోధన ఎక్కడినించి మొదలు పెడదాం?" అని అడిగాడు శివయ్య.

"ఎక్కడినించేమిటి? మాయమైన శవాన్ని ఎవరయినా ఏం చేసుకుంటారు? ఏ సెంటర్లోనో పెట్టుకుని 'దిక్కులేని శవం బాబూ' అని అడుక్కుంటూ వుంటారు....ముందు మనం అల్లాంటి సెంటర్లలో వెతకాలి" అన్నాడు చెన్నయ్య.

"సరే పద" అన్నాడు శివయ్య బీడీ వెలిగించుకుని—

ఆ దర్యాప్తుదారు లిద్దరూ ముందుగా ఓ థియేటర్

సెంటర్ కి వెళ్ళారు. అక్కడ వాళ్ళకి శవాన్ని ముందు పెట్టుకుని అడుక్కుంటున్న మనుషులెవ్వరూ కనిపించ లేదు.

వాళ్ళు అక్కడినించి మరో సెంటర్ కి వెళ్ళారు.

అక్కడ ఓ శవాన్ని ముందు పెట్టుకుని "దిక్కు లేనోడు బాబూ....దరమం చేయండి బాబూ" అని ఇద్దరు మనుషులు పెద్దగా అరుస్తున్నారు.

ఆ శవానికి నిండుగా ముసుగు కప్పి వున్నది.... చుట్టూ పైసల బిళ్ళలు పడివున్నాయి.

"ఒరేయ్ .... ఈ శవం యెవరిదిరా?" అన్నాడు చెన్నయ్య.

"దిక్కు లేనోడిది బాబూ."

"వాడి పేరేమిటిరా?"

"పేరు తెలీదు బాబూ."

"ముందు శవంమీద ఆ గుడ్డను తీసెయ్యండి.... చూడాలి" అన్నాడు శివయ్య చేతిలో వున్న లాఠీ వూపుతూ—

ఒకడు శవంమీది గుడ్డను తీసేశాడు. యెవడో ముస లాడు. సన్నగా వున్నాడు.

"ఈయన ప్లీడరుగారు కాదు. ఈ ముసలోడికి నల్ల కోటు లేదు" అన్నాడు శివయ్య.

"నీ మొహం....ప్లీడరుగారయితే చచ్చిపోయేముందు నల్లకోటు వేసుకుని చచ్చిపోతాడా?" అని అడిగాడు చెన్నయ్య.

"నిజమేననుకో....అయినా ప్లీడరు గారికి యాభై యేళ్ళు లేవుకదా.... ఈ ముసలోడికి అరవై యేళ్ళపైన వున్నట్టున్నాయి....పైగా వీడు ముష్టివెధవలా వున్నాడు."

"ఒకేయ్....ఏమాత్రం శనూలయ్యింది" అన్నాడు శివయ్య వాళ్ళని.

"ఎంతో కాలేదు బాబూ..ఇదిగో తమరి మామూలు" ఓ రెండు రూపాయల నోటును ఇవ్వబోయాడు.

"ఛీ.... వెధవా .... పోలీసులంటే ఏమనుకుంటున్నావురా....మా సంగతి నీకు తెలీదు. మేమొక ముఖ్యమైన కేసు దర్యాప్తులో ఇటు వచ్చాం....వద్దులే....ఆ రెండు రూపాయలూ మీరే వుంచుకోండి" అని అక్కడినించి వెనక్కి తిరిగారు ఇద్దరూ—

వాళ్ళకి ఓ గంట తర్వాత పాడెమీద వూరేగుతూ వెళుతున్న ఓ శవం కనిపించింది.

చెన్నయ్య గబగబా అక్కడకు వెళ్ళి "ఈ శవం ఎవరిది?" అని అడిగాడు శవం వెనుకే వెళుతున్న మనుషుల్ని.

"ప్లీడరుగారిది" అన్నాడొకాయన.

"ఆ... ప్లీడరుగారిదా? యెక్కడిది మీకీ శవం?" అన్నాడు శివయ్య ఆదుర్దాగా.

"ఎక్కడిదేమిటండీ? ఈయన నాకు మేనమామ.... ఈ రోజు ఉదయమే ఉబ్బసం రోగంతో చచ్చిపోయాడు....మా చేతులమీదగానే పోయాడు."

"ఇంతకీ ఈయన పేరు విష్ణుమూర్తేనా?" అన్నాడు చెన్నయ్య.

"విష్ణుమూర్తి కాదండీ ...అన్నారావు.... డెభ్భై ఏళ్ళ మనిషి."

"ఎందుకయినా మంచిది ...శవాన్ని దించి ముసుగు తీసి చూపించండి" అన్నాడు చెన్నయ్య.

"ఇదెక్కడి గొడవ? ముసుగుతీసి చూపించేదేమిటి?

ఈ శవం మా అన్నారావుగారిదంటే మీకు నమ్మకం లేదా? ఇంకొకరి శవాన్ని శ్మశానానికి మోసుకు వెళ్ళవలసిన అవసరం మాకేమిటి?" అన్నాడొకాయన కోపంగా.

"అయ్యా....మీరు మమ్మల్ని అపార్థం చేసుకోవద్దు. ఇప్పుడు మాయమైన ప్లీడరు విష్ణుమూర్తిగారి శవం దర్యాప్తులో వున్నాము. అందువల్ల ఇలా అడుగుతున్నాం" అన్నాడు శివయ్య.

"ఏమిటీ....శవం మాయమయ్యిందా?"

"అవును....నిజంగా మాయమయ్యింది" అంటూ వాళ్ళకి అంతా చెప్పేశారూ ఇద్దరూ—

"వింతగా వుంది....శవాలను ఏం చేసుకుంటారో.... సరే....శవాన్ని మధ్యలో దించటం బావుండదు.... స్మశానందాకా రండి.... అక్కడే చూద్దురు" అన్నాడాయన.

సరేనని వాళ్ళతో స్మశానానికి వెళ్ళి అక్కడ ఆ శవం ముసుగుతీసి చూసి ఆ శవం ప్లీడరు విష్ణుమూర్తిగారిది కాదని రుజువు చేసుకున్నారు. మళ్ళీ దర్యాప్తుకు బయలుదేరారు.

గంట తర్వాత వాళ్ళకు థియేటర్ సెంటర్లో శవాన్ని పెట్టుకుని అడుక్కున్న యిద్దరు మనుషులు బాగా తాగి తూలుతూ పాటలు పాడుకుంటూ యెదురొచ్చారు.

"ఒరేయ్....ఆ శవాన్ని ఏం చేశారురా?" అడిగాడు చెన్నయ్య ఒకడిని.

"ఇంకెక్కడి శవం కానిస్టేబులుగారూ....దాన్ని ఆ మనుషులు పాతిక రూపాయలిచ్చి తీసుకుపోయారుగదా" అన్నాడొకడు.

"ఆ మనుషులు యెవర్రా?"

"ఎవరో తెలీదు బాబూ. ఇద్దరు మనుషులు వ్యానులో వచ్చారు. పాతిక రూపాయలు మా చేతిలో పెట్టి శవాన్ని వ్యానులో వేసుకొని వెళ్ళిపోయారు."

"ఎట్లా వున్నార్రా వాళ్ళు?" శివయ్య అడిగాడు.

"నల్లటి బట్టలు వేసుకున్నారు. లావుగా పొడుగ్గా వున్నారు....ఇద్దరికీ నెత్తిమీద టోపీలు వున్నాయి."

"ఆ వ్యాను నెంబరు చూశారా?"

"మాకు ఆ నెంబర్లతోటి పనేం బాబూ...రూపాయలు చేతిలో పడగానే మేము వెళ్ళిపోయాం."

"మళ్ళీ ఆ మనుషులను చూస్తే గుర్తుపట్టగలరా?" అడిగాడు శివయ్య.

"ఆ....ఎంతమందిలో వున్నా గుర్తుపట్టేస్తాం."

"అయితే — ఈసారి వాళ్ళు యెక్కడయినా కనపడితే స్టేషన్‌కి వచ్చి మాకు చెప్పండి."

"అట్టాగే బాబూ" అని వెళ్ళిపోయారు వాళ్ళు పాటలు పాడుకుంటూ —

"ఓయ్ చెన్నయ్యా....ఇప్పటికి మన పరిశోధన ఒక దార్లో పడింది. వీళ్ళు చెప్పిందాన్నిబట్టి ఈ ఊళ్ళో యెవరో మనుషులు శవాలను యెత్తుకెళుతున్నారు.... వీలయినచోట శవాలను కొంటున్నారు. వాళ్ళకు శవాలతో ఏదో పని వున్నది. కాబట్టి వెంటనే మనం తెలుసుకున్న ఈ విషయాన్ని మన ఇన్‌స్పెక్టర్ గారికి తెలియజెయ్యాలి" అన్నాడు శివయ్య.

"అవును....ఇది చాలా ముఖ్యమైన విషయం.... ఇందువల్ల మనం చావబోయే వాళ్ళకి ముందుగా ఓ హెచ్చరిక కూడా చేయాలి....వాళ్ళ శవం మాయమవ

ఉండా ముందు జాగ్రత్తలు తీసుకోమని."

ఆ రక్షకభటులిద్దరూ తమతమ సైకిళ్ళను గబగబా పోలీసుస్టేషన్ కేసి తొక్కటం మొదలుపెట్టారు.

## 4

గతుకుల రోడ్డుమీద నల్లరంగు ఎంబాసిడర్ కారు దుమ్ము లేపుకుంటూ వస్తోంది. రాత్రి కావటంవల్ల— చీకటిగా వుండటంతో దుమ్ము కనపడటంలేదు. ఆ కారు లైట్ల వెలుతురు దూరానికి పడుతోంది.

ఆ కారులో డ్రయివర్ కాకుండా మరో ముగ్గురు మనుషులు వున్నారు. ఆ ముగ్గురిలో బతికి వున్నవాళ్ళు ఇద్దరే. మరో మనిషి శవరూపంలో వున్నాడు.

ఆ శవం పేరు నిత్యానందం. ఆయన చుట్టం చూపుగా ఓ బంధువు ఇంటికి వెళ్ళి ఆ రోజు మధ్యాహ్నం అక్కడే గుండె ఆగిపోయి చనిపోయాడు. ప్రస్తుతం ఆయన శవాన్ని బంధువులు యిద్దరు ఆ కార్లో వేసుకుని ఆయన ఇంటికి చేర్చటానికి తీసుకువస్తున్నారు.

"ఇంకా ఎన్ని మైళ్ళు వెళ్ళాలి?" అనడిగాడు ఒకాయన డ్రయివర్ని.

"దగ్గరలోకి వచ్చేశాం సార్. ఇంకో నాలుగు మైళ్లలో ఊరు వచ్చేస్తుంది. దారి బావుండకపోవటంతో మనకు యింత టైము తీసుకుంది. లేకపోతే ఈ సరికి వెళ్ళిపోయేవాళ్ళం" అన్నాడు డ్రయివరు.

"ఇదేం రోడ్డు....ట్రాఫిక్ బాగా తక్కువగా వున్నది. కనీసం లారీలు కూడా ఎదురురావటంలేదు" అన్నాడు ఇంకో ఆయన మళ్ళీ.

"ఇప్పుడు ఈ రోడ్డును యెవ్వరూ ఉపయోగించటం లేదండీ. ట్రాఫిక్ తక్కువగా వుంటే త్వరగా చేరుకో

వచ్చునని ఈ రోడ్డున తీసుకువచ్చాను. కానీ రోడ్డు బాగా లేదు" అన్నాడు డ్రయివరు ముందుకు చూస్తూ—

ఒక నిమిషం తర్వాత "అదిగో ఏదో వెహికిల్ వస్తోంది .... లైట్లు కనపడుతున్నాయి" అన్నాడు డ్రయివర్.

"అవును. బహుశా లారీ అయివుంటుంది" అన్నాడు ఒకాయన. ఆయన పేరు బ్రహ్మారావు-ఆయన నిత్యానందం ఊరు మనిషి.

"కాదు....ఏదో చిన్న కారులాంటిది" అన్నాడు రెండో మనిషి సుందర్రావు.

ఐదు నిముషాలు గడిచేసరికి ఆ వాహనం కారు దగ్గరగా వచ్చేసి వెంటనే రోడ్డుకు అడ్డంగా ఆగిపోయింది.

ఆగిన వ్యానులోనించి లావుగా పొడుగ్గా వున్న ఇద్దరు మనుషులు గబగబా కిందికిదూకి ఎంబాసిడర్ కారు దగ్గరకు వచ్చారు.

"ఎవరు మీరు? ఎందుకు వ్యానును రోడ్డుకు అడ్డంగా ఆపారు?" అన్నాడు డ్రయివర్.

వాళ్ళిద్దరు గబుక్కున జేబుల్లోనించి నల్లగా నిగనిగ లాడుతున్న రివాల్వర్లను బయటకుతీసి "మర్యాదగా అందరూ కిందకు దిగండి. ప్రతిఘటించడానికి ప్రయత్నిస్తే ప్రాణాలు పోతాయి" అన్నారు కర్కశంగా.

రివాల్వర్లకు భయపడి మాట్లాడకుండా ముగ్గురూ కిందికి దిగి చేతులెత్తారు.

ఆ ఇద్దరిలో ఒకడు లోపలకు తొంగిచూసి "జాన్... లోపల శవం వున్నది" అన్నాడు.

"గుడ్ .... దాన్ని మన వ్యాన్‌లోకి చేరవెయ్యి"

అన్నాడు డాన్ ఉత్సాహంగా—జాన్‌తో—

ఆ మాట వినగానే బ్రహ్మేరావు—సుందర్రావులతో పాటు డ్రయివర్ కూడా ఉలిక్కిపడ్డాడు.

శవం మాట వినగానే వ్యాన్ డ్రయివర్ కూడా కిందికి దిగి వచ్చాడు.

తర్వాత ఆ ఇద్దరూ డోర్ తెరిచి శవాన్ని బయటకు లాగారు.

బ్రహ్మేరావు షాక్ నించి తేరుకుని "ఆ శవాన్ని తీసుకెళ్ళకండి....అయినా శవాన్ని మీరేం చేసుకుంటారు? కావాలంటే డబ్బులు తీసుకోండి" అన్నాడు ఆదుర్దాగా.

"డాన్....ముందు వాడి నోరు మూయించు" అన్నాడు జాన్ శవాన్ని వ్యాన్ దగ్గరకు మోసుకెళుతూ—

డాన్ బ్రహ్మేరావ్ దగ్గరకు వెళ్ళి రివాల్వర్‌ను అతని తలకు ఆనించి "నోర్మూసుకుని నిలబడు....శవాన్నే కాదు మీ దగ్గర వున్న డబ్బుని కూడా తీసుకెళతాం. సరే.... మీ దగ్గర వున్న డబ్బును తీసి ఇలా ఇవ్వండి.... మొండికేస్తే ప్రాణాలు పోతాయి" అన్నాడు.

బ్రహ్మేరావు—సుందర్రావుకేసి చూశాడు.

ఇంతలో జాన్ కూడా అక్కడికి వచ్చి సుందర్రావు వీపుకు రివాల్వర్‌ని నొక్కిపట్టి "నీ జేబులో వున్న కరెన్సీ నోట్లను బయటకు తియ్యి" అన్నాడు.

డ్రయివర్ ముందుగా తన జేబులో వున్న వంద రూపాయల చిల్లరను బయటకు తీశాడు.

తర్వాత బ్రహ్మేరావు — సుందర్రావు తమ పర్సుల్లో వున్న డబ్బును జాన్‌కి, డాన్‌కి ఇచ్చేశారు.

"వెరీ గుడ్....మీరు చక్కగా ప్రవర్తించారు. ఇక మా పని అయిపోయింది. అయితే మీరు వెంటనే మా

వెంట పడకుండా వుండటానికి ఇప్పుడు నేను ఒక పని చేస్తాను" అని డాన్ ఎంబాసిడర్ దగ్గరకు వెళ్ళి ఐదు నిముషాల తర్వాత అందులో కొన్ని తీగెలను తెంచి వచ్చేశాడు.

మరో రెండు నిముషాలకు జాన్-డాన్‌లు ఎక్కగానే వ్యాను స్టార్టయి వెనక్కి తిరిగి రివ్వున దూసుకుపోయింది.

"ఆశ్చర్యంగా వుంది....వీళ్లెవరు? ఆ శవాన్ని తీసు కెళ్ళి ఏం చేసుకుంటారు?" అన్నాడు సుందర్రావు.

"వాళ్ళేం చేసుకుంటారో మనకు అనవసరం .. ఇప్పుడు మనం నిత్యానందం భార్యా పిల్లలకు ఏమని చెప్పాలి? శవాన్ని యెవరో మనుషులు యెత్తుకెళ్ళారంటే వాళ్ళు నమ్ముతారా?" అన్నాడు బాధగా—

డ్రయివర్ టార్చిలైటుతీసి కారును బాగుచెయ్యటం మొదలుపెట్టాడు.

అంతా చీకటి—

దూరంగా గతుకుల రోడ్డుమీద వ్యాను వెళుతున్న చప్పుడు వినపడుతోంది.

"ఇంతకీ నువ్వు ఆ వ్యాన్ నెంబర్ చూశావా?" అన్నాడు బ్రహ్మరావు.

"చూల్లేదు" అన్నాడు సుందర్రావు.

కారు రిపేరు జరుగుతోంది.

## 5

కానిస్టేబుళ్ళు పోలీసు స్టేషన్ ముందు సైకిళ్ళు దిగి లోపలకు వెళ్ళేసరికి యస్.ఐ. సూర్యం యెక్కడికో బయల్దేరబోతున్నాడు.

వీళ్ళిద్దరినీ చూసి "దర్యాప్తులో వున్నారా? లేక పోతే రోడ్లమీద తిరుగుతున్నారా?" అనడిగాడు.

"లేదు సార్.. దర్యాప్తులోనే వున్నాం. అంతే కాదు—మాయమైన శవం గురించి ఓ ముఖ్యమైన ఇన్ఫర్మేషన్ కనుక్కున్నాం" అన్నారు ఇద్దరూ ముక్త కంఠంతో—

"నిజంగానా!"

"అవున్సార్ ...." అంటూ తమకు తెలిసిన విషయం గురించి సూర్యానికి చెప్పేశారు.

"అయితే ఈ శవాల దొంగలు ఆ ఇద్దరూ అన్న మాట."

"అవున్సార్ ....ఆ మనుషులు మళ్ళీ కనపడితే మన స్టేషన్కు వచ్చి రిపోర్టు చేస్తామని ఆ శవాన్ని అమ్మిన మనుషులు చెప్పారు. అంతేకాదు .... మేము కూడా ఆ దొంగ వెధవలకోసం ఉచ్చులు పన్నాలని అనుకుంటున్నాము" అన్నాడు చెన్నయ్య.

"రైట్ ....అయితే మిగిలిన స్టేషన్లకు కూడా ఈ ఇన్ఫర్మేషన్ పంపించాలి" అన్నాడు యస్.ఐ.

"అంతే కాదు సార్ ....చావబోతున్న వాళ్ళకు మనం ఒక హెచ్చరిక కూడా చేయాలి. చచ్చిన తర్వాత తమ శవాలను ఈ దొంగలు ఎత్తుకుపోకుండా తగు చర్యలు తీసుకుని మరీ చావాలి" అన్నాడు శివయ్య.

"సర్లే....ఇది సీరియస్ మేటర్. మనం జోక్గా మాట్లాడుకోగూడదు" అని కసిరాడు సూర్యం—శివయ్యను.

వాళ్ళు మాట్లాడుకుంటున్న తరుణంలో స్టేషన్ ముందు రివ్వున దూసుకువచ్చి ఆగిపోయింది నల్లని ఎంబాసిడర్ కారు.

అందులోనించి డ్రయివర్-బ్రహ్మారావు—సుందర్రావు

గబుక్కున కిందికి దూకి స్టేషన్‌లోకి పరుగుదీశాను.

లోపలకు వస్తూనే సుందర్రావు "నమస్కారం ఇన్‌స్పెక్టర్ గారూ....గొప్ప దారుణం జరిగిపోయింది" అని శోకం పెట్టేశాడు.

"ముందు కూర్చోండి. యెవరు మీరు? యేమిటా దారుణం....వివరంగా చెప్పండి. అలా కంగారుగా చెబితే నాకు ఏమీ అర్థంకాదు" అన్నాడు యస్.ఐ.

"సార్ నిత్యానందం అనే మా బంధువు హార్ట్ ఎటాక్‌తో చనిపోతే—ఆయన్ని కార్లో ఈ ఊరు తీసుకు వస్తున్నాము. ఇంతలో ఈ ఊరు రెండు మైళ్ళు వుందనగా ఎవరో యిద్దరు మనుషులు ఓ వ్యాన్‌లో వచ్చి కార్లో వున్న శవాన్ని, మా దగ్గర వున్న డబ్బుని లాక్కుని వ్యాన్‌లో వెళ్ళిపోయారు" అన్నాడు బ్రహ్మారావు.

"వాళ్ళేసార్ ఆ దొంగ వెధవలు .... అనుమానం లేదు" అన్నాడు శివయ్య.

"వాళ్ళు మీకు తెలుసా? వాళ్ళు మీకూ డా కనిపించారా?" అన్నాడు సుందర్రావు.

"వాళ్ళు మా కంట పడితే యెప్పుడో పట్టుకునే వాళ్ళం. ఇంతకుముందే మాకు ఇద్దరు దొంగల గురించి ఇన్ఫర్మేషన్ అందింది. వాళ్ళు ఇక్కడకూడా ప్లీడరు విష్ణుమూర్తి శవాన్ని క్రితం రాత్రే ఎత్తుకుపోయారు. ఇక వాళ్ళు మా బారినుంచి తప్పించుకోలేరు" అన్నాడు చెన్నయ్య లాఠీ వూపుతూ.

"మీరు ఆ వ్యాన్ నెంబర్ చూశారా?" అడిగాడు యస్.ఐ.

"చూళ్ళేదు సార్ ....కాని ఆ ఇద్దరి పేర్లు మాత్రం

తెలిశాయి. ఒకడి పేరు జాన్ .... రెండోవాడి పేరు డాన్."

"భలే సేర్లు. వాళ్ళ ఇన్ఫర్ మేషన్ తెలిసేట్టుగా ఇంకే దయినా మీ దగ్గర మాట్లాడుకున్నారా?" అన్నాడు సూర్యం.

"లేదు సార్ ....మాకంతా అయోమయంగా వున్నది. అసలు శవాలను తీసుకెళ్ళటం ఏమిటి? శవాలను ఏంచేసు కుంటారు? ఇప్పుడు నిత్యానందంగారి భార్యా పిల్లలకు మేము ఏమని చెప్పాలి? ఆయన శవాన్ని ఎవరో దొంగలు ఎత్తుకుపోయారంటే వాళ్ళు నమ్ముతారా?" అన్నాడు బ్రహ్మారావు దీనంగా—

"జరిగిన సంగతి చెప్పండి. ఒకవేళ వాళ్ళు నమ్మక పోతే మాకు కబురు చెయ్యండి. మేము వాళ్ళకు నచ్చ చెబుతాము. మీరు వర్రీ అవకండి. త్వరలోనే ఆ జాన్‌నీ డాన్‌నీ పట్టుకుని శవాలు మాయం అవకుండా చూస్తాము" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఇంతకీ మరి మా నిత్యానందంగారి శవం...." అని ఆగిపోయాడు సుందర్రావు.

"ఇప్పుడు మా కానిస్టేబుళ్ళు ఆ దర్యాప్తులోనే వున్నారు. పనిలో పనిగా మీ నిత్యానందంగారి శవాన్ని కూడా వాళ్ళు వెతుకుతారు. ఒకవేళ మీకు ఆ జాన్—డాన్ ఎక్కడయినా కనపడితే మాకు తెలియజెయ్యండి. వెంటనే పట్టుకుంటాం."

"సరేనండీ.... వెళ్ళొస్తాం" అని బ్రహ్మారావు-సుంద ర్రావు ఇన్‌స్పెక్టర్‌కి నమస్కారంచేసి బయటకు వెళ్ళారు.

వాళ్ళ వెనకే చెన్నయ్య—శివయ్య బయటకు వెళ్ళి "మామూలు ఇవ్వకుండానే వెళ్ళిపోతున్నారే" అన్నారు.

"మామూలా! మామూలు ఇవ్వటానికి మా దగ్గర ఏం మిగిలింది? అంతా ఆ జాన్—డాన్ వెధవలే వూడ్చుకు పోయారు" అన్నాడు సుందర్రావు.

"ఈ దొంగ వెధవలు మా కడుపులు కొడుతున్నారు. ఇందుకోసం ఐనా ఆ ఇద్దరినీ పట్టుకోవాలి" అన్నాడు చెన్నయ్య.

"అవును. మనం ఈ రాత్రికే ఆ జాన్—డాన్‌లను పట్టుకునే ప్లాను ఆలోచించాలి" శివయ్య అన్నాడు.

"తప్పకుండా భోజనం అయిన తర్వాత నువ్వు మా యింటికి వచ్చెయ్యి....కలిసి ఆలోచిద్దాం...." అన్నాడు చెన్నయ్య.

## 6

రాత్రి పన్నెండు గంటలు కావస్తోంది.

అంతటా నిశ్శబ్దంగా వుంది. ఒక్క ఆ భవనంలో తప్ప.

ఆ భవనం ఊరికి బయటగా వుంది. ఇక ఆ తర్వాత అన్నీ పొలాలు. పొదలు పిచ్చిగా పెరిగి వున్నాయి. ఆ భవనం పాడుబడిపోయి ఆ చీకట్లో రాక్షసిలా కనపడు తోంది. భవనం చుట్టూ ఎత్తుగా పెరిగిన చెట్లు ఆ భవ నాన్ని దూరానికి కనపడనీయటంలేదు.

ఒక లారీ ఆ భవనం ముందు ఆగి వున్నది. అందులోకి కొంచెం సన్నగా — పొడుగ్గా వున్న చెక్క పెట్టెలను తీసుకువచ్చి లోడ్ చేస్తున్నారు నలుగురు మనుషులు.

చిన్న టార్చి లైటు—మరో చేతిలో రివాల్వర్ పట్టు కుని దగ్గరుండి ఆ పెట్టెలను లారీలో పెట్టిస్తున్నాడు జాన్.

డాన్ అతనికి కొంచెం దూరంగా నిలబడి సిగరెట్టు

కాల్చుకుంటున్నాడు.

"త్వరగా పని పూర్తిచెయ్యండి" అన్నాడు జాన్ టార్చి ఫోకస్‌ను అటూ ఇటూ కదిలిస్తూ—

పెట్టెలను మోసుకువస్తున్న మనుషులు ఆ చీకట్లో నీడల్లా బరువుగా కదులుతున్నారు.

"పన్నెండు గంటలయ్యేసరికి అంతా రెడీ అయిపోవాలి" అన్నాడు డాన్—జాన్ దగ్గరకు వచ్చి.

"ఇంకా పన్నెండు పెట్టెలు వున్నాయి. ఓ పది నిముషాల్లో అంతా పూర్తవుతుంది."

పదినిముషాలయ్యేసరికి లోడింగ్ పూర్తి అయింది. తర్వాత ఆ పెట్టెలపైన పూర్తిగా ఎండిపోయిన గడ్డి మోపుల్ని వేసి తాళ్ళతో కట్టేశారు.

ఇప్పుడు ఆ లారీని చూసిన యెవరైనా గడ్డి లారీ అనే అనుకుంటారు. అంతేగాని, ఆ గడ్డికింద చెక్క పెట్టెలు వున్నాయనీ—అక్కడినించీ ఓడలో అమెరికా వెళ్ళిపోతాయనీ, యెవ్వరూ వూహించలేరు.

లారీ బయల్దేరబోయేముందు డ్రయివర్‌తో "జాగ్రత్త. యేమాత్రం అజాగ్రత్తగా వున్నా బాస్ మన తోలు వొలిచేస్తాడు.... పోనివ్వు" అన్నాడు జాన్.

వెళ్ళిపోయింది లారీ బరువుగా కదిలి.

లారీ వెళ్ళిపోగానే జాన్-డాన్ లోపలకు వెళ్ళారు.

గదిలో ఫోన్ మ్రోగసాగింది.

జాన్ రిసీవర్ యెత్తి "హల్లో" అన్నాడు. అని వెంటనే అవతలివైపునించి బాస్ గొంతు వినిపించగానే "చెప్పండి బాస్" అన్నాడు.

"లారీ వెళ్ళిపోయిందా?"

"ఇప్పుడే వెళ్ళిపోయింది బాస్.... అంటూ సత్యంగానే

దగ్గరుండి లోడ్ చేయించాము నేను—డాన్."

"గుడ్ ... మీకు మరో ముఖ్యమైన విషయం. ఓగంట క్రితమే బాంబేనించి మెసేజ్ వచ్చింది. అమెరికానించి కొత్త ఆర్డర్ వచ్చిందట. వీలైనన్ని యెక్కువ అస్థిపంజరాలను పంపించమని మెసేజ్....అందువల్ల మీరు ఇంకా చురుగ్గా పనిచేయవలసి వుంటుంది. అందుకు తగిన ప్రతిఫలం మనకు ముడుతుంది. అవసరమైతే బతికివున్న అనాథలనైనా తెచ్చి అస్థిపంజరాలుగా మార్చండి?" అన్నాడు బాస్.

"ఓ.కె. బాస్....ఇంకా యెక్కువ కష్టపడి మీరు చెప్పినట్లే మన బిజినెస్‌ని వృద్ధిలోకి తీసుకువస్తాము" అన్నాడు జాన్.

"డాన్‌తోకూడా ఈ విషయం చెప్పు. ఇప్పుడు మీరు మన వేటకు బయల్దేరుతున్నట్టున్నారు .... అవునా?" అన్నాడు.

"అవును బాస్. ఇప్పుడే బయల్దేరుతున్నాం."

"రైట్....మళ్ళీ తర్వాత ఫోన్ చేస్తాను" అని బాస్ అవతలివైపునించి ఫోన్ పెట్టేశాడు.

జాన్‌కూడా రిసీవర్ పెట్టేసి పక్కనే వున్న డాన్‌తో బాస్ చెప్పిన అమెరికా ఆర్డరు గురించి చెప్పాడు.

"అయితే మొత్తంమీద మనకు—మన బిజినెస్‌కీ మంచి భవిష్యత్తు వుందన్నమాట" అన్నాడు డాన్ మరో సిగరెట్ ముట్టించి.

"తప్పకుండా .... అయితే నాకో అనుమానం.... అమెరికా వెళ్ళిన మన అస్థిపంజరాలు అక్కడ యేం చేస్తాయి?"

"ఏంచేస్తే మనకెందుకు? ఆ అనుమానాలు మనకు రాకూడదు. వాళ్ళకు మన అసిపంజరాలు కావాలి. మనకు వాళ్ళ డబ్బు కావాలి.... అంతే!"

"ఇంతకీ నువ్వు ఆ చెట్టుకింద ప్లీడరు విష్ణుమూర్తిగారి కొడుకులకు వాళ్ళ నాన్న బూడిద పంపించావా?" అడిగాడు జాన్.

"పంపించలేదు. రేపయినా వాళ్ళకు ఆ భస్మం అందజేయాలి పుణ్యనదుల్లో కలుపుకోటానికి" అన్నాడు డాన్.

ఐదు నిముషాలు తర్వాత జాన్ — డాన్ శవాల వేటకు బయల్దేరారు.

## 7

ఉదయం పదిగంటలు దాటుతున్న సమయంలో ప్లీడరు విష్ణుమూర్తిగారి కొడుకులు ప్రకాశం—జనార్దనం సైకిళ్ళేసుకుని హడావిడిగా పోలీసుస్టేషన్‌కు వచ్చారు.

వస్తూనే బయటే కనిపించిన కానిస్టేబుళ్ళను చూసి "ఇన్‌స్పెక్టర్‌గారున్నారా?" అడిగాడు ప్రకాశం.

"ఎందుకు? మీ నాన్నగారి శవం గురించిన ఆచూకీ ఏదయినా తెలిసిందా?" అనడిగాడు చెన్నయ్య.

"మీరేం పోలీసులండీ .... మామూలు కూడా తీసుకున్నారు. వందకేసులు పూర్తయినాయని ఇద్దరూ కలిసి ఒక పుస్తకాన్ని కూడా అచ్చు వేయించుకున్నారు. ఇప్పుడు మా నాన్న శవం దొరికిందా అని మమ్మల్ని అడుగుతున్నారు" అన్నాడు జనార్దనం కొంచెం కోపంగా.

"జస్టు.... ఇన్ఫర్మేషన్ కోసం అడిగాను. ఇదికూడా దర్యాప్తులో ఒక భాగమే. మా పరిశోధన ఇప్పుడిప్పుడే దార్లో పడుతోంది. ఇంతకీ మీరు యెందుకు వచ్చారు?"

అన్నాడు చెన్నయ్య మీసాలు దువ్వుకుంటూ.

"రండి చెబుతాము" అని ఇద్దరూ స్టేషన్‌లోకి నడిచి ఇన్‌స్పెక్టర్ గారికి నమస్కారం చేసి ఆయన ముందు ఓ చిన్న పొట్లాన్ని వుంచారు.

"ఏమిటదిః" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మా నాన్నగారి బూడిద" అన్నాడు ప్రకాశం....

"ఎక్కడిదీ!" ఆశ్చర్యంగా అడిగాడు సూర్యం.

"ఓ అరగంట క్రితం ఎవరో పదేళ్ళ కుర్రాడు మాకు ఈ పొట్లాన్ని తీసుకువచ్చి ఇచ్చాడు. ఎవడో లావుగా— పొడుగ్గా వున్న మనిషి ఈ పొట్లాన్ని మా ఇంట్లో ఇవ్వమని వాడికి ఓ రూపాయి ఇచ్చి వెళ్ళిపోయాడుట. తీరా విప్పిచూస్తే అందులో కొంచెం బూడిద ఒక కాయితం వున్నాయి. దానిమీద 'మీ నాన్న బూడిద' అని రాసి వుంది" అని చెప్పాడు ప్రకాశం యేడుపు మొహంతో.

సూర్యం ఆ పొట్లం విప్పాడు. అందులో బూడిద మధ్య చిన్న కాయితం దానిమీద వంకర టింకర అక్షరాలతో 'మీ నాన్న బూడిద' అని రాసి వుంది....

"ఇదేదో మిష్టరీలా వున్నది.... మీ నాన్నగారి శవాన్ని వాళ్ళెవరో యెందుకు దహనం చేస్తారు? దహనం చేసినా బూడిదను మీకెందుకు పంపిస్తారు? ఏమిటో నాకంతా అయోమయంగా వున్నది. నా సర్వీసులో ఇలాంటి తల-తోకలేని కేసు ఇంతవరకు చూడలేదు" అని విసుక్కున్నాడు ఇన్‌స్పెక్టర్.

"సార్ .... ఈ మిష్టరీ ఏదో మేమిద్దరం ఈ రాత్రికే తేల్చెయ్యాలని అనుకుంటున్నాం. రేపు ఉదయానికి మీకు రిపోర్టు అందజేస్తాం" అన్నాడు చెన్నయ్య.

"రిపోర్టే అందజేస్తారో లేకపోతే బూడిద పొట్లాన్నే అందజేస్తారో.... నాకేమీ అర్థంకావటంలేదు. అందమైన ఆడపిల్లలనయినా ఎత్తుకుపోకుండా ఈ విధవలు శవాలను ఎత్తుకుపోవటం యెందుకు? సరే ఏం చేస్తాం? మీరువెళ్ళి ఆ చితి భస్మాన్ని పవిత్ర జలాల్లో కలిపిరండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ప్రకాశంతో—

"అంతేలెండి....అంతకంటే మేము చెయ్యగలిగింది ఏముంది? మా నాన్నగారి శవాన్ని మా చేతులమీదగా భస్మం చెయ్యలేక పోయాము" అని వాపోయాడు జనార్దనం.

తర్వాత అన్నదమ్ములు వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళగానే "ఇంతా నయం....వీళ్ళకు ఆ బూడిద అయినా పంపించారు. ఆ జాన్—డాన్‌లు ఇద్దరూ కొంచెం శాస్త్రం తెలిసిన మనుషుల్లాగే వున్నారు" అన్నాడు శివయ్య.

అతనలా అంటున్నప్పుడే పోలీసు స్టేషన్ ముందు రిక్షా ఆగింది.

అందులోనించి సుందర్రావు—బ్రహ్మారావు రిక్షా దిగి వాడికి డబ్బులు ఇవ్వకుండానే సరాసరి లోపలకు వచ్చేశారు.

బ్రహ్మారావు చేతిలో ఓ పొట్లం వున్నది.

దాన్ని చూడటంతోనే రక్షకభటులకీ, సూర్యంకీ కథంతా తెలిసిపోయింది.

"కూర్చోండి" అన్నాడు సూర్యం.

"సార్, ఈ పొట్లం...." అని ఏదో చెప్పటానికి ప్రయత్నం చేశాడు బ్రహ్మారావు.

అతని ప్రయత్నాన్ని వారించి "ఈ పొట్లంలో నిత్యా

నందంగారి బూడిద వున్నది. దీన్ని మీకు ఓ అరగంట క్రితమే యెవరో అందజేశారు. అంతే కదా" అన్నాడు సూర్యం.

"ఆహా....ఏం పరిశోధన? నిజంగా అద్భుతం....ఈ పాట్లంలో బూడిద వున్న సంగతి మీ కెలా తెలిసింది?" అని అడిగాడు సుందర్రావు.

"ఎలాగో తెలిసింది. మా విధానాలు మాకు వుంటాయి. మేము త్వరలోనే ఆ శవాల దొంగలను పట్టుకుంటాం. ఇక మీరు వెళ్ళి ఆ బూడిదను పుణ్య నదుల్లో కలిపిరండి" అని వాళ్ళని పంపించివేశాడు ఇన్‌స్పెక్టర్ సూర్యం.

వెంటనే అతనికి ఓ ఫోన్ కాల్ వచ్చింది.

"యస్....సర్" అన్నాడు సీరియస్‌గా.

అవతల మాట్లాడుతున్న మనిషి డి.ఐ.జి. అని అర్థం చేసుకున్నారు రక్షకభటులు.

"అవున్సార్. ప్రస్తుతం ఆ పరిశోధనలోనే వున్నాను. ఇంతకుముందే ఆ మనుషుల పేర్లు, కొన్ని గుర్తులు తెలిశాయి. వాళ్ళని ట్రేస్ చేసే ప్రయత్నంలో వున్నాను. త్వరలోనే వాళ్ళని పట్టుకుంటాను సార్."

రెండు నిముషాల తర్వాత ఫోన్ పెట్టేశాడు.

"విన్నారా....అప్పుడే ఈ శవాల గొడవ డి.ఐ.జి. దాకా వెళ్ళింది. నిత్యానందం కొడుకులు వెళ్ళి ఆయన్ని కలుసుకున్నారుట. వెంటనే ఈ కేసును తేల్చమంటున్నాడు" అన్నాడు సూర్యం.

"నిజమే సార్ .... త్వరలో ఈ దొంగలను పట్టుకోవాలి. అందుకు మేము ఈ రాత్రికే ఒక పథకం తయారు చేశాము" అన్నాడు చెన్నయ్య.

"ఏమిటా పథకం?" అన్నాడు సూర్యం.

తమ ప్లానును యస్.ఐ.కి వివరించి చెప్పారు ఇద్దరూ-

"ఈ ప్లానుకు దొంగలు దొరుకుతారా?" అనుమానంగా అడిగాడు సూర్యం.

"తప్పకుండా దొరుకుతారు సార్. వాళ్ళకు కావలసింది శవం. శవం యెక్కడ కనపడితే వాళ్ళు అక్కడికి వస్తారు! వాళ్ళు మా వలలో పడతారని మాకు పూర్తి నమ్మకం వుంది" అన్నాడు శివయ్య.

"గుడ్....జాగ్రత్తగా వుండండి. నేను కూడా ఈ రాత్రికి ఊళ్ళో తిరగాలని అనుకుంటున్నాను. అప్పుడప్పుడు మీరున్న 'సెంటరు'కూడా వస్తుంటాను" అన్నాడు.

"ఈ రాత్రితో శవాల దొంగల పని ఖాళీ"అన్నాడు చెన్నయ్య.

## 8

వీధి దీపాలు మసగ్గా వెలుగుతున్నాయి.

రోడ్లమీద జనసంచారం తగ్గిపోయింది. చలిగా వుండటంవల్ల ఎనిమిది గంటలు దాటేసరికి జనం ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు.

ఒక సందు కార్నర్‌లో నిలబడి వున్నాడు చెన్నయ్య. అతనిముందు ఓ శవం వున్నది. దానినిండా ముసుగు వున్నది. ఆ శవం యెవరిదో కాదు — కానిస్టేబుల్ శివయ్యదే—

చెన్నయ్య మారువేషంలో వున్నాడు—చిరుగుల షర్టు వేసుకున్నాడు. అతుకులుపడిన పంచె కట్టుకున్నాడు. చింపిరి తల.

శవం ముందు విశాలంగా గుడ్డపరిచి వున్నది. శివయ్య

కూడా మారువేషంలోనే వున్నాడు.

"దిక్కు లేనోడు బాబూ ...మందు లేక చచ్చిపోయాడు బాబూ ...కనికరించండి.... ఓ పావలా ధర్మం చెయ్యండి" అని అరుస్తున్నాడు.

దయగలిగినవాళ్ళు ఆ గుడ్డమీద డబ్బులు విసిరి వెళ్ళి పోతున్నారు.

తను బాగా నటిస్తున్నందుకు తనని తనే మనసులో అభినందించుకున్నాడు చెన్నయ్య.

శివయ్య నటించవలసిన అవసరంలేదు. యెందుకంటే అతను స్పృహలో లేడు. యెన్ని గంటలు అలా పడి వుండవలసి వస్తుందో తెలీదు. అందుకే వూరికే కదల కుండా పట్టుకోటానికి విసుగు పుడుతుందని చెన్నయ్య— శివయ్యకు మత్తుమందు ఇచ్చాడు.

అందువల్ల శివయ్య ప్రస్తుతం నిద్రలో వున్నాడు.

తొమ్మిది గంట అయ్యింది.

జనసంచారం పూర్తిగా తగ్గిపోయింది. అప్పుడప్పుడు ఒకరు—ఇద్దరు నడుస్తున్నారు.

అప్పటికి రెండుసార్లు మోటారుసైకిలుమీద యస్.ఐ. సూర్యం అటువైపు వచ్చాడు.

చెన్నయ్య మారువేషాన్ని, అడుక్కోటాన్ని చూసి బాగానే నటిస్తున్నాడని నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

ఇన్‌స్పెక్టర్‌ని చూడగానే శాల్యూట్ చెయ్య బోయాడు చెన్నయ్య, కాని తన ప్లాను ఫెయిలవుతుందని ఆ పని చెయ్యలేదు.

పదిగంటలవుతున్నా చెన్నయ్య వూహించినట్టుగా జాన్—డాన్‌లు వ్యాన్ తీసుకుని అక్కడకు రాలేదు శవాన్ని తీసుకెళ్ళటానికి.

ఇక వాళ్ళు రారేమో అనుకున్నాడు చెన్నయ్య.

ఓ రిక్షాను పిలిచి శివయ్యను తీసుకుని వెళ్ళిపోదామని అనుకున్నాడు ఇంకో అరగంట చూసి—

పదినిమిషాలు గడిచాయి.

ఇంతలో ఓ సందు చివర ఒక మనిషి—కర్రపోటు వేసుకుంటూ చిన్నగా కుంటుతూ నడిచి వస్తూ కనిపించాడు. కొంచెం దగ్గరకు వచ్చిన తర్వాత వాడ్ని ముష్టివాడిగా గుర్తించాడు చెన్నయ్య.

వాడి చేతిలో చిన్న బొచ్చె వుంది. భుజానికి జోలె వేలాడుతోంది.

వాడు చెన్నయ్య దగ్గరకు వచ్చాడు.

ముందున్న శవాన్ని చూసి "ఎప్పుడు పోయాడు జీవుడు?" అనడిగాడు.

"మధ్యాహ్నం" చెప్పాడు చెన్నయ్య.

"ఏమిటో మడుసులు పుటిక్కున సచ్చిపోతున్నారు. ఎక్కడ సూసినా శవాలే."

"ఇంకా యెక్కడున్నాయి శవాలు?" అడిగాడు కానిస్టేబులు.

"అదిగో....ఆ సందు చివర్లో చెత్తకుండీ పక్కన యెవడో సచ్చిపోయి వున్నాడు" అని కర్ర చప్పుడు చేసుకుంటూ ముందుకు కదిలాడు వాడు.

అక్కడో శవం వుందని తెలియగానే చెన్నయ్య పోలీసు బుద్ధి వూరుకోలేదు. ఆ శవం యెవరిదో వెళ్ళి చూడా లనిపించింది.

అందుకే ఒక్కసారి అటూ ఇటూ చూసి గబగబా ఆ సందులోకి నడిచాడు.

తీరా అక్కడకు వెళ్ళిన తర్వాత అతనికి కుండీ

పక్కన శవం కనిపించలేదు.

నిమిషంలోనే ఆ ముష్టివాడు ఫూల్ని చేసినట్లు గ్రహించాడు చెన్నయ్య .... గబగబా వెనక్కు తిరిగి వచ్చాడు.

షాక్ కొట్టినట్టు అనిపించింది.

అక్కడ శివయ్య లేడు....

పరిచిన గుడ్డ ఖాళీగా వుంది.

ఏం జరిగివుంటుందో గ్రహించిన చెన్నయ్య నిలువెల్లా వణికిపోయాడు.

ఇంతలోనే పక్కవీధిలో ఏదో వాహనం స్టార్టయిన చప్పుడు వినిపించింది.

రివ్వున ఆ వీధిలోకి పరుగుదీశాడు.

అప్పటికే ఏదో వాహనం కనుమరుగు అవుతూ కనిపించింది—ఎర్రటి లైటు వెలుగుతూ—ఆరిపోతూ.

"మోసం .... మోసం" అని అరిచాడు చెన్నయ్య పిచ్చిగా—

## 9

కళ్ళు తెరిచాడు శివయ్య—

ఎదురుగా జాన్—డాన్‌లు కనిపించారు. లావుగా—పొడుగ్గా వున్న వాళ్ళను చూడగానే వాళ్ళెవరో ఈజీగానే గ్రహించాడు కానిస్టేబులు శివయ్య—

అలా గ్రహించగానే ఉలిక్కిపడ్డాడు—చలిజ్వరం వచ్చిన వాడిలా వణికిపోయాడు.

"ఎందుకలా భయపడతావ్ రక్షకభట్టా....యిప్పుడు నీకే రక్షణ లేకుండా పోయిందనా?" అంటూ పెద్దగా నవ్వాడు జాన్.

శివయ్య మాట్లాడలేకపోయాడు. అసలు తను వీళ్ళకు

ఎలా దొరికాడో అర్థం కాలేదు. చెన్నయ్య ఏమైనాడు? వీళ్ళు చెన్నయ్యను కూడా తీసుకువచ్చారా?

అతడి అనుమానాన్ని గ్రహించినట్టు డాన్ సిగరెట్టు వెలిగించి "మీరిద్దరూ గొప్ప గూఢచారుల్లాగా మారు వేషాలు వేసుకొని మమ్మల్ని పట్టుకోవాలని అనుకున్నారు కదా! శవాన్ని మాకు ఎరగా చూపించి మమ్మల్ని బంధించాలని అనుకున్నారు. కాని మేము నీతోటి కానిస్టేబుల్‌కి మస్కా కొట్టి తెలివిగా నిన్ను ఇక్కడకు తీసుకువచ్చాము" అన్నాడు.

"ఇప్పుడు నన్నేం చేస్తారు?" అనడిగాడు శివయ్య—ఒంటరిగా ఆ దుండగులకు చిక్కినందుకు అతనికి యెంతో భయంగా వున్నది.

ఇప్పుడు తను ఒంటరివాడు. పైగా నిస్సహాయ స్థితిలో వున్నాడు.

"నిన్నా....ముందు నీతో ఆడుకుంటాము. ఆ తర్వాత మా బాస్‌కు ఫోన్ చేసి నిన్ను ఏం చెయ్యాలసిందీ తెలుసుకుంటాము" అన్నాడు డాన్.

"మీ బాస్ యెవరు?" అడిగాడు శివయ్య భయంగానే—కుతూహలాన్ని అణచుకోలేక.

"మా బాసా? చెప్పక తప్పదంటావా? అయినా నువ్వా మానించి తప్పించుకోలేవు కాబట్టి నీకు చెప్పినా ఫర్వాలేదు....మా బాస్ యెవరో కాదు....మా బాసు మీ బాస్" అన్నాడు జాన్.

"అంటే ఎవరు?" అన్నాడు శివయ్య.

"ఎవరో కాదు....ఇన్‌స్పెక్టర్ సూర్యం."

"నిజంగానా! నేను నమ్మను .... ఆయన ఇలాంటి దుర్మార్గపు పనులు చెయ్యడు. ఆయన నిప్పులాంటి

మనిషి....'' అన్నాడు శివయ్య ఆవేశంగా.

పెద్దగా నవ్వాడు డాన్.

"నువ్వింత అమాయకుడివని అనుకోలేదు. ఇలాంటి పనులు చేసేవాళ్ళంతా పైకి నిప్పులాంటి మనుషుల్లాగే కనపడతారు. అలాంటప్పుడే ఇలాంటి పనులు చెయ్యటం సాధ్యమయ్యేది. నువ్వు నమ్మినా నమ్మకపోయినా యిది నిజం. లేకపోతే మీరు మారువేషాలు వేసుకుని మా కోసం వలపన్నారని మాకెలా తెలుస్తుంది? ఇప్పటి కయినా అర్థమయ్యిందా?'' అన్నాడు నవ్వి.

శివయ్య ఆ మాటలు వినగానే అయోమయ స్థితిలో పడిపోయాడు.

ఇన్స్పెక్టర్ సూర్యం ఈ శవాల దొంగలకు నాయకుడా! ఇది నిజమా? యేమో! తను నమ్మలేకుండా వున్నాడు.

ఆయన గురించి తనకు బాగా తెలుసు.

వీళ్ళు అబద్ధం చెబుతున్నారు తనని ఫూల్ని చెయ్యటానికి—తను వీళ్ళ మాటలు నమ్మకూడదు.

"సరే.. ఆ విషయం గురించి తర్వాత ఆలోచిద్దువు గాని....ముందు ఈ ప్రయోగాల సంగతి చూడు'' అన్నాడు జాన్.

డాన్ ఒక గదిలోకి వెళ్ళి చిన్న బాక్స్, ఒక స్పిరిట్ దీపం తీసుకువచ్చాడు.

ముందుగా ప్లాస్టర్తో శివయ్య పెదవులకు అంటించారు అరవటానికి వీల్లేకుండా.

తర్వాత జాన్ స్పిరిట్ దీపం వెలిగించాడు. బాక్స్లో నించి కొంచెం పొడుగ్గా—సన్నగా వున్న సూదులను బయటకు తీసి ముందుగా చిన్న పట్కాయతో ఒక సూది

స్పిరిట్ మీద కాల్చాడు.

అదంతా చూస్తుంటే శివయ్య ప్రాణాలు పైనే ఎగిరి పోయినట్టు అనిపించింది.

పోలీసు స్టేషన్‌లో కూడా తాము యెప్పుడూ యే నేరసుడి మీదా అలాంటి ప్రయోగాలు చెయ్యలేదు.

ఎర్రగా కాలిన సూదిని గలుక్కున శివయ్య చెంప మీద ఆనించాడు జాన్.

బాధగా మూలిగాడు శివయ్య. అతని కళ్ళలోనించి నీళ్ళు గిర్రున తిరిగి ధారగా కిందికి కారాయి.

"అప్పుడే అయిపోలేదు గురువుగారూ. మమ్మల్ని పట్టుకోవాలని మీ డ్యూటీ మీరు చేశారు. దొరికావు కాబట్టి మా డ్యూటీ మేము చెయ్యాలి కదా!" అన్నాడు డాన్.

అలా అని ఇంకో సూది తీసుకుని శివయ్య వేళ్ళమీద గోళ్ళకింద గట్టిగా లోపలికల్లా గుచ్చేశాడు.

మళ్ళీ ఎగిరి మూలిగాడు శివయ్య.

వేళ్ళలోనించి రక్తం జివ్వున పైకి వచ్చింది.

జాన్ అతని బాధను పట్టించుకోకుండా ఒక బ్లేడు తీసుకువచ్చి శివయ్య తలమీద గట్టిగా గీశాడు.

చర్మం గీరుకుపోయి తలమీదనించి మొహం మీదకు నెత్తురు కారిపోయింది.

ఈ బాధలకు ఓర్చుకోలేక శివయ్యకు స్పృహ పోయింది.

"కానిస్టేబుల్ స్పృహ తప్పాడు" అన్నాడు డాన్.

"అయితే ఇక మన ప్రయోగాలు ఆపు చేద్దాం. ఇన్నాళ్ళకు మనకు ప్రయోగాలు చెయ్యటానికి బలికివున్న ఓ మనిషి దొరికాడు. బావుంది. మళ్ళీ స్పృహ వచ్చే

వరకు ఎదురుచూద్దామా?" జాన్ అడిగాడు.

"వద్దు....మనం ఈ రక్షకభటుడ్ని తీసుకొచ్చినట్టు బాస్‌కు తెలియజెయ్యాలి" అని డాన్ పక్కనే వున్న గదిలోకి వెళ్ళి టెలిఫోన్ నెంబర్ తిప్పాడు.

క్షణం తర్వాత అవతలివైపు బాస్ గొంతు వినిపించింది.

బాస్‌కు జరిగినదంతా చెప్పి "బాస్ ఇప్పుడు ఆ పోలీసు మనిషిని ఏం చెయ్యమంటారు?" అనడిగాడు.

"మనగురించి తెలుసుకోటానికి ప్రయత్నించిన మనిషి-తెలుసుకున్న మనిషి ప్రాణాలతో వుండటానికి వీల్లేదు. వాడ్నికూడా అస్థిపంజరంగా మార్చెయ్యండి. మనకు ఉపయోగపడతాడు" అన్నాడు బాస్.

"ఓ.కే. బాస్" అని ఫోన్ పెట్టేసి బయటకు వచ్చాడు ఆ గదిలోనించి.

"వీడ్ని మనం యంత్రం వున్న గదిలోకి తీసుకెళ్ళాలి" అన్నాడు డాన్—జాన్‌తో.

ఇద్దరూ కలిసి శివయ్య కట్లు విప్పి అతడిని ఒక గదిలోకి మోసుకు వెళ్ళారు.

ఆ గదిలో పెద్ద ఇనుప స్టాండుమీద పొడుగాటి పెట్టెలాంటిది వుంది. దానిపైన ఒక తలుపు కూడా వుంది.

ముందుగా జాన్ ఆ పెట్టె తలుపును తెరిచాడు.

తర్వాత ఇద్దరూ పట్టి స్పృహలో లేని శివయ్యను ఆ పెట్టెలో పడుకోబెట్టారు. జాన్ మళ్ళీ తలుపు మూసి బోల్టు వేశాడు.

"రెడీయేనా?" అన్నాడు డాన్.

తల వూపాడు జాన్.

వెంటనే డాన్ గోడకు వున్న ఎలక్ట్రిక్ స్విచ్ ను నొక్కాడు. నొక్కగానే ఎక్కడో బరబరమని చప్పుడు వినిపించింది.

ఒక నిమిషంలో ఆ గదిలో శవం కాలుతున్న వాసన వచ్చింది. జాన్-డాన్‌లు ఇద్దరూ జేబుల్లోనించి కర్చీఫ్‌లు బయటకుతీసి ముక్కుకు అడ్డుగా వుంచుకున్నారు.

డాన్ నిముష నిముషానికీ చేతినున్న గడియారాన్ని చూసుకున్నాడు.

సరిగ్గా పది నిముషాలు గడచిన తర్వాత మళ్ళీ స్విచ్ ఆఫ్ చేశాడు డాన్.

ఇంకో రెండు నిముషాలాగి ఆ పెట్టె తలుపు తెరిచాడు జాన్.

ఇప్పుడు అందులో శివయ్యకు బదులు అతని అస్థి పంజరం వున్నది. అందులో వున్న రంధ్రాలనించి బూడిద కిందికి వెళ్ళిపోయింది.

నవ్వాడు జాన్. "పాపం! దున్నపోతులా వుండే కానిస్టేబులు పదినిముషాల్లో ఎముకల గూడులా మారిపోయాడు. మనిషి జన్మ ఎంత చిత్రమయినది" అన్నాడు.

వాళ్ళిద్దరూ ఆ అస్థిపంజరాన్ని తీసుకెళ్ళి మరో గదిలో ఖాళీగా వున్న చెక్కపెట్టెలో పెట్టి దానికి మేకులు కొట్టేశారు.

అంతా అయిపోయిన తర్వాత జాన్ పని పూర్తయ్యిందని బాస్‌కు ఫోన్ చేసి చెప్పాడు.

## 10

ఇన్‌స్పెక్టర్ సూర్యం ముఖం గంభీరంగా వుంది. అతని ఎదురుగా చెన్నయ్య నిల్చుని వున్నాడు.

రాత్రి శివయ్యను ఆ దొంగలకు తెలివితక్కువగా అప్పగించినందుకు కానిస్టేబుల్ చెన్నయ్యను బాగా చీవాట్లు వేశాడు.

"ఇప్పుడు వాళ్ళు మన శివయ్యను ప్రాణాలతో వదులుతారంటావా?" అన్నాడు సూర్యం.

చెన్నయ్య ఏమీ మాట్లాడలేకపోయాడు.

వాళ్ళు శివయ్యను ప్రాణాలతో వదులుతారని అతనికి నమ్మకంలేదు.

"ఊహు.... నాకు నమ్మకంలేదు" అన్నాడు సూర్యం తనే.

ఐదు నిముషాలు గడిచిన తర్వాత యెవరో కుర్రాడు స్టేషన్ లోపలకు ఓ పొట్లాన్ని విసిరి పరుగుదీశాడు.

గబుక్కున ఆ పొట్లాన్ని చేతికి తీసుకున్నాడు చెన్నయ్య.

దాన్ని చూడగానే అతని చెయ్యి వణికింది.

అది ఏమయి వుంటుందో అతను వూహించగలిగాడు.

ఆ పొట్లాన్ని అతను సూర్యానికి ఇచ్చాడు.

దాన్ని విప్పి చూస్తే అందులో బూడిద—దానిమధ్య ఓ చిన్న కాయితం — దానిమీద 'ఇది కానిస్టేబుల్ బూడిద' అని రాసి వుంది.

దాన్ని చూడగానే సూర్యం మొహం కందగడ్డలా అయిపోయింది.

"డర్టీ డెవిల్స్....రోగ్స్ .... ఇడియట్స్ ..." పళ్ళు కొరికాడు.

చెన్నయ్యకు ఏడుపు ముంచుకువచ్చింది. ఆ తర్వాత విపరీతమైన కోపం—ఆవేశం ముంచుకువచ్చాయి.

'రాక్షసులు..తన ప్రాణస్నేహితుడు, సహ ఉద్యోగి

అయిన శివయ్యను పాట్టన పెట్టుకున్నారు. నిర్దాక్షిణ్యంగా బతికి వున్న మనిషిని బూడిద చేశారు. వీళ్ళని తను సుల భంగా వదిలిపెట్టకూడదు. ప్రాణానికి ప్రాణంతియ్యాలి.'

"చూడు. నీ ప్లాను వల్ల ఏం జరిగిందో. నీ ప్లానుకు మన శివయ్య బలైపోయాడు" అని మరోసారి తిట్టాడు ఇన్ స్పెక్టర్.

ఆ రోజునే ఇన్ స్పెక్టర్ ఊళ్ళో శవాల దొంగల గురించి ప్రజలందరికీ హెచ్చరిక చేయించాడు.

శవాల దొంగలు వున్నారనీ — వాళ్ళు శవాలను ఎత్తుకుపోతున్నారనీ—అందువల్ల శవాలను జాగ్రత్తగా కాపలా కాసుకోవాలనీ హెచ్చరిక చేయించాడు.

ఆ రోజు పేపర్లో కూడా ఈ శవాల మాయం గురించి పెద్ద అక్షరాలతో ప్రచురించారు.

రాత్రి ఎనిమిది గంటలకు ఆ ఊళ్ళో వున్న పెద్ద కాంట్రాక్టరు కనకలింగం దగ్గర్నించి యస్.ఐ. సూర్యంకి ఫోన్ వచ్చింది.

"హల్లో .... మా ఇంట్లో ఓ ముసలాయన చనిపో యాడు" అని ఫోన్ చేశాడు.

"అయితే ఏమంటారు?" అన్నాడు సూర్యం.

"ఆ శవాన్ని దొంగలు ఎత్తుకుపోకుండా మీరు తెల్లవారినదాకా పోలీసు ప్రొటెక్షన్ ఇవ్వాలి" అన్నాడు కనకలింగం.

ఇన్ స్పెక్టర్ కి మతిపోయింది.

ఇప్పుడేమిటి చెయ్యటం? చివరికి తను డిపార్టుమెంటు శవాలను ఎత్తుకుపోకుండా కాపలా కాయవలసిన స్థితికి వచ్చిందా?

"చెప్పరేమండీ. కానిస్టేబుల్స్ ని పంపిస్తున్నారా?"

అనడిగాడు ఆయన.

"సారీ పోలీసు ప్రొటెక్షన్ యివ్వటం కుదరదు. మీ ప్రొటెక్షన్ మీరే ఏర్పాటు చేసుకోండి."

"ఏమిటి....మరి అలాంటప్పుడు పోలీసు హెచ్చరిక ఎందుకు చేయించారు?" తీవ్రంగా అడిగాడు కనకలింగం.

"మీ జాగ్రత్తలో మీరు వుండటానికి. యెన్ని శవాలకు మేము ప్రొటెక్షన్ ఏర్పాటు చెయ్యగలం? అందుకల్ల సాధ్యంకాదు. సారీ" అని ఫోన్ పెట్టేశాడు సూర్యం.

ఉదయమే చెన్నయ్య పదిరోజులకు లీవుపెట్టి వెళ్ళి పోయాడు.

మిగిలిన కానిస్టేబుళ్ళు వున్నా వాళ్ళు అంత సమర్థులు కాదు. అందుకే సూర్యం ప్రొటెక్షన్ ఇవ్వటానికి ఒప్పుకోలేదు.

ఆపైన పదినిమిషాలకు డి.ఐ.జి. మళ్ళీ ఫోన్ చేశాడు. శవాల మాయం గురించిన వ్యవహారం యెంతవరకు వచ్చిందని అడిగాడు.

ఇంకా దర్యాప్తులోనే వుందనీ త్వరలోనే ఆ శవాల దొంగలను పట్టుకుంటానని చెప్పాడు సూర్యం.

## 11

అక్కడి వీధి దీపం వెలగటం లేదు. బాగా చీకటిగా వున్నది. రాత్రి పదకొండు గంటలు కావస్తోంది.

గంట సేపటినించీ ఆ చీకట్లో మోటారుసైకిలును ఆపి దాని పక్కనే నిలబడి వున్నాడు ఇన్‌స్పెక్టర్ సూర్యం.

అక్కడ నిల్చుంటే కొంచెం దూరంలో కంట్రాక్టర్ కనకలింగం యిల్లు క్లియర్‌గా కనపడుతోంది.

వరండాలో ఒక శవం వున్నది. ఆ శవానికి కొంచెం

దగ్గరగా కూర్చుని కొంతమంది దుఃఖిస్తున్నారు.

కొంతమంది నిద్ర ముంచుకువస్తున్నట్టుగా వున్నారు.

ఎవరయినా తెల్లవార్లూ కాపలాకాయటం కష్టం. నిద్రవచ్చే సమయం. అందువల్లనే రాత్రివేళల్లో దొంగలు శవాలను సులభంగా ఎత్తుకుపోతున్నారు.

సూర్యంకి అసహనంగా వున్నది. అసలు ఆ దొంగలకు ఇక్కడ ఓ శవం వున్నట్టు తెలుసా?

తప్పకుండా తెలుస్తుంది. వాళ్ళు ఎలాగైనా తెలుసుకుంటారు.

కాబట్టి శవంకోసం తప్పకుండా వాళ్ళు అక్కడకు వచ్చితీరాలి.

ఎన్ని గంటలయినా ఆ మనుషులకోసం తను వేచి వుండాలి. ఈ రాత్రికి యెలాగైనా వాళ్ళ అంతు తేల్చుకోవాలి.

జాన్ — డాన్ ఇద్దరు మనుషులే ఈ దొంగతనాలను చేస్తున్నారా? వీళ్ళ వెనుక ఇంకో మనిషి యెవరయినా వున్నాడా?

ఆలోచిస్తున్నాడు సూర్యం.

ఆలోచిస్తున్న సూర్యం ఉలిక్కిపడ్డాడు.

తన పక్కన ఏదో నీడ కదిలినట్టు అనిపించింది.

పక్కకు తిరగబోయాడు. కాని అప్పటికే ఆలస్యం అయ్యింది. వెన్నులో రివాల్వర్ మొన గుచ్చుకున్నది.

అతని దృష్టి అంతా కంట్రాక్టర్ కనకలింగం ఇంటి మీద వుండటంవల్ల వెనకనించి వస్తున్న మనిషిని తను గ్రహించలేకపోయాడు.

గ్రహించేసరికి ఆలస్యం జరిగిపోయింది.

"కదలకు ఇన్‌స్పెక్టర్. నీ సంగతి మాకు బాగా

తెలుసు. నువ్వు ఇలాంటి ప్రయత్నం ఏదో చేస్తావని నేను అనుమానిస్తూనే వున్నాను. అనుమానించినట్టుగానే నువ్వు ఇక్కడ దొరికిపోయావు" అన్నాడు అతని వెనుక నిల్చున్న జాన్.

తనుకూడా యింత సులభంగా వాళ్ళకు చిక్కిపోయినందుకు సూర్యంకు అవమాన మనిపించింది.

"పిచ్చి వేషాలు వెయ్యకు. తప్పించుకునే ప్రయత్నం చెయ్యకు. నా చేతిలో వున్న రివాల్వర్ పేలుతుంది. క్షణంలో నీ ప్రాణం ఎగిరిపోతుంది. మర్యాగా వెనక్కు తిరిగి ఆ సందు చివరకి నడు. అక్కడ మా వ్యానువుంది" అన్నాడు జాన్.

ఇన్స్పెక్టర్ సూర్యానికి వెనక్కు తిరక్క తప్పలేదు. రెండడుగులు వేశాడు. అయినా అతని మనసు తప్పించుకుని అవతలి మనిషిని దెబ్బతీయటం గురించే ఆలోచిస్తోంది.

ఎలా?

కనకలింగం ఇంట్లోనించి ఏడుపులు వినపడుతున్నాయి.

"ఇప్పుడు నన్నెక్కడికి తీసుకువెళతారు?" అడిగాడు సూర్యం.

"తొందరెందుకు? నీకే తెలుస్తుందిగా" అన్నాడు జాన్ ట్రిగ్గర్ మీద వేలును బిగిస్తూ—

సూర్యం నడుస్తున్నవాడల్లా ముందుకు పడిపోయాడు వున్నట్టుండి.

అంతే. జాన్ రివాల్వర్ పేల్చాడు. బుల్లెట్ సూర్యానికి తగల్లేదు. ఎదురుగా వున్న గోడకు తగిలింది.

కిందపడిన ఇన్స్పెక్టర్ కాళ్ళతో జాన్ను ఈడ్చి తన్నాడు. జాన్ బోర్లా పడబోయి ఎలాగో నిగ్రహించు

కున్నాడు.

మరోసారి రివాల్వర్ పేల్చబోయాడు. కాని అప్పటికే రివాల్వర్ మోత విని అక్కడ వున్న ఇళ్ళలో వున్న జనం తలుపులు తెరుచుకుని బయటకు వస్తున్నారు.

అందుకే పైకి లేవబోతున్న ఇన్‌స్పెక్టర్ తలమీద రివాల్వర్‌తో కొట్టి అక్కడినించి రివ్వున పరిగెత్తి వెళ్ళి వ్యానులో ఎక్కాడు జాన్.

అంతే. వ్యాన్ వేగంగా సాగిపోయింది.

"ఏమయ్యింది?" అడిగాడు డాన్.

జరిగినదంతా చెప్పాడు జాన్.

"పొరపాటు చేశావు జాన్. ఇన్‌స్పెక్టర్‌తో మనకు పనిలేదు. మనకు ఆ కనకలింగం ఇంట్లో వున్న శవం కావాలి. వెనుకనించి వెళ్ళి ఇన్‌స్పెక్టర్ తలమీద కొట్టి స్పృహ తప్పించినట్లయితే మన పని అయిపోయి వుండేది" అన్నాడు డాన్.

"నా ఉద్దేశం అది కాదు డాన్. ఇన్‌స్పెక్టర్ని బంధించి తీసుకెళ్ళి బాస్‌కు అప్పగించాలనుకున్నాను. అందుకే రిస్కు తీసుకున్నాను. కాని కుదర్లేదు" అన్నాడు.

## 12

పదినిమిషాలు దాటేసరికి వ్యాను ఆ ఊరి బయట వున్న భవనం దగ్గరకు చేరుకుంది.

అందులోనించి జాన్—డాన్ దిగి లోపలకు వెళ్ళారు.

అప్పటికే లోపల బాస్ కూర్చుని వున్నాడు.

ఖాళీ చేతులతో వచ్చిన జాన్—డాన్‌లను చూసి "శవాన్ని తీసుకువచ్చారా?" అడిగాడు.

"లేదు బాస్" అని జరిగినదంతా చెప్పాడు జాన్.

"ఇడియట్. ఆ ఇన్‌స్పెక్టర్‌తో మనకు పనేమిటి? వాడ్ని వెనకవించి దెబ్బకొట్టి శవాన్ని తీసుకురాకుండా అతి తెలివికిపోయి అసమర్థుడిలా తిరిగివచ్చావు. నీలాంటి అసమర్థుడు నాకు పనికిరాడు" అంటూ చటుక్కున రివాల్వర్ బయటకుతీసి జాన్ గుండెలకేసి కాల్చాడు బాస్.

షాక్ కొట్టినట్టు అయిపోయాడు డాన్.

"బాస్!" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును డాన్....ఏ పని ముఖ్యమో దాన్ని ముందు చేసే మనుషులు నాకు కావాలి. నీకు మరో మనిషిని తోడుగా ఇస్తాను. ఇప్పుడు మన అస్థిపంజరాల బిజినెస్‌కు ఒక్క అమెరికానించే కాకుండా మరికొన్ని దేశాలనించి కూడా ఆర్డర్లు వస్తున్నాయి. మన బిజినెస్‌లో నిన్ను పార్ట్‌నర్‌గా చేర్చుకోవాలని అనుకుంటున్నాను. ముందు నువ్వు ఈ జాన్‌ని స్కెలిటన్‌గా మార్చేసెయ్యి" అన్నాడు బాస్.

నిర్జీవంగా నెత్తురుమడుగులో పడివున్న జాన్ శవాన్ని ఎత్తి భుజాన వేసుకుని తీసుకువెళ్ళి స్టాండుమీద వున్న పెట్టెలో వుంచి తలుపు మూసి స్విచ్ నొక్కాడు.

పదినిముషాల తర్వాత జాన్ అస్థిపంజరంగా మారిపోయాడు. అతని అస్థిపంజరాన్ని బాస్ ఆజ్ఞప్రకారం చెక్క పెట్టెలో పెట్టి మేకులు కొడుతుంటే డాన్‌కి కన్నీళ్ళు వచ్చాయి.

"వెరీగుడ్. జాన్ చచ్చికూడా మనకు ఉపయోగపడుతున్నాడు. రైట్ డాన్....ఇక నేను వెళతాను. గుడ్‌నైట్" అని వెనక్కు తిరిగాడు బాస్.

అంతే వేగంగా తన ప్యాంటుజేబులోనించి రివాల్వర్

బయటకుతీసి వెనుకనించి బాస్‌ను షూట్ చేశాడు డాన్.

పెద్దకేకతో బోర్లా పడిపోయాడు బాస్.

"డర్టీ రోగ్. నా ప్రాణమిత్రుడు జాన్‌ని ఈజీగా షూట్ చేసి చంపుతావా? దెబ్బకి దెబ్బతీశాను బాస్" అని బాస్ శవాన్ని భుజాన వేసుకుని తీసుకెళ్ళి పెట్టెలో వుంచి తలుపు మూసి స్విచ్ నొక్కాడు.

బరబరమని చప్పుడు వినిపించింది.

పదినిమిషాల తర్వాత స్విచ్ ఆఫ్‌చేసి తలుపు తెరిచి లోపలకు తొంగి చూశాడు.

ఎన్నో శవాలను అస్థిపంజరాలుగా మార్చివేయించిన బాస్ ఇప్పుడు అస్థిపంజరంగా మారిపోయాడు.

"బాస్ నీ అస్థిపంజరం మాత్రం అమెరికా వెళ్ళదు. నీ దురదృష్టం. ఇక ఈ అస్థిపంజరాల బిజినెస్‌కి గుడ్ బై కొడుతున్నాను" అని తలుపు మూసి టెలిఫోన్ దగ్గరకు నడిచి డయల్ చేశాడు.

"హాల్లో ఎవరు మాట్లాడేది? ఇన్‌స్పెక్టర్ సూర్యమేనా? అయితే నేను చెప్పేది జాగ్రత్తగా విను. శవాల దొంగతనాలు ఈ రోజుతో అంతం అయిపోయాయి. శవాలను అస్థిపంజరాలుగా ఓ యంత్రంద్వారా మార్చి వాటిని బొంబేకు పంపిస్తున్నాడు బ్రహ్మారావు. ఆయనే నిత్యానందం బంధువు. ఆయనే అసలు బాస్. బొంబే నించి ఆ అస్థిపంజరాలు అమెరికాకు వెళతాయి.

ఇక్కడ ఇంతకుముందే బాస్ జాన్‌ని రివాల్వర్‌తో షూట్ చేసి చంపి అస్థిపంజరంగా మార్పించాడు. తర్వాత నేను బాస్‌ని షూట్ చేసి అస్థిపంజరంగా మార్చివేశాను. ఇప్పుడాయన శవం ఆ పెట్టెలోనే వుంది. ఈ ముఠాలో యెవరెవరు ఎక్కడెక్కడ పనిచేస్తున్నదీ తెలియచేసే

ఆధారాలు ఊరి బయట వున్న పాడుపడిన భవనంలో మీకు దొరుకుతాయి. ఇక నేను మంచిగా బతకాలనుకుని ఇక్కడినించి వెళ్ళిపోతున్నాను" అని ఫోన్ పెట్టేశాడు.

వెంటనే అతనికి "నన్ను తప్పుకుని నువ్వు ఎక్కడికీ వెళ్ళలేవురా డాన్" అనే మాటలు వినిపించాయి.

ఉలిక్కిపడి చూశాడు డాన్.

గుమ్మం దగ్గర కానిస్టేబుల్ చెన్నయ్య నిలబడి వున్నాడు. అతని చేతిలో రివాల్వర్ వుంది.

"నువ్వా!" అన్నాడు డాన్ ఆశ్చర్యంగా జేబులో నించి రివాల్వర్ తీసే ప్రయత్నం చేస్తూ—

"అవును. నేనే నువ్వు చెయ్యి కదల్చావు చచ్చిపోతావ్. మీకోసమే అంతా గాలిస్తున్నాను. చివరికి ఇక్కడ రివాల్వర్ పేలిన చప్పుడు వినిపించింది. బయట ఆగివున్న మీ వ్యాన్ కనిపించింది. వచ్చేశాను. ఇంతకీ మా కానిస్టేబుల్ శివయ్యను ఎలా బూడిదగా మార్చేశారో చూపిస్తావా? నిన్ను వదిలిపెడతాను" అన్నాడు చెన్నయ్య.

"నిజంగా వదిలిపెడతావా?"

"తప్పకుండా. నేను ఆడినమాట తప్పను. నువ్వు ఫోన్‌లో మాట్లాడినదంతా విన్నాను. ఇకనించీ నువ్వు మంచివాడుగా బతుకు" అన్నాడు.

సరేనని డాన్—చెన్నయ్యకు ఆ యంత్రం వున్న గదిలోకి తీసుకెళ్ళి అందులోనించి బాస్ శవాన్ని తీసి అది మనుషులను అస్థిపంజరాలుగా ఎలా మార్చేదీ చెప్పేశాడు.

అంతే. డాన్ పూర్తి చెయ్యగానే చెన్నయ్య చేతిలో వున్న రివాల్వర్ పేలింది. రెండు గుండ్లు డాన్ గుండెలను

చీల్చుకుని పోయాయి. కింద పడిపోయాడు డాన్.

వెంటనే అతన్ని ఆ పెట్టెలో వుంచి తలుపుమూసి స్విచ్ ఆన్ చేశాడు చెన్నయ్య.

పదినిముషాలు గడిచాయి.

తలుపు తెరిచి లోపలకు చూశాడు. డాన్ అస్థిపంజరం కనిపించింది.

కసిగా నవ్వాడు కానిస్టేబుల్ చెన్నయ్య.

"శివయ్యా! నిన్ను మసిచేసిన మనిషిని నేను మసి చేశాను. నా పగ తీర్చుకున్నాను. ఇప్పుడు నా మనసుకు ఎంతో తృప్తిగా వుంది" అన్నాడు.

వెంటనే అతనికి శివయ్య గుర్తుకు రాగానే కళ్ళ వెంట నీళ్ళు వచ్చాయి.

క్షణం తర్వాత చెన్నయ్యకు దగ్గరగా ఏదో వాహనం వస్తున్న చప్పుడు వినిపించింది. ఆ వచ్చేది పోలీసు జీపు అని గ్రహించిన కానిస్టేబుల్ చెన్నయ్య బయటకు వచ్చి వెనకవైపున వున్న గోడమాకి చీకట్లో కలిసిపోయాడు.

సరిగ్గా అప్పుడే చీకట్లో దెయ్యంలా వున్న ఆ అస్థిపంజరాల భవనం ముందు పోలీసు జీపు వచ్చి ఆగిపోయింది.

—: అయిపోయింది: —

సీరియల్




(గతసంచిక తరువాయి)

"అయితే మనల్ని బంధించటానికి, ఆ స్పిరిట్సుకి ఏం సంబంధం లేదంటారా?" అన్నాడు వర్మ కార్తీక్ వంక తిరిగి!

"అదే నా అభిప్రాయం! అయితే ఈ మాంత్రికుడి అనుచరులు బహుశా పగసాధించే నిమిత్తం మనల్ని పట్టుకున్నారని నా అనుమానం!"

"పగా, దేనికి? వీళ్ళను మనమేం చేశాం?"

"మనలాంటి వాళ్ళేకదా, వీళ్ళ గురువును, తోటి సహచరులను మట్టుపెట్టింది! అందుకు మనమీద కక్ష సాధిస్తున్నారేమో!"

"అదేమిటి, ఎవరో చేసిందానికి మనమీద కక్ష సాధించటం దేనికి?"

వర్మ తన వాళ్ళవంక చూసి, "మీ చేతుల్లో తుపాకులేవీ?" అన్నాడు. తన దగ్గర రివాల్వర్ లేకపోవటం కూడా గమనించాడు అప్పుడే.

"వాళ్ళు లాగేసుకున్నారు. మా జేబుల్లోను, బెల్టుకట్టి దాచుకున్న బుల్లెట్సుకూడా తీసేసుకున్నారు. మేము ఏమీ చేయలేని స్థితిలో వుండిపోయాం!" అపుడు చెప్పాడు.

"అదే, అదే వశీకరణం! మిమ్మల్ని వశీకరణ మంత్రంతో ఆకట్టేసుకున్నారు వాళ్లు!" హిమవంత్ అన్నాడు.

"అబ్బ, యిక్కడేదో చెడు వాసన ముక్కుపుటాల్ని అదరగొడుతోంది!" అన్నది దీప్తి.

అభిలాష్ చిన్నగా నవ్వి, "ఇంతవరకు మీరెవరూ సరిగ్గా గమనించలేదుగాని, మనల్ని బంధించిన తాడు మామూలు తాడుకాదు! ఏవో జంతువుల నరాలతోను, పేగులతోను అల్లిన తాడు!" అన్నాడు.

అందరు ఒక్కక్షణం ఉలిక్కిపడి తమకి కట్టివున్న తాళ్ళవంక చూసి కెవ్వుమన్నారు.

నిజమే, ఏదో జంతు సంబంధమైన నరాలతోను పేగులతోను అల్లిన తాడు అది!

అందరికీ కడుపులో తిప్పినట్టయింది. ఏమీ తిని వుండ లేదుగాని లేకుంటే కడుపులో నిదంతా బయటికొచ్చేసి వుండేది—ఆ వాసన ఆ తాళ్ళనుండి వస్తున్నదే!

"ఎంత పాపాత్ములు వీళ్ళు! అసలు మనల్ని యిలా ఎందుకు కట్టిపడేశారు? చంపేసినా పీడా పోయేది!" అశ్విని కోపం, నిస్సహాయత ముప్పిరిగొంటున్న కంఠంతో అన్నాడు. అతడసలే ఆత్మాభిమానం పాలెక్కువున్న వాడు.

హిమవంత్ కూల్‌గా చూస్తూ, "ఒక్కసారి వచ్చి పోతే ఏముంది బ్రదర్! నాలుగు వింతలు చూసి చావాలి!

నీకన్న ఓసారి ఎక్కువ తాళ్ళతో కట్టించుకున్న నా సంగతేమిటి మరి? మాంత్రికుడికి నామీద ఎంత ప్రేమ లేకపోతే నన్ను స్పెషల్ గా బలివ్వబోయాడో నీకేం తెలుసు?" అన్నాడు నవ్వుతూ, బలి కార్యక్రమాన్ని మనోపథంలోకి తెచ్చుకుంటూ.

కార్తీక్ ఓసారి చిన్నగా హిమవంత్ ని గిల్లాడు. అతను నోరు విప్పితే రహస్యాలు వాటంతటవే వెల్లువలా బయటికొచ్చేస్తాయి! వాటిని కప్పిపెట్టడం మళ్ళీ తనవల్ల కాదు.

హిమవంత్ బుద్ధిగా నోర్మూసేసుకున్నాడు.

అప్పటికే వర్మకి ఉప్పు అందిపోయింది.

"అంటే మీ అందర్నీ మాంత్రికుడు బంధించి వుంచ లేదా?" అన్నాడు కార్తీక్ వంక సాభిప్రాయంగా చూస్తూ వర్మ.

"అశ్వని, భరణిని తప్ప అందర్నీ బంధించారండి. వాళ్ళిద్దరు చివర్లో లోపలికి పరుగెత్తుకొచ్చి ఓ పక్కగా దాగుండిపోయారు!" అన్నాడు కార్తీక్.

"ఓహో, వాళ్ళిద్దరు నక్షత్రాలు కదూ!" అన్నాడు వర్మ చిన్నగా నవ్వి.

అతని జోక్ వెంటనే అర్థంకాలేదు వాళ్ళకి! అశ్వని, భరణి, కృత్తిక మొదలైన నక్షత్రాల గురించి అతను చెపుతున్నాడని అర్థమయింది తర్వాత.

అభిలాష్, హిమవంత్ చెవిలో, "ఆ వర్మతో ఎందు కలా అస్తమాటు పరాచికాలాడతావు? పైకి కనిపించే టంత సౌమ్యుడు కాదనుకుంటానతను. అతని చిరాకులు, పరాకులు గమనించావా?" అన్నాడు.

హిమవంత్ కూడా అదే స్థాయిలో, "కావాలనే

అతన్ని ఆటపట్టిస్తున్నాను. అతని మాటవిని యీ గుహ లోకి అడుగు పెట్టడంవల్ల కదా మనకిన్ని కష్టాలు?" అన్నాడు.

"అదేమన్నమాట? ఓ విధంగా వర్మ, అతని పని వాళ్ళు మన ప్రాణాలు కాపాడారనే సంగతి మర్చి పోయావా?"

"అందుకే కదా, ఎంతమాత్రం యిష్టం లేకపోయినా అతనితో కలిసి లోపలికొచ్చాం. ఇక్కడ యిరుక్కు పోయాం! ఓ పక్క తిండిలేక శోషవస్తోంది కూడా! బాగా ఆకలిగా వుంది."

"ఏం చేస్తాం? ఓ గంటలో వెళ్ళిపోవచ్చు కదా అనుకున్నాం. ఇలా జరుగుతుందని తెలీదు కదా!"

కార్తీక్‌కి తన మిత్రుల సంభాషణ చూచాయగా విని పిస్తోంది.

వర్మ ఏదో చెప్పాలని నోరు తెరిచాడు. సరిగ్గా అదే సమయంలో నలుగురు అనుచరులు — యిందాకటి పది మందిలోనే వాళ్ళు - లోపలికొచ్చి వాళ్ళముందు నిలిచారు.

అందులో ఒకడు సూటిగా వాళ్ళవైపు చూసి, "మీరంతా ఎవరు? ఎందుకు మా తపస్సమాధిలోకి కాలు పెట్టి అపవిత్రం చేశారు?" అనడిగాడు.

వర్మ తలెగరేసి, "తపస్సమాధియా? మీరు తపస్సు చేసుకునే మునీశ్వరులు, మునికుమారులు అయితే హిమా లయాలకో, అడవులకో పోకుండా యిలా భూగృహా ల్లోను, గుహల్లోను వుండటం దేనికి?" అన్నాడు.

"అది మా యిష్టం. ఇక్కడ మా తపస్సు ఏర్పాటు చేసుకున్నాం! మా స్థలంలో అడుగుపెట్టి మమ్మల్ని భగ్నం చేసిందికాక వితండ వాదం దేనికి?" అన్నాడు

మరొకడు.

వాళ్ళతో వాదించటం అనవసరమనుకుని మౌనం వహించారు అందరు.

"చెప్పండి, మీలో మా గురువుగార్ని, మా సహచరుల్ని చంపినదెవరు?" మొదటివాడు అందరి వంకా కర్కశంగా చూశాడు.

"మేమెవరమూ కాదు!" అన్నాడు కార్తీక్.

"మీరే, మీరే చంపారు. అబద్ధం చెప్పి ప్రయోజనం లేదు. మాకు తెలీదనుకోకు" అతను అరిచాడు.

"తెలిస్తే మమ్మల్నడగడం దేనికి?" హిమవంత్ చురక అంటించాడు.

వాళ్ళకు సహాలం అంటింది. చకచక రెండోవాడు హిమవంత్ దగ్గరగా వెళ్ళి అతన్ని గుండెలమీద కాలెత్తి తన్నాడు. హిమవంత్ బాధతో మూలిగాడు.

"జాగ్రత్త, మాతో పరాచికాలాడకు" అన్నాడు పైగా.

"మునికుమారుడి నంటున్నావు,ఇలా తన్నటం వేలటం తపస్సు చేసుకునేవాడి లక్షణమా?" హిమవంత్ కోపంగా అరిచాడు.

ఆ అనుచరుడు మళ్ళీ తన్నాడు. "ఇక ఆట్టేవాగొద్దు. మీ అందర్నీ నిలువునా యిక్కడే పాతేస్తాం! మా సావరంలోకి ప్రవేశించే అధికారం ఎవరికీ లేదు. ఇక్కడి కొచ్చినవాడు ప్రాణాలతో బయటికి వెళ్ళినదిలేదు!" అన్నాడు.

మొదటివాడు అందర్నీ కలియచూసి, "మర్యాదగా మా వాళ్ళను చంపిన వాళ్ళెవరో చెప్పండి. వాళ్ళను

మాత్రం మా దేవికి బలిచ్చి తక్కినవాళ్ళని వదిలేస్తాం!" అన్నాడు.

వర్మ కల్పించుకుని, "మీ గురువుగార్ని, మీ సహచరుల్ని చంపినవాళ్ళు మా చేతుల్లో చచ్చారు. కావాలంటే గుహల బయట వాళ్ళ శవాలున్నాయి, పోయి చూసుకోండి!" అన్నాడు.

"మేం నమ్మం! మీరే చంపారు. వాళ్ళెవరో మీలోనే వున్నారు. మీ అందరూ యీ రాతిగదిలోపడి మలమల మాడి చావండి! మీ మొండి ప్రవర్తనకు, మీరుచేసిన దారుణానికి అదే శిక్ష!" అంటూ వాళ్ళు నలుగురు బయటికి వెళ్ళిపోయి ద్వారం మామూలుగా రాతి పలకల్తో మూసేశారు.

అందరు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

* * *

వర్మ లవుడి వంక చూసి, "హేండ్ బాంబులున్నాయా?" అనడిగాడు.

లవుడు జేబులు మోచేత్తో తడుముకుని, "ఉన్నాయి" అన్నాడు.

వర్మ కుశుడి వంక చూశాడు. అతను కూడా తడిమి చూసుకుని తలూపాడు.

"ఫ్రెండ్స్! మా దగ్గర హేండ్ బాంబులున్నాయి! వాటిని ప్రయోగించి యీ జింక చర్మంగాళ్ళని నాశనం చేసేద్దామా?" అన్నాడు వర్మ.

"బాంబులా?" అదిరిపడ్డా రందరు.

"అవును. ఇక వేరే దారిలేదు. వీళ్ళు మళ్ళీ వచ్చే లోపల మనం తాళ్ళు విప్పేసుకుని సిద్ధంగా వుందాం. వీలయితే బాంబులు ప్రయోగించకుండా బయటపడదాం!

తప్పనిసరి పరిస్థితుల్లో ఉపయోగిద్దాం!" అన్నాడు వర్మ.

కార్తీక్ తల అడ్డంగా తిప్పి, "వాటివల్ల ఈ మంత్ర గాళ్ళను చంపేయటం తేలిక కాదనను! కాని వాళ్ళతో బాటు మనం చచ్చిపోతాం!" అన్నాడు.

"అదెలా?"

"ఇది భూగృహమన్న సంగతి మరిచిపోయారా? బాంబుల అదురుకు అంతా కూలిపడిపోతుంది. బిలాన్ని తొలిచి సొరంగం చేసి లోపల వీళ్ళు నివాసముంటున్నారు. మనం బయటికి పరుగెత్తడానికి కనీసం ఓ పావుగంటకి తక్కువ పట్టదు! ఈ లోపల బిలం పూర్తిగా కూలి పూడి పోతుంది!" అన్నాడు కార్తీక్.

అవునన్నట్టు తలూపాడు వర్మ.

"మరెలా?"

"ముందు మన బంధనాలు తప్పించుకోవటమే! అదేం పాపమో మేము యీ టైగర్ హిల్స్‌కు వచ్చాక ఏ కొద్ది గంటల మాత్రమో ఫ్రీగా వున్నాం. అంతే! ఆ తర్వాత ఎవరోకరు మమ్మల్ని కాళ్లు చేతులు కట్టిపడేస్తూనే వచ్చారు" అన్నాడు అఖిలాష్.

అందరు విరక్తిగా నవ్వుకున్నారు.

"ఈ నరాలు తెంపుకోవటం సాధ్యమయ్యే పని కాదు. ఏదైనా చాకో బ్లేడులాంటి ఆయుధమో వుంటే తప్ప బంధాలు తెంచుకోవటం కష్టం!" అన్నాడు కార్తీక్.

అశ్వని అటు యిటు చూసి, "అదిగో ఆ రాతిపలక చాలా సూదిగా కత్తిలా వుంది. దానికి రాపాడిస్తే ఫలితం వుండొచ్చు!" అన్నాడు.

అందరి దృష్టి అటు మళ్ళింది. అవును, అశ్వని చెప్పింది నిజమే!

ఓ అరగంట తర్వాత అందరి చేతులు కాళ్ళు తిరిగి రక్త ప్రసరణాన్ని నిరాటంకంగా ప్రసాదింప చేయగలిగాయి.

"వాళ్ళొచ్చే వరకు ఆగటం దేనికి, పదండి పోదాం!" అన్నాడు కాత్రీక్ వర్మ నుద్దేశించి.

"అప్పుడు కూడా వీళ్ళు వెంటపడి వేధించరని నమ్మక మేముంది? వీళ్ళ అంతేదో చూసే వెళ్దాం!" అన్నాడు వర్మ.

ఎవరికీ అతని మాటలు రుచించలేదు. కావాలని పంతానికి పోతున్నాడు వర్మ! యెలాగో తప్పించుకు బయటపడితే చాలని అందరి మనసుల్లోనూ వున్న అభిలాష!

వాళ్ళు రాళ్ళు కదిలించేలోపల ఎలా గమనించారో మాంత్రికుడి అనుచరులు లోనికొచ్చారు. అయిదుగురు!

ఒక్కసారి వర్మతో బాటు లవుడు కుశుడు వాళ్ళమీద పడిపోయారు. గది అమర్చిన రాళ్ళతో వాళ్ళని మోదేశారు గట్టిగా.

ముగ్గురు అక్కడికక్కడే ప్రాణాలు వదిలేశారు. మరో యిద్దరు చాలా లాఘవంగా తప్పించుకు పారిపోయారు!

"మిష్టర్ కాత్రీక్! వాళ్ళను వదలొద్దు. తక్కిన వాళ్ళను తీసుకొస్తారు. వెంట మారణాయుధాలు కూడా తెస్తారు. బి, ఎలర్ట్!" అన్నాడు వర్మ.

లవుడు, కుశుడు వేటకుక్కల్లా కొంతదూరం ఆ ఇద్దర్ని తరిమి మళ్ళీ వెనక్కు వచ్చారు.

"అక్కడ ఏవో చిన్న చిన్న గదుల్లాగా వున్నాయి. అందులో దూరారు వాళ్ళు!" అన్నాడు కుశుడు.

"మన తుపాకీలు ఎక్కడ దాచేశారో తెలియదు. అవే వెంట తెచ్చి మనల్ని చంపినా అనుమానంలేదు!"

అన్నాడు అవుడు.

"మనం యీ రాళ్ళనే ఆయుధాలుగా తీసుకుని వాళ్ళని యెదిరించాలి. అంతకుమించి ఆయుధాలేము న్నాయి?" అన్నాడు కార్తీక్.

అందరు రాళ్ళ గదిలోపలికి వచ్చేశారు.

"వాళ్ళు గుళ్ళు పేల్చినా మనకి ఈ రాళ్ళు రక్షణగా వుంటాయి. ఇందులో బోర్లా పడుకోండి అందరు!" అన్నాడు కార్తీక్ మిత్రులవంక చూసి.

అందరు రాబోయే ప్రమాదాన్ని మౌనంగా ఎదుర్కోవటానికి సిద్ధంగా వున్నారు.

అరగంట గడిచింది, గంట గడిచింది! ఎవరూ రాలేదు.

ఎక్కడా ఎలాంటి అలికిడీ లేదు.

అందరూ తలలు పైకెత్తి రాతిగదిలోనించి బయటికి చూశారు. చచ్చిన ముగ్గురు అనుచరులు తప్ప అక్కడ యెవరూ లేరు!

వర్మ సాలోచనగా కార్తీక్ వంక చూసి, "వీళ్ళేదో పెద్ద ప్లాన్ మీదున్నారు. ఇలా ఎంతసేపుంటాం? పదండి, వాళ్ళ సంగతి యిప్పుడే తేల్చుకుందాం!" అన్నాడు.

"మనం గదిబయటికి రావటంకోసమే వాళ్ళు ఎదురు చూస్తున్నారేమో! బయటికి రాగానే దాడిచేసి నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తే....?" అన్నాడు కార్తీక్.

"వాళ్ళు చూడబోతే పిరికినాయాళ్ళలా వున్నారు. మనం యెదురు తిరగ్గానే పారిపోయారు. ధైర్యమున్న వాళ్ళయితే యీపాటికి తప్పకుండా వచ్చి వుండేవాళ్ళు-మన దగ్గర ఆయుధాలు లేవుగాని, వాళ్ళకేం? మన తుపాకీలు రెండు, రివాల్వర్ ఒకటి, రౌండ్సు అన్నీ వున్నాయి."

"అయితే వాటిని ప్రయోగించటం తెలీదేమో!"
"సరే మా లవుడు, కుశుడు పోయి వస్తారు! తర్వాత మనం వెళ్లొచ్చు!" అన్నాడు వర్మ.
లవుడు కుశుడు వెంటనే లేచి బయటికి వెళ్ళారు. అందరికీ గుండె లయ తప్పి నడుస్తోంది. వాళ్ళిద్దరు నిర్భయంగా, యిందాకా అనుచరులు తప్పించుకు పోయిన దిశగా వేగంగా సాగిపోయారు!
అరగంట గడిచింది.
గంట గడిచింది. వెళ్ళిన యిద్దరి జాడలేదు!
వర్మ అసహనంగా కదిలాడు.
"లాభంలేదు, వీళ్ళిద్దర్నీ వాళ్ళు పట్టుకున్నారు. బహుశా ప్రాణాలతో వుంటారో, లేదో తెలీదు! మీరు నాతో రాదలచుకుంటే రండి, నే వెళ్తున్నాను!"
"వర్మగారూ! పదండి. మేమూ వస్తున్నాం" అన్నాడు కార్తీక్.
వర్మ వాళ్ళ వంక అభిమానంగా చూసి నవ్వాడు.
అందరు లవుడు, కుశుడు వెళ్ళినవైపుగా నడుచుకుంటూ పోయారు. నడిచినంతసేపు పక్కలకు కాషన్‌గా చూసుకుంటూనే వున్నారు. ఏ మూలనుండి అనుచరులు ఎటాక్ చేస్తారోనని అందరికీ ఓ పక్క అనుమానంగానే వుంది!
అక్కడ తమను బంధించిన రాతిగదుల వంటివి ఒక దానిపక్క మరొకటిగా నాలుగైదు కనిపించాయి.
వర్మ సాభిప్రాయంగా కార్తీక్ వంక చూశాడు. ఒకరి వెనుక మరొకరు చప్పుడు చెయ్యకుండా ఆ గదుల్ని సమీపించారు.
మొదటి గది దగ్గర ఆగారు.

రాతికి రాతికి మధ్య వున్న ఖాళీల సందునించి లోపలికి చూశారు.

అంతే! అందరి నరనాడులూ భయంతోను, గగుర్పాటుతోను స్తంభించి పోయాయి! ఊపిరిపీల్చటం మరిచి అటే చూడసాగారు.

లోపల నిలువెత్తు కాళికా విగ్రహం! సరిగ్గా నేల మాళిగ మెట్లు కిందచూసిన విగ్రహంలాగానే వుంది. అదే తెచ్చి అక్కడ పెట్టారా అన్నంత దగ్గర పోలిక!

విగ్రహం కాళ్ళ ముందున్న మధ్య శిలలమీద లవుడు, కుశుడు తలల మొండేలనుంచి వేరుపడి రక్తం మడుగులో పడివున్నారు.

విగ్రహం ముందు నిల్చుని వున్న వ్యక్తిని చూస్తూనే అందరు అదిరిపడ్డారు. అతని చేతిలో రక్తం కారుతున్న కత్తి!

అతని గుండెలమీద త్రిశూలంతో చేయబడ్డ మూడు గాయాలు నల్లగా స్పష్టంగా కనిపిస్తున్నాయి! చని పోయాడనుకున్న మాంత్రికుడు సజీవంగా కనిపించటంతో వాళ్ళు విస్తుపోయి చూస్తున్నారు.

* * *

కొద్ది క్షణాలసేపు ఎవరూ మాట్లాడకుండా కదల కుండా అలాగే శిలా ప్రతిమల్లా నిల్చుండిపోయారు.

వర్మ ఆగ్రహంతో నిలువెల్లా ఒణికిపోతున్నాడు. చేతులారా యిద్దరు నమ్మిన బంట్లను అలా మాంత్రికుడికి బలిచేశానే అని పశ్చాత్తాపంతో తల్లడిల్లి పోతున్నాడు. లవుడు, కుశుడు తన మాటమీదే తెగించి మాంత్రికుడి గుహలోకి చొచ్చుకుపోయి ప్రాణాలు పోగొట్టుకున్నారు! తనే....తనే...వాళ్ళని కోరి మృత్యు గుహలోకి పంపిం

చాడు!

కార్తీక్ తేరుకుని వర్మ చేతిని మృదువుగా నొక్కాడు. అందరికీ వర్మ మనో సంక్షోభం బాగా అర్థమయింది! ఓ విధంగా తమ ప్రాణదాత లిద్దరు ప్రాణాలు పోగొట్టు కున్నారు! ఉన్న ఒకడు—వర్మ—అతనే ప్రస్తుతం తమకు ఆత్మీయుడు, శ్రేయోభిలాషి, మార్గదర్శకుడు!

అశ్విని, హిమవంత్ ఆవేశంతో పిడికిళ్ళు బిగించి, "ఎటాక్ యిచ్చేద్దామా?" అన్నారు.

కార్తీక్ మందలిస్తున్న ధోరణిలో వాళ్ళవంక చూసి, "బతకాలని లేదా? మన చేతుల్లో ఏవిధమైన ఆయుధాలు గాని, ప్రాణరక్షణ సాధనాలుగాని లేవు. ఎలా ఎటాక్ చేద్దామనుకుంటున్నారు?" అన్నాడు.

దీప్తి ఆ దృశ్యం చూడలేక ముఖం తిప్పేసుకుంది! అభిలాష్ ముఖంలో ఎలాంటి భావము వ్యక్తం కావటం లేదు. ఏదో ఆలోచిస్తున్నాడు.

ఈలోపల రాతిగదిలోని మాంత్రికుడు కదిలాడు. కాళికా విగ్రహంవైపు దీక్షగా చూస్తూ పెదవులు కదిలిస్తున్నాడు. అతనికి యిరువైపులా శిష్యులు నమ్రతగా నిల్చుని అగ్నిలో ఏవేవో మూలికలు వేల్చుతున్నారు.

నిలువెత్తు కాళికా విగ్రహం లవుడు, కుశుడి రక్తాన్ని తనివితీరా ఆరగించినట్టు, బాగా తృప్తిచెందినట్టు శాంత గంభీరంగా వున్నట్టు అనిపించింది అందరికీ. వర్మ ముఖం కాళికా విగ్రహం ముఖం రెండూ ఎర్రగానే వున్నాయి. వర్మ ముఖం ప్రతీకార జ్వాలతో ఎర్రబడితే, అమ్మవారి ముఖం అక్కడి ఎర్రటి మంటల వెలుగు ప్రతిఫలించి ఎర్రబడింది!

మాంత్రికుడు వంగి లవకుశుల నెత్తురుతీసి అమ్మవారి

నోటికి పూశాడు. అంతదాకా ఏదో పాత్రలో పట్టి వుంచిన వాళ్ళిద్దరి నెత్తురు విగ్రహాం కాళ్ళముందుకి జరి పాడు. గుగ్గిలంలాంటి ఏదో పదార్థం పొగ వేశాడు.

గాలిగదినిండా దట్టమైన ఘాటైన పొగ అలముకుంది.

శిష్యులు గట్టిగా మంత్రాలు వల్లిస్తూ నించుని వున్న వాళ్ళు ఒక్కసారిగా చలనం వచ్చినట్టు అటు యిటు గెంతుతూ నాట్యం చేయసాగారు.

అశ్వని లెక్కపెట్టాడు—సరిగ్గా ఏడుగురున్నారు—మాంత్రికుడితో కలిసి ఎనమండుగురు! అంటే పదిమంది శిష్యులున్నారన్నమాట. ముగ్గుర్ని తాము చంపేశారు! గతంలో యిద్దర్ని నేలమాళిగ మెట్లదగ్గ చంపేశారు. వాళ్ళతో కలుపుకుని వీళ్ళు పన్నెండుమంది అనుచరు లన్నమాట.

అశ్వని మాటి మాటికీ ఒకటే మాట మననం చేసు కుంటున్నాడు — శత్రుశేషం వుంచరాదు. ఈ ఎనిమిది మందిని చంపిగాని బయటికి పోకూడదు.

అభిలాష్, హిమవంత్, కార్తీక్ కూడా యిదే ఆలో చిస్తున్నారు. దీప్తి ముఖంలో ఎలాంటి భావము ద్యోతకం కావటంలేదు. వర్మ ఆ క్షణమే వాళ్ళందర్నీ చంపి పారేద్దామన్నంత కోపంతో ప్రతీకార వాంఛతో రగిలి పోతున్నాడు.

అందరి వంకా తిరిగి, "మన ఆయుధాలు బహుశా పక్క గదుల్లో వున్నాయేమో పోయి చూద్దామా?" అన్నాడు.

కార్తీక్ తలూపాడు. "ఇలాంటి రాతి గదులే ఇంకా మూడు—నాలుగున్నట్టుంది. బహుశా అందులో ఇంకా ఏవో రహస్యాలుండవచ్చుననిపిస్తోంది" అన్నాడు.

"వీళ్ళు యీ కర్మకాండ ముగించేలోపల మనం వీళ్ళ అంతు చూడకపోతే మనందర్నీ యిదే విధంగా ఆ విగ్రహానికి బలిచ్చేయటం ఖాయం! అసలే వీళ్ళలో ముగ్గుర్ని చంపేశాం! ఆ కసితోనే వాళ్ళు మా లవకుశుల్ని దారుణంగా తలలు నరికి బలిచ్చేశారు! రక్తానికి రక్తం, ప్రాణానికి ప్రాణం బలి తీసుకుంటాడీ శర్మ! వీళ్ళు ఎనమండుగుర్నీ యిదే విగ్రహానికి బలిచ్చేవరకు నాకు మనశ్శాంతిలేదు!" శర్మ మాటలు ఎంతో నెమ్మదిగా వినిపించినా, అందులోని వజ్రసరి కల్పం అందరి మనసుల్ని మంచులా తాకింది.

అందరు మళ్ళీ రాళ్ళ సందునించి లోపలకి చూశారు. అంతకంతకూ వాళ్ళ మంత్రోచ్చారణ తారస్థాయి నందుతోంది. అందరు పూనకంపట్టిన వాళ్ళలా గెంతుతూ, ఎగురుతూ, తుళ్ళుతూ ఈ లోకంకాని మరేదో లోకంలో అరనిమీలిత నేత్రాలతో దేనినో చూస్తున్నారు.

శర్మ చకచక దారితీశాడు. అతని వెనుకనే కార్తీక్ బృందం కదిలారు.

రెండో రాతిగది ప్రవేశించారు. అక్కడ నేలమీద జింక చర్మాలు పరచబడున్నాయి. కొన్ని పుర్రెలు, చేతి ఎముకలు పోగుపడి వున్నాయి. సింధూరం, కుంకుమ రాశులు పోసివున్నాయి. అదో చిన్నసైజు స్టోరురూంలా వుంది!

మూడో గదిలోకి ప్రవేశించారు.

అక్కడ ఏవేవో ఏళ్ళు, గుర్తు తెలీనివి పేరు తెలీనివి గుట్టలుగా పడున్నాయి. రకరకాల పువ్వులు, రంగురంగుల పువ్వులు — యివే రకం పూలు కాళికా విగ్రహంవద్ద కూడా వున్నాయి.

నాలుగో గదిలోకి ప్రవేశించారు.

అక్కడ వాళ్ళూహించినట్టే మాంత్రికుడి అనుచరులు తమవద్దనుంచి స్వాధీనం చేసుకున్న తుపాకీలు రెండు, రివాల్వర్ ఒకటి, లకుకులవద్ద నుంచి తీసుకున్న బులెట్ల బెల్టు అన్నీ అలాగే చెక్కుచెదరకుండా ఓ పక్కగా పెట్టి వున్నాయి.

వర్మ ఒక్క అంగలో తన రివాల్వర్ అందుకున్నాడు. లకుకుల తుపాకులు రెండూతీసి కార్తీక్ కి, అశ్వనికి అందించాడు. అశ్వని బుల్లెట్సున్న బెల్టు తీసుకుని నడుముకు కట్టుకున్నాడు.

వర్మ చకచక రివాల్వర్ లోడ్ చేసుకున్నాడు.

అశ్వని తన చేతిలోని తుపాకీ లోడ్ చేసుకుని, రెండు గుళ్ళు కార్తీక్ కందించాడు. కార్తీక్ తన చేతిలోని తుపాకీ లోడ్ చేసుకున్నాడు.

వర్మ అందరివంకా చూశాడు. "మీరందరూ నా వల్ల చిక్కుల్లో పడిపోయినందుకు నాకు బాధగా వుంది! మీరు ఎక్కడైనా దాక్కుని వుంటే, నేను పోయి వాళ్ళను చంపేసి వస్తాను" అన్నాడు.

కార్తీక్, వెంటనే అందుకుని, "మా ప్రాణాలు ఎప్పుడో పోవలసింది—మీ వల్ల రక్షింపబడ్డాయి! అంటే యీ ప్రాణాలు మీకన్న మాట! మీ కోసం ఏం చెయ్యమన్నా సిద్ధంగా వున్నాం!" అన్నాడు.

తక్కినవాళ్ళు అవునన్నట్టు తల లూపారు.

వర్మ నవ్వి "థాంక్యూ వెరీమచ్! మీ అభిమానానికి చాలా కృతజ్ఞుణ్ని!" అన్నాడు.

* * *

అందరూ గుహలాంటి ఆ రాతిగది నుండి బయిటికి

వచ్చారు. మాంత్రికుడు, అనుచరులు వున్న మొదటి గది వైపు వేగంగా దూసుకుపోయారు. వాళ్ళతో నడవలేక దీప్తి వెనకబడుతుంటే కార్తీక్ రెండడుగులు వెనకగా వుండి, ఆమెను జాగ్రత్తగా నడిపించుకు వెళ్ళాడు.

సరిగ్గా అదే సమయంలో నలుగురు అనుచరులు చేతుల్లో ఎముకలు, శూలాలు ధరించి తమ నిదివరలో బంధించిన రాతిగదివైపు నడుస్తూ వెళ్ళటం వాళ్ళకు కనిపించింది.

వర్మ ఆగి అందరికేసి చూపులు సారించి, "వాళ్ళు మన కోసమే వెళ్తున్నారు! మన దగ్గిర ఆయుధాలు లేవు కదా అని వాళ్ళ ధైర్యం! అందుకే కేవలం శూలాలు మాత్రం తీసుకుని వెళ్తున్నారు, మనల్ని పొడిచి చంపాలని!" అన్నాడు.

హిమవంత్ వెంటనే "వాళ్ళ చేతుల్లోవున్న ఎముకల సంగతి మరిచినట్టున్నారు మీరు! ఇంతసేపూ దేవీపూజలో వుంచిన ఎముకలు! వాటికి యెక్కడలేని శక్తులూ సంక్రమించి వుంటాయి. క్షుద్రశక్తుల్ని మనమీద ప్రయోగించి చంపటానికే వెళ్తున్నారు!" అన్నాడు.

వర్మ తల విదిలించాడు. "నో, అంతా ట్రాష్! ఆ ఎముకల్లో ఏ ప్రభావము, మహిమలూ లేవు. అదో రకమైన కనికట్టు విద్యతో వాళ్ళు మన అవయవాలు స్తంభింప చేస్తున్నారు. అంతే! అలా చేసి శూలాలతో పొడిచి చంపుతారు, అందుకే ఆ శూలాలు!...." అన్నాడు.

అభిలాష్ యేదో చెప్పబోయి కార్తీక్ సంజ్ఞ చేయటంతో ఆగిపోయాడు.

"మనం వెనకనుంచి వాళ్ళని కాల్చేద్దాం" అన్నాడు

వర్మ రివాల్వర్ గురి చూసుకుంటూ.

కార్తీక్ కూడా తుపాకీ సరిచూసుకున్నాడు. అశ్వని అంతకు ముందే సిద్ధంగా వున్నాడు.

అనుచరులు రాతి గదిని సమీపించబోతున్న సమయంలో ఒక్కసారిగా వెనుకనుంచి కార్తీక్, వర్మ, కాల్పులు సాగించారు.

అనుచరులు యీ దాడి నెదుర్కోవటానికి సిద్ధంగా లేరు. పెద్దగా చావుకేకలు పెడుతూ నేలమీద పడి పోయారు నలుగురూ.

రివాల్వర్ చప్పుళ్ళకి తక్కిన ముగ్గురు అనుచరులు గది లోపల్నుంచి తొంగి చూశారు. వెంటనే తలలు లోపలకు తప్పుకోవటం అశ్వని దృష్టిలో పడింది!

"వాళ్ళు చూశారు. మాంత్రికుడితో పాటు నలుగురు మిగిలారు. వాళ్ళు తప్పించుకు పారిపోయే లోపల మట్టుబెట్టాలి. హారియప్....!" అంటూ పరుగెత్తాడు అశ్వని!

వర్మ, కార్తీక్ కూడా పరుగులు పెట్టారు మాంత్రికుడి గదివైపు! కార్తీక్ పరుగెడుతూనే అభిలాష్‌ని హిమవంత్‌ని, దీప్తిని రావద్దని సైగ చేశాడు. వాళ్ళు రాతి గదివద్దే ఆగిపోయారు.

అశ్వని ముందుగా మాంత్రికుడి గదిలోకి ప్రవేశించాడు. ఆ వెనుకనే వర్మ, కార్తీక్ ఆయుధాలతో ప్రవేశించారు.

కాని గదిలో ఎవరూ కనిపించలేదు.

నిలువెత్తు కాళికా విగ్రహం వాల్కలు చాచుకుని భయంకరంగా కనిపిస్తోంది!

అక్కడ లవుడి, కుశుడి మొండేలు గాని తలలు గాని

లేవు!

అశ్విని, కార్తీక్, వర్మ ఆశ్చర్యంగా గది మధ్యలో నిలబడి చూస్తున్నారు. వాళ్ళ చేతుల్లో ఆయుధాలు ప్రమాదా న్నెదుర్కోటానికి సిద్ధంగా వున్నాయి.

కాని శత్రువుల జాడే లేదు!

*　　　*　　　*

ఎంత సేపటికీ వెళ్ళినవాళ్ళు తిరిగి రాకపోవటంతో అభిలాష్, హిమవంత్ రాతి గదివద్ద కాళ్ళుగాలిన పిల్లుల్లా తిరుగుతున్నారు. దీప్తి బాగా బెదిరిపోయింది. వాళ్ళిద్దరి వైపు బేలగా చూస్తోంది.

ఆమెని చూస్తుంటే వాళ్ళిద్దరికీ బాగా జాలేసింది.

"మిస్ దీప్తీ, మీ రనవసరంగా మాతో ఫాలో అయ్యారనిపిస్తోంది! అసలు సర్వేకి బయలుదేరకుండా వుంటే బావుండేది. మీ ఉత్సాహాన్ని చూసి మన ప్రొఫెసర్ బయల్దేరతీశారు. ఆయన ఉద్దేశమూ మంచిదే, మీ ఆశయమూ మంచిదే. కాని యిలా అరణ్యాంతరంగా గూండాలకు, మంత్రిగాళ్ళకు చిక్కుపడి మానసికంగాను, శారీరకంగానూ బాగా నలిగిపోతున్నారు...." అన్నాడు అభిలాష్.

హిమవంత్ ఆవేశంతో చిందులు వేశాడు. "ఎలాగో రెండుసార్లు ప్రాణాలు కాపాడుకోగలిగామని సంతోషిస్తుంటే యీ వర్మ తయారయ్యాడు మన ప్రాణాలకి! ఈ పాటికి మనం వూరు చేరిపోయేవాళ్ళం. ఓ పక్క తిండితిప్పలు లేవు. దాహానికి నీరు లేదు. కంటికి నిద్ర లేదు. సుఖం, శాంతి మొదలే లేవు. ప్రతిక్షణం ప్రాణాలను అరచేత పట్టుకొని యిలా చస్తూ బతలేకపోతున్నాము...." అన్నాడు.

అభిలాష్ ఓదార్పుగా చూశాడతనివంక.

"ఎన్ననుకున్నా యేం లాభం? ప్రమాదాల సుడి గుండంలో చిక్కుకుపోయున్నాం. ఇప్పుడు సురక్షితంగా బయటపడే దారి చూసుకోవాలి!" అన్నది దీప్తి, చచ్చిన నలుగురు అనుచరుల శవాలకవంక జుగుప్సతో చూస్తూ.

అభిలాష్ చెవులు రిక్కించి విన్నాడు. మాంత్రికుడి గది దగ్గర ఎలాంటి సవ్వడీ వినిపించటంలేదు.

"హిమా, మనవాళ్ళేమయ్యారు? ఎక్కడా బుల్లెట్ శబ్దాలు వినిపించటంలేదు. అసలు ఏ విధమైన చప్పుడూ వినరావటం లేదేమిటి?" అన్నాడు.

హిమవంత్, దీప్తి తలలూపి, "అదే అంతుపట్టడం లేదు. ఈ సరికి ఆ మాంత్రికుడ్ని, అనుచరుల్ని అంతంచేసి తిరిగిరావలసిందే మరి!" అన్నారు.

అభిలాష్ అసహనంగా అటు యిటు పచార్లు చేస్తున్నాడు. ఓ పక్క నలుమూలలా చీకట్లు ముసురుకొంటున్నాయి. వాచీ చూశాడు. నాలుగు గంటలు కావస్తోంది. బయటి ప్రపంచంలో మరో రెండు గంటలకు గాని పోవని పొద్దు—అక్కడ, నాలుగింటికే చీకట్లు చిమ్మిపోతోంది.

హిమవంత్ కుదురుగ్గా నిల్చుని, "అభీ, ఏం జరిగిందో పోయి చూసివద్దామా?" అన్నాడు.

అభిలాష్ తలూపి, "మిస్ దీప్తీ, మీరు ఒక్కరూ ఇక్కడ వుండగలరా?" అన్నాడు.

దీప్తి తల అడ్డంగా తిప్పింది. "ఈ శవాల మధ్య నించోవటానికే సగం చచ్చిపోయి వున్నాను. మీరు లేకపోతే నా ప్రాణాలు నావి కావు!" అన్నది

దిగులుగా.

"ఆల్ రైట్, రండి. అంతా కలిసే వెళ్దాం!" అన్నాడు అభిలాష్ ముందుకి అడుగులు వేస్తూ.

ముగ్గురు మొండిధైర్యంతో మాంత్రికుడి గది దగ్గరకు చేరుకుని బయటి నుంచే, రాళ్ళ మధ్య కంతల ద్వారా చూశారు.

లోపల ఎవరూ లేరు!

మాంత్రికుడుగాని, ముగ్గురు అనుచరులుగాని లేరు సరికదా, వర్మ, అశ్విని, శ్రీక్ కూడా లేరు!

నిలువెత్తు కాళికా విగ్రహం మాత్రం నాల్కలు చాచుకొని భయంకరంగా కనిపిస్తోంది.

*　　　*　　　*

"ఇదేదో ఎత్తుగడలాగా వుంది. ఏ పక్క నుంచో దాడి చేయబోతున్నారని నా నమ్మకం!" మెల్లగా గొణిగాడు వర్మ.

అశ్విని చెవులు రిక్కించి విన్నాడు.

గాల్లో ఏవో అర్థం తెలీని శబ్దాలు చాలా నెమ్మదిగా జాగ్రత్తగా వింటేనేగాని వినిపించనంత నెమ్మదిగా కర్ణపుటాలని తాకుతున్నాయి.

అంతకు మించి వాతావరణంలో చెప్పుకోదగ్గ విశేషమేమీ కనిపించలే దెవరికీ!

శ్రీక్, అశ్విని తుపాకుల్ని కుదురుగా పట్టుకుని వున్నారు! ఏ పక్కనుంచి శత్రువులు దాడి చేసినా కాల్చెయ్యటానికి సిద్ధంగా వున్నారు.

"ఇక్కడ ఏదైనా నేలమాళిగ వుందేమో....!" అనుమానం వెలిబుచ్చాడు అశ్విని.

శ్రీక్ ఆశ్చర్యంగా చూసి, నేలమాళిగలో మరో

నేలమాళిగా? నువ్వు చెప్పేది వింతగా వుంది!" అన్నాడు.

వర్మ రివాల్వర్ పట్టుకుని కాళికా విగ్రహం వెనక పక్కకు వెళ్ళాడు. అక్కడ ఎవరైనా దాక్కుని వున్నారేమోనని అతని వూహ నిజంకాలేదు.

కార్తీక్ యీ లోపల నేలమీద రక్తపు టడుగులు గమనించాడు. అవి సరాసరి పక్కనున్న రాతి గదిలోకి దారి తీస్తున్నాయి.

వర్మవైపు తిరిగి, "అదిగో అడుగు జాడలు! కింద శవాల్ని యీడ్చుకుపోయిన చిహ్నంగా పొడుగ్గా రక్తపు ధారా చూశారా?" అన్నాడు.

వర్మ పరీక్షగా చూసి "ఎస్! మనం వచ్చేలోపల, పక్క గదిలోకి శవాల్ని యీడ్చుకుపోయారన్న మాట! బి ఎలర్ట్. పక్క గదిలోకి వెళ్ళి చూద్దాం!" అన్నాడు.

రాతి తలుపు తొలగించి, ముగ్గురు ఆయుధాలు సరిగా పట్టుకుని, చుట్టూ పరికించి చూస్తూ పక్క గదిలోకి వెళ్లారు.

గది పూర్తిగా ఖాళీగా వుంది.

అంతక్రితం తాము చూసిన పుర్రెలు, ఎముకలు, జింక చర్మాలు—ఏవీ లేవక్కడ!

ముగ్గురు ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు!

అక్కడ నేలమీద శవాల్ని యీడ్చుకుపోయారన టానికి నిదర్శనంగా రక్తపు జాడలు, అడుగు జాడలు వున్నాయి!

ఒకరినొకరు ఆశ్చర్యంగా చూసుకున్నారు.

ఇదివరలో యిలా ఒక గదిలోనుంచి మరో గదిలోనికి

దారి వున్నట్టు తాము గమనించలేదు. రాతి పలకలతో కట్టిన గదులే కాబట్టి, అవసరార్థం వాటిలో కొన్నిటిని తొలగించి దారి చేసుకుని పక్క గదుల్లోకి ప్రవేశిస్తూ వెళ్ళారు.

తీసి వేసిన రాతి పలకలు చిందర వందరగా పడు న్నాయి!

మూడో గదిలోకి వెళ్ళారు.

అక్కడ మాత్రం పూలు, పళ్ళు గుట్టలుగా పడి వున్నాయి. తామిదివరకు చూసినవే! పక్క గదిలోనికి కూడా రక్తపుజాడలు స్పష్టంగా కనిపించాయి.

నాలుగో గది—తమ ఆయుధాలు దాచి పెటబడిన గది ప్రవేశిస్తూనే ముగ్గురు ఆయుధాలు గురిపెట్టికాల్చారు. కాని గుళ్ళు బయటికి రాలేదు.

కంగారుగా మళ్ళీ మళ్ళీ ట్రిగ్గర్ మీద వేళ్ళుంచి నొక్కబోయారు. కానీ వాళ్ళ చేతులు సహాకరించలేదు. వేళ్ళు వంగలేదు.

ఎదురుగా ముసలి మాంత్రికుడు భయంకరాకారంతో నిప్పులు కక్కుతున్న చూపులతో, కుడిచేతిలో ఎముక పట్టుకొని గాల్లో ఊపుతూ ఏదో స్మరిస్తున్నాడు.

పక్కనే ముగ్గురు అనుచరులు వున్నారు!

• • •

"చిత్రంగా వుందే! గదిలో యెవరూ లేరు. కనీసం మనవాళ్ళు ఎవరూ కనిపించరే....!" అన్నాడు హిమ వంత్ ఆశ్చర్యాన్నణచుకుంటూ.

అభిలాష్, దీప్తి కూడా అదే అయోమయ స్థితిలో వున్నారు! అంత క్రితం మాంత్రికుడు లకవుకుల్ని బలిచ్చిన

సూచనలు కూడా అక్కడ కనిపించటం లేదు. ఏమీ జరగనట్టే అతి ప్రశాంతంగా వుంది వాతావరణం!

"లోపలికి పోయి చూద్దామా?...." అన్నాడు అభిలాష్.

హిమవంత్ తలూపి, "నిండా మునిగాక చలేమిటి? ఇదేమిటో తేల్చుకుసే పోగాం. మనవాళ్ళేమైపోయారో, ఈ రాతి గదుల్లో ఎక్కడ మిస్సయ్యారో, ఆ మాంత్రికుడు, వాడి అనుచరుల సంగతేమయిందో, అంతా విచిత్రంగా కనిపిస్తోంది!" అన్నాడు.

అభిలాష్ దీప్తితో "రండి, లోనికి వెళ్ళి చూద్దాం!" అన్నాడు పొడిగా. ఆమె బయల్దేరింది వాళ్ళ వెంట.

అభిలాష్ మాంత్రికుడి గదిని పరీక్షగా చూశాడు. రక్తపు జాడలు కనిపించాయి. అతని భ్రుకుటి ముడి పడింది.

దీప్తివంక సాభిప్రాయంగా చూశాడు. ఆమె కూడా ఆ రక్తపుజాడల్ని పక్క గదిలోకి అవి దారి తియ్యటం గమనించింది.

అభిలాష్ విగ్రహం చెంత వున్న శూలాలు గమనించాడు. రెండు శూలాలున్నాయి. అంత క్రితం నలుగురు అనుచరులు నాలుగు శూలాలు తీసుకుని తమను చంపేందుకు పోయి చచ్చారు!

అభిలాష్ అవి రెండూ అందుకుని ఒకటి హిమవంత్ కిచ్చాడు. "ప్రస్తుతానికి ప్రాణరక్షణకు యింతకన్నా వేరే ఆయుధాల్లేవు. పక్క గదిలోకి పోదాం, పదండి!" అన్నాడు.

ముగ్గురు పక్క గదిలోకి వెళ్ళారు. అక్కడా ఎవరూ లేరు. మూడో గదిలో పూలు, పళ్ళరాశులు కనిపించాయి.

సాలుగో గదిలోకి ప్రవేశించబోయి చటుక్కున ఆగి-పోయాడు అభిలాష్. అతని వెనకనే హిమవంత్, దీప్తి ఆగిపోయారు.

ఆ గదిలో మాంత్రికుడు, అతని అనుచరులు నించుని వున్నారు. ఎదురుగా చేష్టలుడిగి చేత రివాల్వర్లతో శర్మ, తుపాకులతో కార్తీక్, అశ్విని కదలకుండా అచేతనంగా నిలబడి వున్నారు. నేలమీద అడ్డదిడ్డంగా మొండేలు, తలలు వుడివున్నాయి. అవి లవకుశల కళేబరాలు!

వాటిని పరీక్షగా చూసి ఉలిక్కిపడ్డాడు అభిలాష్. లవుడి శరీరానికి కుశుడి తల, కుశుడి శరీరానికి లవుడి తల అమర్చబడి వున్నాయి.

గాల్లో వింత శబ్దాలు—సంయ్ మంటూ గాలిని కోస్తూన్న సవ్వడి. వింత అలజడి!

మెట్లదగ్గర నేలమాళిగవద్ద సరిగ్గా ఇదే శబ్దాలు వినిపించాయి.... అప్పుడే మాంత్రికుడ్ని తను సంహరించాడు!

మాంత్రికుడు అనుచరులవంక చూసి కళ్ళతోనే ఏదో సైగ చేశాడు.

అనుచరులు ముగ్గురు గోడకి చేర్చి వున్న మూడు శూలాలు చేతుల్లోకి తీసుకున్నారు. అంతవరకు రక్తంతో ముగ్గు వేసివున్న వలయంలో వుంచిన ఎముకల్ని ఒక్కొక్కటి తీసుకున్నారు.

ఓ చేతిలో ఎముక, మరో చేతిలో శూలం ధరించి బయటికి వెళ్ళారు.

అభిలాష్ హిమవంత్ ని మోచేత్తో పొడిచాడు. హిమవంత్ కి అర్థమైంది. వాళ్ళు ముగ్గురు తమకోసమే వెళ్తున్నారు! వాళ్ళ ముఖాల్లో ప్రతీకార జ్వాల రగలటం

స్పష్టంగా కనిపిస్తోంది. తమ సహచరుల్ని చంపినందుకు గాను తమందర్నీ క్షుద్రదేవతలకు బలివ్వబోతున్నారన్న విషయం తెలుస్తూనే వుంది! తాము ముగ్గురు లేకపోవటం చూసి మాంత్రికుడు తమకోసం ఆ ముగ్గురు అనుచరుల్ని పంపిస్తున్నాడు!

అభిలాష్, హిమవంత్ ఏ మాత్రం ఆలస్యం చెయ్యలేదు. ఒక్కసారిగా ఆ గదినుండి బయిటికివచ్చారు. ముగ్గురు అనుచరులు మహోద్రేకంతో రాతిగదివైపు సాగిపోతున్నారు.

అభిలాష్, హిమవంత్ వెనుకపాటుగా యే మాత్రం చప్పుడు కాకుండా అనుచరుల వెనుకగా వెళ్ళారు. వెనుక నుంచి శూలాలతో యిద్దరు అనుచరుల్ని పొడిచేశారు.

ఊహించని యీ హఠాత్సంఘటన వాళ్ళు యెదురు చూడనిది! చావు కేకలు పెడుతూ నేల కూలారు వాళ్ళిద్దరు.

మూడోవాడు దిగ్భ్రమతో వారివంక తిరిగాడు. అంతే! యిద్దరూ ఒక్కసారిగా తమ శూలాల్ని అతని గుండెల్లోకి దించేశారు. చేతిలో ఎముకని గాల్లో ఊపాలనుకున్నాడు—కాని అతని ప్రయత్నం సగంలోనే ఆగిపోయింది.

నేలమీద ముగ్గురు గిలగిల కొట్టుకున్నారు కాసేపు. మరో రెండుసార్లు పొడిచారు అభిలాష్, హిమవంత్— వాళ్ళ గుండెల్లో!

ఆ తర్వాత యింకేమీ ఆలస్యం చెయ్యలేదు వాళ్ళిద్దరు. మాంత్రికుడు, తమవాళ్ళు వున్న గది దగ్గరకు పరుగెత్తారు. దీప్తి ఆత్రుతగా చూస్తోంది వారివంక.

గాల్లో వింత శబ్దాలు స్పష్టంగా వినిపిస్తున్నాయి. పక్కనే యెవరో తిరుగాడుతున్నట్టు, ఏవేవో మాట్లాడు తున్నట్టు రణగొణ ధ్వనులు వినిపిస్తున్నాయి—

కింద పడున్న కళేబరాల్లో కదలిక వస్తున్నట్టుగా అవి అటు యిటు కదిలాయి.

దీప్తి ఆ దృశ్యం చూడలేనట్టు కళ్ళు మూసుకున్నది. వర్మ, కార్తీక్, అశ్విని బొమ్మల్లా అలాగే నిల్చుని వున్నారు. వాళ్ళలో ఏమాత్రం చలనంలేదు.

మాంత్రికుడి చేతిలో ఎముక గాల్లో ఆడుతునే వుంది. క్షుద్రదేవతల హడావిడి మరింత స్పష్టంగా తెలుస్తోంది. మాంత్రికుడి పెదాలు మంత్రాల్ని ఉచ్ఛరిస్తూనేవున్నాయి మౌనంగా.

మాంత్రికుడి కుడిచేయి కిందపడున్న పొడవాటి కత్తిని చేతిలోకి తీసుకుంది. ఎడమ చేతిలో ఎముక గాల్లో ఆడూనే వుంది. కుడిచేయి గాల్లోకి లేపాడు. కత్తితో లవుడ్ని కుశుడ్ని ఖండ ఖండాలుగా నరికాడు. కళేబరాలు నుజ్జు నుజ్జుగా ముక్కలు చేస్తూంటే వర్మ, కార్తీక్, అశ్విని—ముగ్గురోను ఎలాంటి చలనంలేదు గాని అభిలాష్, హేమంత్, దీప్తి ఆ దారుణకృత్యం చూడలేన్నట్టు కళ్ళు మూసుకున్నారు.

మాంత్రికుడి కసి అంతా అతని యీ చర్యలోనే వాళ్ళకి బాగా తెలిసివచ్చింది.

మాంత్రికుడు వర్మ దగ్గర కొచ్చాడు. ఎడమ చేత్తో అతని శిరస్సు వంచాడు. కుడిచేతిలోని కత్తి మరుక్షణం అతని శిరస్సుని నరికి వుండేదే!

కాని అభిలాష్ మెరుపులా దాడిచేశాడు మాంత్రికుడి మీద. ఈసారి అతని గురి తప్పలేదు. సరాసరి మాంత్రి

తుడి గుండెల్లోకి దించేశాడు. వెనుకనుంచి హిమవంత్ తన శూలాన్ని మాంత్రికుడి వెన్నున పొడిచాడు—ఒకసారి కాదు, ఎన్నోసార్లో!

మాంత్రికుడి నోట్లోని మంత్రాలు ఆగిపోయాయి.

మహాపర్వతంలా నేలమీద కూలిపోయాడు. కాని చావలేదు. ఇంకా అతని చేతిలోని ఎముక గాల్లో ఊగుతునే వుంది. అభిలాష్ ఆ ఎముకని చటుక్కున లాగేశాడు.

ఒక్కసారిగా గాల్లోని శబ్దాలు ఎక్కడివక్కడ ఆగిపోయాయి. వర్మ, కార్తీక్, అశ్విని ఒకేసారి ప్రాణం వచ్చిన బొమ్మల్లా కదిలారు.

*　　　　*　　　　*

అభిలాష్ మాంత్రికుడి ముందు గొంతుకూర్చున్నాడు. మాంత్రికుడు ఏదో చెప్పాలని ఆత్రుతపడుతున్నట్టు కనిపించింది.

"ఏమిటి, ఏం కావాలి?" అనడిగాడు అభిలాష్.

మాంత్రికుడికి అంతిమ క్షణాలు దగ్గర పడ్డాయని గ్రహించారందరు.

వర్మ, కార్తీక్, అశ్విని, హిమవంత్, దీప్తి—మాంత్రికుడి పక్కగా చేరారు.

మాంత్రికుడి నోటినుంచి యేలాంటి శబ్దమూ రాలేదు కాసేపు.

అభిలాష్ పక్కనే వున్న పాత్రలో నీళ్ళుండటం చూసి, పాత్రందుకొని నీళ్ళు మాంత్రికుడి నోట్లోకి వంచాడు.

మాంత్రికుడు నోరు చప్పరించి, "నిధి.... వేల కోట్ల రూపాయల నిధి...." అంటూ గొణిగాడు.

వర్మ కళ్లు పెద్దవయ్యాయి.

"ఎక్కడ? యెక్కడ ఆ నిధి? వెంటనే చెప్పు?" అన్నాడు.

మాంత్రికుడు చేయి యెత్తి దూరంగా చూపించాడు. అక్కడ్నుంచి పచ్చటి వెలుగు కనిపిస్తోంది! చీకటి బాగా కమ్ముకోవటంవల్ల ఆ వెలుగు మరింత స్పష్టంగా కనిపిస్తోంది.

వర్మ మాంత్రికుడ్ని పట్టి కుదుపుతూ, "చెప్పు, ఎక్కడ దాచావో చెప్పు వేగం!" అన్నాడు.

మాంత్రికుడు పెదాలు కదిపాడు. కాని మాట బయిటికి రాలేదు.

అతని కళ్ళు వాళ్ళవంకే చూస్తున్నాయి—కాని ఆ కళ్ళలో జీవం లేదు. అతని ప్రాణవాయువులు అనంత వాయువుల్లో లీనమై ఎంతోసేపు కాలేదు!

వర్మ పదేపదే మాంత్రికుడ్ని చూశాడు.

"చచ్చాడు, విషయం పూర్తిగా చెప్పకుండానే చచ్చాడు!" వర్మ పళ్ళు నూరాడు.

అభిలాష్‌వంక చూసి, "అనవసరంగా చంపేశావు వీడ్ని! వీడివల్ల చాలా ఉపయోగకరమయిన సమాచారం తెలియవలసింది తెలియకుండా పోయింది! మరీ అంతగా పొడిచి చంపకపోతే నేం?" అన్నాడు కోపంగా.

అభిలాష్ కోపం తెచ్చుకోలేదు, "వాడేం చెప్పేవాడో తర్వాతి సంగతి! మేము ఆలస్యం చేస్తే మీ ముగ్గుర్ని యీపాటికి స్వర్గానికి పంపివుండేవాడు! ఒకసారి వీడ్ని సగం ప్రాణాలతో వదిలేసినందుకే యింత చేశాడు. మరోసారి అదే పొరపాటు రానిస్తానా?" అన్నాడు.

"సంతోషించాం తెలివికి!" ఉక్రోషం ధ్వనించింది వర్మ గొంతులో. అందరూ ఆశ్చర్యంగా చూశారు అతని వంక.

కార్తీక్ అన్నాడు: "ఏమిటి వర్మగారూ! నిధి అంటున్నాడు మాంత్రికుడు! ఇక్కడ నిధి వుండట మేమిటి?"

అందరికీ కార్తీక్ కావాలనే ఆ ప్రశ్న వేస్తున్నాడని తెలుసు. ఇక్కడ యేదో నిధి నిక్షేపాలున్న సంగతి, కళ్యాణవర్మ ఒకప్పుడు వాటిని యిక్కడ నిక్షేపించిన సంగతి గతంలో రాకన్ వాళ్ళకు చెప్పి వున్నాడు. అందుకే టైగర్‌హిల్స్ మీద శివ్వకాలు జరిగాయి. రెండో బేచ్ కూడా అందుకే తర్వటం జరిగింది. అయితే యింతకీ యిన్ని ప్రాణాల్ని బలి తీసుకున్న ఆ నిధి ఉన్న చోటెక్కడ? అందరిలోనూ యిదే ప్రశ్న!

వర్మ అంత ఖచ్చితంగా నిధి విషయం అన్ని వివరాలు ఎందు కడుగుతున్నాడు? నిధి విషయం అతనికి ముందే తెలుసా?

తేలుకొండిల్లాంటి ప్రశ్నలు!

కార్తీక్ ప్రశ్న అందరికీ ఆసక్తి కలిగించింది. వర్మ ఏం సమాధానం చెపుతాడా అని చెవు లప్పగించి చూస్తు న్నారు.

అయితే వర్మ ఏమీ సమాధానం చెప్పలేదు.

కార్తీక్ రెట్టించలేదు.

అశ్వని నోరు విప్పాడు. "వర్మగారూ, యిక తిరిగి వెళ్ళిపోదామా? చీకటి పడిపోయింది. ఈ శవాల మధ్య జాగారం దేనికి?"

వర్మ దీనికి వెంటనే సమాధానం చెప్పలేదు.

"ఏం భయంగా వుందా?" అన్నాడు కాసేపటికి.

"ఆకలితోను, దాహంతోను శోషవచ్చినట్టుంది. భోంచేసి రెండురోజు లయింది. మా పరిస్థితి గమనించే వుంటారు. పళ్ళు బిగువున ఇప్పటిదాకా నెగ్గుకొచ్చాం!" అన్నాడు హిమవంత్.

అతనికి వర్మమీద పీకదాకా కోపం వుంది. అతని మూలాన్నే తామీ మాంత్రికుడి మాయలో పడి కొట్టుకోవలసి వచ్చినందుకు వర్మ పట్ల గుర్రుగా వున్నాడు.

"ఇంతదాకా వచ్చి వెనక్కి పోవటం దేనికి? మాంత్రికుడు యేదో నిధి అంటున్నాడు కదా, చూసి పోదామా?" అన్నాడు వర్మ అందరివంకా పరీక్షగా చూస్తూ.

"ఆ మాంత్రికుడు చావబోతూ సంధిప్రేలాపన ఏదో చేసి వుంటాడు. ఈ దిక్కుమాలిన గుహల్లో నిధులు, నిక్షేపాలు కూడానా?" అన్నాడు హిమవంత్ తీసిపారేస్తున్నట్టు.

"నిధులు—నిక్షేపా లుండేది యిలాంటి మనుష్య సంచారంలేని ప్రదేశాల్లోనే! ఈ మాంత్రికుడు, వీడి అనుచరులు ఆ నిధికోసమే యిక్కడ కాపలా వుండివుంటారు. మనం రావటంతో వాళ్ళ కార్యకలాపాలకు అంతరాయం కలిగింది!"

"మనం వచ్చేదాకా యిక్కడ తీరిగ్గా పూజలు, పునస్కారాలు యెందుకు చేసుకుంటున్నారు? క్షుద్రదేవతల నెందుకు ఉపాసిస్తున్నారు? ఆ నిధి యేదో తవ్వుకుని పోవచ్చును కదా!...." హిమవంత్ లా పాయింటు

తీశాడు.

"ఆ నిధి అంత తొందరగా చిక్కుతుందా? దాని కోసమే వీళ్ళు క్షుద్రదేవతల నారాధిస్తూ, బలులతో, పూజలతో కాళీమాతను ప్రసన్నం చేసుకుంటూ వుండి వుండొచ్చు!"

"అంటే వీళ్ళకూ్కడా ఆ నిధి ఎక్కడుందో తెలీదు. దాన్ని చేజిక్కించుకోవటం కోసమే పూజలు చేస్తున్నారు. అవునా?"

"అదే అయివుంటుంది" అన్నాడు వర్మ.

"మీ కీ పూజల పట్ల, మాయలు మంత్రాల పట్ల ఇప్పటిదాకా నమ్మకం లేదుకదా!" చురక తగిలించాడు హిమవంత్.

వర్మకి యిట్టే కోపం వచ్చేసింది. "నేను వచ్చినప్పట్నుంచీ చూస్తున్నాను. నువ్వు ప్రతిదానికీ యేదో వ్యతిరేకంగా మాట్లాడుతూనే వున్నావు!" అన్నాడు.

కార్తీక్ వాతావరణాన్ని తేలికపరచాలని వాళ్ళ మధ్య కలగజేసుకోని, "వర్మగారూ, మీ కతనితో వాదన దేనికి? ఊరుకోండి.... చెప్పండి యేం చేద్దామంటారు? మా పరిస్థితి మీకు బాగా తెలుసు! ఈ రోజు ఉదయం యీ గుహల్లోకి అడుగుపెట్టక పోయివుంటే చింతపల్లె వెళ్ళి అక్కడ్నుంచి మా వూరు వెళ్ళిపోయుండే వాళ్ళం! మాకు ఓపిక, సహనం పోయాయి. బాగా నీరసం, నిస్పృహలు ఆవరించాయి. ఎంత తొందరగా బయటపడదామా అని ఆత్రంగా వుంది. ఇదీ మా పరిస్థితి!" అన్నాడు.

వర్మ ప్రసన్నంగా చూశాడతనివంక. "ఇప్పుడు బయటకి పోవటం చాలా కష్టం కదా! కన్ను పొడుచు

వున్నాయేం కనిపించటంలేదు. దార్లో ఎలాంటి విషపురుగు లున్నాయో, ఇంకా ఎలాంటి మంత్రగాళ్ళున్నారో! ఈ విషయాలేవీ మనకు తెలియదు. ఈ ప్రదేశం ఉదయం నించీ మనకు అలవాటయిన చోటే కదా! ఈ రాత్రికి ఎలాగో యిక్కడ గడిపేద్దాం. తెల్లవారాక తిరుగు ప్రయాణంచేస్తే బావుంటుంది. ఈ గుహల్లోంచి బయట పడ్డా టైగర్ హిల్స్ మీదనే వుండిపోవాలి. దిగలేం కదా! ఏమంటారు?" అన్నాడు.

"మరి ఆకలి బాధో....?" అశ్విని అడిగాడు.

"ఇందాకా ఓ రాతిగదిలో పళ్ళు చాలా చూశాం కదా! అవి తిని ఆకలి బాధ తీర్చుకుందాం!" అన్నాడు వర్మ.

"అవి యేం పళ్ళో? యెప్పుడూ చూసిన రకంలాగా లేవు. అవి తినవచ్చో, లేదో...."

"నో, నో! అవి తినేపళ్ళు కాకపోతే యీ మంత్ర గాళ్ళు ఎందుకు దాచుకుంటారు? ఈ ప్రాంతాల వాళ్ళకు యేవీ దొరక్క యీ పళ్ళే ఆహారంగా తీసుకుంటున్నా రని నా అభిప్రాయం!"

అందరిలోనూ ఆకలి తన ప్రతాపాన్ని చూపిస్తోంది.

"ఆల్ రైట్, పదండి!" అంటూ లేచారు.

మూడో రాతిగదిలో పళ్ళు, పూలు వున్న చోటికి చేరుకొన్నారు.

* • *

ముందుగా వర్మ కొన్ని పళ్ళు తీసి రుచి చూశాడు. బాగానే వున్నాయనిపించింది.

"తినండి, బాగానే వున్నాయి!" అన్నాడు.

"అంతా చీకటి! అవి ఎక్కడున్నాయో కూడా కని

పించటంలేదు!" అన్నాడు హిమవంత్.

"ఎక్కడినుంచో గుడ్డి వెలురు పడుతోంది, అదుగో"
అన్నాడు అశ్వని.

"అది కాళికా విగ్రహమున్న రాతిగదినించి. అక్కడ
కాగడాలు పెట్టి వుంచారు. వాటి వెలుతురే ఇక్కడిదాకా
ప్రసరిస్తోంది!" అన్నాడు కార్తీక్.

"అలాగా! అయితే యీ రాత్రికి మనం ఆ రాతి
గదిలో అమ్మవారి సన్నిధిలో గడిపేద్దాం. ఉదయం
మాత్రం యెట్టి పరిస్థితుల్లోను యిక్కడ వుండొద్దు. ఇప్ప
టికి జరిగిన దారుణాలు, ఘోరాలు చాలు!" అన్నాడు
హిమవంత్.

కార్తీక్ దీప్తివంక చూసి, "తీసుకోండి. ఏదో
యింత యెంగిలిపడక తప్పదు కదా! ఇదే మన పాలిట
పంచభక్ష్య పరమాన్నాలు!" అన్నాడు కొన్ని పళ్ళు
ఆమెకిస్తూ.

దీప్తి అంతదాకా పెదవి విప్పకుండా మౌనంగా
వాళ్ళను అనుసరిస్తూ వచ్చింది. ఆమె మెదడు మొద్దుబారి
పోయింది. జరిగిన దుస్సంఘటనలు ఆమె లేతమనసు మీద
బలమయిన ముద్రలు వేశాయి. అదో రకమైన జడత్వం
ఆవరించింది మనసంతా.

మౌనంగా అత నందించిన పళ్ళు తీసుకున్నదే గాని
తినటానికి మనస్కరించలేదు.

ఓ పాత్రలో యేదో ద్రవపదార్థం కనిపించింది.
అశ్వని ఆ పదార్థాన్ని పరిశీలనగా చూశాడు. తర్వాత
వేలు ముంచి నాలికపై పెట్టుకుని రుచి చూశాడు.

"అరె పుట్టతేనె! చాలా ప్రశస్తంగా వుంది. వీళ్ళు
యేర్పాట్లు బాగానే చేసుకున్నారు ...రండి, తలా కాస్త

తాగుదాం!" అన్నాడు.

హిమవంత్, అభిలాష్ కూడా రుచి చూశారు. తక్కిన ముగ్గురు ఆసక్తి చూపించలేదు.

అందరూ మళ్ళీ మాంత్రికుడి గది సమీపంలో నడుములు వాల్చారు. గదిలోనికి వెళ్ళటానికి ఎవరికీ యిష్టం లేకపోయింది. ఆ గదిలో ఎన్ని జీవాలు యాగాగా బలైపోయాయో తల్చుకుంటే అందరికీ యేదోలా వుంది. ఆ విషయాలు తల్చుకుంటేనే వాళ్ళకు జుగుప్స కలుగుతోంది.

ఒకరొకరుగా అందరూ నిద్రలోకి జారిపోయారు. బాగా అలసిపోయి వుండటంతో కాసేపట్లోనే గాఢ నిద్రలో మునిగిపోయారు.

అసలు కంటికి నిద్రలేనిది దీప్తికే! ఆమె మెదడు అనేకమయిన ఆలోచనలు భయాందోళనలు సుళ్ళు తిరుగుతున్నాయి. జరిగిపోయిన సంఘటనలు ఓ పక్క, యే ఆపదా లేకుండా బయటపడగలమా అన్న అనుమానం మరోపక్క ఆమె కంటికి కునుకు రాకుండా చేస్తున్నాయి.

ఆమె కదలికలు కనిపెట్టగలిగినవాడు కార్తీక్ ఒక్కడే!

"మిస్ దీప్తీ!" అని పిలిచాడు నెమ్మదిగా.

దీప్తి చటుక్కున కళ్ళు తెరిచి చూసింది. చీకటికి అలవాటు పడ్డ కళ్ళు పరిసరాలని బాగానే గుర్తు పడుతున్నాయి.

"మీరెందుకో అనీజీగా ఫీలవుతున్నారు, అవునా?" అన్నాడు కార్తీక్.

దీప్తి లేచి కూచుంది. ఆమె మనసు సానుభూతికోసం,

తపించి పోతోంది.

కార్తీక్ కి దగ్గరగా జరిగి అతని ముఖంలోకి చూసింది. "మనం బతికి బయటపడగలమంటారా?" అన్నది బేలగా.

"మీకు ప్రాణభయం పీడిస్తున్నదా?" అడిగాడు కార్తీక్ నవ్వుతూ.

"భయం ప్రాణికి సహజంకదా! అయినా నా ఒక్క ప్రాణంకోసమైతే యింత బాధపడేదాన్ని కాదు. కాని" అర్థోక్తిలోనే ఆగిపోయిందామె.

"కాని....? చెప్పండి, ఆగిపోయారేం?"

"ముందు నన్నలా మన్నించి మాట్లాడటం మానేస్తారా, లేదా?"

"పదిమందిలో వున్నపుడు నీ మర్యాద కాపాడాలి కదా! లేకుంటే నన్ను నేను అవమానించుకున్నట్టే!"

"ఇప్పుడు పదిమంది ఎవరూ లేరు కదా....! మీరు, నేను—అంతే కదా!"

"కాని చుట్టూ అందరూ వున్నారు. వారిలో ఎంత మంది నిద్రకి పడ్డారో, ఎందరు మనల్ని పరిశీలిస్తూంటారో ఎలా చెప్పగలం?"

"ఇక్కడ పరాయి వాళ్ళెవరున్నారు? మనిద్దరి విషయం మన కొలీగ్స్ కి తెలుసుకదా! అదీగాక మనం ఊహ తెలీని పసిపాపలం కాదు. మన హద్దుల్లో మనం వుంటున్నాం, బాధ్యత నెరిగి ప్రవర్తిస్తున్నాం. అందుకే మనవాళ్ళందరికీ మనమంటే గౌరవం. అవునా....?"

"అవుననుకోండి. అయినా నాకెందుకో మన వాళ్ళందరూ వుండగా మీ వంక చూడటానికి కూడా ఎంతో బెరుకుగా, సిగ్గుగా వుంటుంది!"

"ఇరవయ్యో శతాబ్దం చివర్లో వున్నాం. ఈనాటి ఆడపిల్లలు మరీ యింత పిరికి వాళ్ళలాగా ప్రవర్తించటం నిన్నే చూశాను. ఈ రోజుల్లో ఆడపిల్లలకి కావలసింది గుండె ధైర్యంతోబాటు, శౌర్యం, ధైర్యసాహసాలు కూడా! తోడేళ్ళలాంటి పురుషులున్న యీ ప్రపంచంలో మీ రక్షణకోసం మీరే జాగ్రత్తలు తీసుకోవాలి. బొత్తిగా బేలలాగా ప్రవర్తిస్తే ఎలా? స్త్రీ అబల కాదు, సబల అని నిరూపించగలగాలి!"

"అందుకే కదా ధైర్యంగా సర్వేకి బయల్దేరి వచ్చాను మీ వెంట! మీరు నాకు తోడుంటారనే నేనీ సర్వేకి బయల్దేరాను. లేకుంటే అడుగు కదిపేదాన్నే కాదు!"

"అదిగో మళ్ళీ పిరికితనం! అగాధాల అంచుల్లోకి వెళ్ళాలన్నా, ప్రమాదానికి వెంట్రుకవాసిలో పోవలసి వచ్చినా, సమస్యల సుడిగుండంలో చిక్కుకున్నా నువ్వు మాత్రం ధైర్యాన్ని ముఖ్యంగా మనోనిబ్బరాన్ని కోల్పో కూడదు....?"

"మీ సాహచర్యంలో నాకు అవన్నీ అలవడతాయని నా నమ్మకం! అందుకే ముందునించి అలవాటు చేసుకో లేదు" అతనికి పక్కగా జరిగి అన్నది దీప్తి.

ఆమె కళ్ళు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. మెరుపు లీనుతున్న ఆమె కళ్ళల్లోకి ప్రేమగా, ఆర్తిగా చూస్తు న్నాడు కార్తీక్. ఆమె ఊపిరి అతని ముఖానికి వెచ్చగా తగుల్తోంది. తనకోసమే ఆమె బతికి వున్నదనీ, తనే ఆమె లోకమనీ తెలుసుకుంటేనే అతని ఛాతీ గర్వంతో పొంగి, ఆమెమీది ప్రేమ వెల్లువలై ఆమె గుండెల్లోకి, గుండె లోతుల్లోకి, ఆమె అంతరాంతరాల్లోకి ప్రవహి స్తోంది.

ఆమెని పొదివి పట్టుకుని మెత్తగా గుండెలకు హత్తుకున్నాడు కార్తీక్. దీప్తి అతని బాహువుల్లో మెత్తగా ఒరిగిపోయి అతని గుండెలమీద తలపెట్టుకుని నిశ్చింతగా కళ్ళు మూసుకుంది.

కొద్ది క్షణాల ప్రశాంతత తర్వాత, ఆమెను బుగ్గమీద సున్నితంగా తట్టి, "ఇదేమిటి, కటిక నేలకన్న యిదే హాయుందని నా గుండెలమీద నిద్రపోతున్నావా?" అన్నాడు కార్తీక్. దీప్తి కళ్ళు తెరిచి సిగ్గుపడింది.

ఇద్దరు హాయిగా నవ్వుకున్నారు.

"కార్తీక్! ఎంతకాలమయింది మనం యిలా హాయిగా కబుర్లు చెప్పుకుని! ఈ సర్వేకు బయల్దేరిన వేళా విశేషమేమిటోగాని, అన్నీ అపదలే కొని తెచ్చుకున్నాం. మృగాల్లాంటి మనుషులు, బలులు, క్షుద్ర దేవతోపాసకులు, క్షుద్ర శక్తుల అగడాలు—ఓహ్, తల్చుకుంటేనే మనసంతా అల్లకల్లోలమయిపోతుంది. అసహ్యంతో ఒళ్ళు కంచించుకు పోతుంది. శవాల మధ్య మనం ఇలా జాగరణ చేస్తూంటే మనసంతా అల్లకల్లోలమైపోతోంది!" అన్నది దీప్తి. ఆమె శరీరం సన్నగా ఒణకటం కార్తీక్‌కి తెలుస్తోంది.

"ఛీ, ఏమిటా కన్నీళ్ళు? ఇంతవరకు ధైర్యంగా కబుర్లు చెప్పి యింతలోనే.... ఎంతయినా ఆడపిల్లవని పించుకున్నావు!"

"నో, యిది భయంవల్ల వచ్చిన కన్నీళ్ళు కావు! నాకు కంటికి రెప్పలా చూసుకునే మీరున్నంతకాలం, మీ నీడలో ఎక్కడికైనా, చివరకి నరకానికైనా నేను రావటానికి సిద్ధం! మీ గుండెమీద నిశ్చింతగా వాలి ప్రాణాలు వదలటానికైనా వెనకాడను...."

"ఛీ, ఎందుకా పాడు మాటలు?" అన్నాడు కార్తీక్ ఆమె నోటిమీద చిన్నగా దెబ్బవేసి.

"తల్చుకోవటానికే మీకు మనస్కరించటంలేదు. నిజంగా వాకేదైనా జరగకూడనిది జరిగితే...."

"ఉష్, యిక మనం మాట్లాడుకోవద్దు! అప్పుడే పెంపదకొండున్నర అయింది. ఇక కాసేపు విశ్రాంతి తీసుకుందాం.... నాకు చాలా బడలికగా వుంది!" అన్నాడు కార్తీక్.

దీప్తి అతన్ని వదల్లేక వదిలి, "అంతా నాటకం, మహా, మీకేనేమిటి అంత నిద్రవచ్చేది? నాకూ నిద్రొస్తోంది!" అన్నది బుంగమూతి పెట్టి.

"అయితే నిద్రపో రాకుమారీ! పాట పాడనా?" అల్లరిగా అన్నాడు.

"మహానుభావా, అంత పని చెయ్యొద్దు. పాపం, మన స్నేహితులు యిప్పుడే కాస్త విశ్రాంతిగా పడుకున్నారు. వాళ్ళ సుఖాన్ని పాడుచెయ్యకండి."

"నా పాటపట్ల నీకింత ద్వేష భావం కలగటం అన్యాయం! సరే, పడుకుంటాను — అటుతిరిగి పడుకుంటాను. నువ్వు పిల్చినా పలకను! అంతే, అ!"

దీప్తి అతని చిలిపి మాటలకు నవ్వుకుంటూ కళ్ళు మూసుకుంది.

* * *

శర్మ హడావిడిగా నిద్రలేపుతుంటే చటుక్కున లేచి కూచున్నాడు కార్తీక్.

అప్పటికే అభిలాష్, అశ్విని, హిమవంత్ పరిసరాల్లో దేనికోసమో దీక్షగా వెతుకుతున్నారు. వాళ్ళ ముఖాల్లో ఆతృత, ఆందోళన స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఏమిటి వర్మగారూ, యేమయింది?" అన్నాడు కార్తీక్.

"ఏం కాకూడదో అదే జరిగింది. మిస్ దీప్తి కనిపించటంలేదు!" అన్నాడు వర్మ.

"కనిపించటంలేదా? ఏమిటి మీరంటున్నది?" దిగ్గున లేచి నించున్నాడు కార్తీక్. రాత్రి దాదాపు పన్నెండు గంటలవరకు తామిద్దరు మెలకువగానే వున్నారు. తెల్లవారి ఎంతసేపయింది?

వాచీ చూసుకున్నాడు. ఆరు గంటలు చూపిస్తోంది. యెక్కడినుంచో వెలుగు కిరణాలు లోపలికి పడుతున్నాయి.

అశ్వని, అభిలాష్ అక్కడికొచ్చి "మిస్ దీప్తి కనిపించలేదు. మనని బంధించిన రాతి గదితోబాటు, ఇక్కడున్న నాలుగు రాతిగదులు పూర్తిగా అంగుళం వదలకుండా చూశాం. ఎక్కడా ఆమె జాడలేదు" అన్నారు.

కార్తీక్ అదిరే గుండెలో ఆ ప్రదేశమంతా కలియ తిరిగాడు. మరోపక్క వర్మ, హిమవంత్ గాలిస్తున్నారు. దీప్తి కనిపించలేదు!

అశ్వని, అభిలాష్, కార్తీక్ వంక ఓదార్పుగా చూసి, "రాత్రి ఆమె విషయమే మరిచి మొద్దు నిద్రపోయాం అందరమూ! నువ్వయినా చూడలేదా?" అన్నారు.

కార్తీక్ అయోమయంగా చూశాడు వాళ్ళవంక.

"రాత్రి చాలాసేపు మేమిద్దరం మాట్లాడుకున్నాం! నేను నిద్రపోకూడదనే అనుకున్నాను. కాని యెప్పుడు పట్టేసిందో ఒళ్ళెరగకుండా పట్టేసింది పాడు నిద్ర!" అన్నాడు.

"అంటే యింకా శత్రుశేషం మిగిలిపోయుండాలి!" అశ్వని పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"ఏమో, ఎలా అర్థం చేసుకోవాలో తెలీటంలేదు. ఇంతమంది ఆమె చుట్టూ వలయంలా, పెట్టని గోడలా రక్షణ వుండగా ఆమెని యెవరు ఎత్తుకుపోయి వుంటారు? వాళ్ళు మనుషులో, లేక ఏ మృగమయినా...." అభిలాష్ తక్కిన మాటలు ఉచ్చరించటానికి సంకోచించాడుగాని, ఆ భావం అందరి మనసుల్ని తాకి భయంకరంగా ప్రతి ధ్వనించింది.

"అయితే దీప్తి....?" కార్తీక్ కి దుఃఖం వెల్లుబికి వస్తోంది. రాత్రి ఆమె చివరగా అన్న మాటలు గుర్తొచ్చాయి. ఆమె చెప్పిందే నిజం కాబోతోందా? గడిచిన రాత్రే ఆమె జీవితంలో చివరి రాత్రా?

వేదనతో తల విదిలించాడు కార్తీక్.

వర్మ, హిమవంత్ కూడా వెతకటం పూర్తిచేసి వాళ్ళ దగ్గరకొచ్చారు.

"సారీ మైడియర్ ఫ్రండ్స్! ఆమె జాడ యెక్కడా తెలియరావటంలేదు!" అన్నాడు వర్మ.

"కార్తీక్, కొంతమంది వెనక్కు, మరి కొంతమంది ముందుకుపోయి వెతుకుదామా?" అన్నాడు అభిలాష్.

"వెనక్కు వెళ్ళటమంటే, టైగర్ హిల్స్ కే కదా! నా అనుమానమే నిజమయితే మనం యిలా ముందుకే చొచ్చుకుపోవటం మేలు! ఆమెకేదైనా ప్రమాదం వాటిల్లివుంటే, అది మన వెనకనుంచి కాదు—ముందు నుంచే జరిగుండాలి! వెనక శత్రువులెవరూ లేరు! మాంత్రికుడితోపాటు అతని అనుచరులందర్నీ చంపేశాం కదా!" అన్నాడు వర్మ.

అందరికీ అతను చెప్తున్నదీ సబబుగానే కనిపించింది. అయితే హిమవంత్ మాత్రం తిన్నగా వుండక వర్మ నుద్దే

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

శించి, "ఆ మాంత్రికుడు చావబోతూ ఏదో నిధి సంగతి చెప్పి చచ్చాడు. అది వెరిఫై చేసుకోవచ్చునని మీ అభిప్రాయం కాదుగదా!" అన్నాడు.

వర్మకి చప్పున కోపం వచ్చేసింది. "సమయం, సందర్భం లేకుండా మాట్లాడుతావేమిటి? మనలో ఒక వ్యక్తి, అందునా ఆడపిల్ల మాయమయిందనే ఆందోళనలో నేను మాట్లాడుతుంటే, అనవసర ప్రసంగం చేస్తావేమిటి? నిధి గొడవ యిప్పుడు దేనికి? అసలు ఆ సంగతి నిన్ననే వదిలేశాను, తెల్సా? ఈ ఉదయం అంతా సక్రమంగా వుంటే యీపాటికి టైగర్ హిల్స్‌కి చేరి వుండేవాళ్ళం! కాని జరిగింది మరొకటి!" అన్నాడు.

కార్తీక్ అంత విచారంలోను వాళ్ళిద్దర్నీ సమాధానపరచాలని ప్రయత్నించాడు. "హిమవంత్ హాస్యాలకు ఎత్తిపొడుపులకీ సమయంకాదు. వర్మగారు నిధి గురించి మనతో ఏమీ ప్రస్తావించలేరు కదా! ఆయన చెప్పినట్టే యీపాటికి టైగర్ హిల్స్ దిగిపోతూ వుండేవాళ్ళం! కాని...."

హిమవంత్ వర్మకు సారీ చెప్పుకున్నాడు. వర్మ శాంతించాడు.

"మిష్టర్ కార్తీక్, మనం రెండు జట్లుగా యేర్పడి రెండువైపులా వెళ్దామంటే నా అభ్యంతరంలేదు. నన్ను ఎవరితో రమ్మంటే వాళ్ళతో వస్తాను. మిస్ దీప్తికి యెలాంటి ప్రమాదం జరిగివుండదని నా నమ్మకం!" అన్నాడు వర్మ ధైర్యం చెప్పే ధోరణిలో.

"మీరు మాకన్న వయసులోను, అనుభవంలోను పెద్దవారు. మీరెలా చెపితే అలా చెయ్యటానికి సిద్ధంగా వున్నాం" అన్నాడు కార్తీక్. అశ్విని, అభిలాష్ తల

లూపారు.

"సరే, అయితే ముందుకే పోదాం పదండి! ముందుకి వెళ్ళాక ఏమైనా విడివిడిదార్లు కనిపిస్తే ఎవరిమటుకు వాళ్ళు విడిపోయి వెతుకుతాం! మనం చేయగల ప్రయత్న మంతా చేద్దాం!" అన్నాడు వర్మ.

"ఆయుధాలు తీసుకోండి!" అన్నాడు అశ్విని తుపాకిని చేతిలోకి తీసుకుని, మరొకటి కార్తీక్‌కి అందిస్తూ.

వర్మ అప్పటికే రివాల్వర్ చేత పట్టుకున్నాడు. మాగజైన్ విప్పి అరు బుల్లెట్సూ సక్రమంగా వున్నాయో లేదో చూసుకుని సంతృప్తిగా తలాడించాడు. బుల్లెట్సున్న బెల్టు అశ్విని మళ్ళీ నడుంకి కట్టుకున్నాడు.

అందరు ముందుకి అడుగులు వేశారు. ఎవరూ మాట్లాడు కోవటంలేదు! మౌనంగా నడుస్తున్నారు.

*　　　•　　　*

ఓ పది నిమిషాల తర్వాత వాళ్ళకి ఓ పర్ణశాల లాంటిది కనిపించింది. కిందనించి పైవరకు రాతిపలకలతో కట్టబడి వుంది. దాదాపు రాతి గదుల్లాగానే నిర్మించబడి వుంది. పైన రెల్లుగడ్డిలాంటి పదార్థంతో అచ్చం పర్ణశాల లాగానే వుంది!

పర్ణశాల పరిసరాల్లో ఏవో గుర్తుతెలీని చెట్లు! అవి దాదాపు అయిదడుగుల ఎత్తు పెరిగి వున్నాయి అంతే! మరుగుజ్జు చెట్లులాగా వున్నాయి.

అశ్విని ఆశ్చర్యంగా చూశాడు వాటి వంక. "సొరంగ మార్గంలో చెట్లు మొలవట మేమిటి?" అన్నాడు.

(సశేషం)

